# నీతిసింధువు

ఇయ్యది

కడప మ్యునిసిపల్ హైస్కూలునందుఁ బ్రధానాంధ్ర పండితుఁడగు

కావ్యస్మృతితీర్థ:

జనమంచి శేషాద్రిశర్మచే రచింపఁబడినది



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ

ప్రకటితము.

శుభమస్తు.

శ్రీమాత్రే నమః

చ. సిరుల నొసంగుఁగాక ముని
సేవితపాదసరోజయుగ్మ యై
హరిహయపంకజోద్భవవర
మాధిపముఖ్యనుతప్రభావ యై
హరు నటి మేన నిల్చి శ్రుతు
లన్నియు స్వీయమహత్త్వ మెన్నఁగాఁ
గరుణకుఁ దావలం బగుచుఁ
గ్రాలెడు శ్రీలలితాంబ యెప్పుడున్.

మ. కత ప్రాయంగఁ దలంచు టే హిత మగుం
గా యద్ది నీత్యున్నతిన్
క్షితిఁ గ్రాలంగఁగఁ జాలునేని మ
ఱియుం జెప్పంగ నేలా తదు
ద్గతధర్మంబులు సాధుశీలమును గ
ల్గం జేయునట్లుండ నా
హితమా నద్ది పఠింప బాలుర కొగిన్
వృద్ధిప్రదం బౌటచేన్.



శ్రీరస్తు.

# నవీనసమాలోచన

---

సనాతనధర్మనిరతులారా! సత్యాన్వేషణతత్పరులారా! భూమండలమున నొకభాగము నవనవోన్మేష మనునట్లు శ్రీసమృద్ధిచే జెలంగుచుండ వేఱొకభాగము శ్రీసమృద్ధి నశింప రిత్తగ నుండును. ఇది సాజమేకదా. నర్మదాతీరభూమిని 'పత్తర్పూర్' అనునగరము పురాతనశిల్పనైపుణిచే నగరరాజమనిపించుకొని చాలకాల మట్లుండి యేకారణముననో క్షీణించి నామమాత్రావశిష్ట మయ్యెననుట నిర్వివాదాంశము. నగరనామమును బోఁగొట్టుకొని పల్లినామమును గూడఁ గాంచిన దననప్పుడు. దానిచరిత్రమును హిందీభాషలోఁ బలువురు వ్రాసియున్నారు. వానిలో నొకటి రెండుకథల క్రీ॥ శ॥ ౧౯౦౫ సం॥ మునఁ గాశీనగరమున విద్యాభ్యాస మొనరించుతఱిఁ జదివితిని. నా కత్యంతమిత్రులుగా నుండిన బ్రహ్మశ్రీ, వినాయకభట్టాచార్యులుగారును వ్రాసినవారిలో నొకరు. ఆనగరమున వింధ్యవాసిని యనుపేర జగదంబ వేంచేసియుండుననియు: దన్మహత్త్వ మనుపమానమనియు వారు తెల్పువారు కాశీనగరమును వదలినపిదప నాప్రస్తావమే మానితిని.

ఆనగరము సనాతనధర్మతత్పరుల కునికిపట్టుగా నుండెనని యుఁ గలికాలము ముదురఁగా నందధునాతనాచారతత్పరులు ప్రబలిరనియుఁ జెప్పువారు పెక్కండ్రు కలరు. కాశీనగరమున హనుమద్ఘట్టమున నివసించిన నామిత్రులు బ్రహ్మశ్రీ, రాచకొండ అన్నయ్యశాస్త్రిగారు కొన్నియాఖ్యాయికలను వ్రాయ నన్ను బ్రోత్సహించుటయేకాక వానికి వలయుసాధనముల వ్రాసియుఁ బంపిరి. అందొక్కకథ నాశ్రయించి దీనిని వ్రాసి నీతిసింధు వని నామకరణముచేసితిని. ఇందుఁ బ్రధానముగా స్వేచ్ఛాచార పరాయణులు తుదకు దుఃఖములపా లగుదురనియు, శాస్త్రాచారముల నవలంబించి సత్యసంధులై తగువారు గౌరవము నొందుదురనియు నీతిద్వయము పొడకట్టు. లోకానుభవముచాలక దేవతాభక్తిలేక తోఁచినయట్లు ప్రవర్తింపరాదనియే యీ యాఖ్యాయికయందుఁ గలసారమని తోఁపక మానదు. ఇందుఁ గొన్ని పేరులు నాకల్పించినయవి. అవితప్పఁ దక్కనకథయందు నాచేసినమార్పులు విశేషించిలేవనియు విన్నవించుచున్నాను. ఇదియంతయుఁ గల్పితమా యని తొలుతఁ దోఁచును. కాని యించుక యోజింప జరిగినకథయే యనియు నదియును నలువది యేండ్లకు నించుమించుగాఁ బరుకాలమునఁ గలకథ యనియు స్ఫురించును.

ఈయాఖ్యాయిక వ్రాయునపుడు బుద్ధిని విశేషించి శ్రమ పెట్టితినని చెప్పుకొనఁదగి నన్నివిచిత్రము లిందేమియు లేవు.

మిత్రుఁడు వ్రాసిపంపినకథ నించుక తలక్రిందుగా వ్రాసితినని విన్న వించువాఁడ. నన్నిట్లు ప్రోత్సహించినందులకు వారికి నాకృతజ్ఞ తను దెలుపుకొనువాఁడను. కృతజ్ఞత సజ్జనలక్షణ మన్న న్యాయము నాశ్రయించి నాగ్రంథములన్నియు ముద్రించు టలో నెంతో సాయముచేసియుఁ జేయుచుండియుఁ జేయఁగల్గి యు నున్నయాంధ్రభాషాకల్పతరువు లనఁదగి పరోపకారపరా యణులైయున్న మ-రా-శ్రీ, వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారికి దీని నంకిత మొనర్చితిని. ఇంతకంటె వేఱుమార్గమున నుపకారము చేయఁజాలని నేను జంతువునకు నూలుపోగనునట్లు దీని నర్పించి తిని. దీనియందుఁ గలలోపములను నాకుఁ దెలుపఁ బండితోత్త ముల నభ్యర్థించువాఁడను. ఇంకను జెంచి వ్రాయఁదగినవి శేషము లెవ్వియు నాకు లేవు. ఇందెందేనియు గల్పించినభాగమే లేద నియుఁ జెప్పఁజాలను.

ఇట్లు సజ్జనసేవకుఁడు,

జనమంచి శేషాద్రిశర్మ.

శ్రీ ర స్తు

# నీతిసింధువు

## మొదటి తరంగము.

భానుమండలము తన ప్రతాపవైభవమున నలుదెసల నాక్రమించియంధకారారులఁ బాఱఁద్రోలి యెందునుం దనకెదురుపడువస్తువే లేకపోవుట స్వేచ్ఛఁగాఁ బ్రవర్తించి ప్రవర్తించి నూతనభూభాగమునఁ దనప్రతాపము నింపఁ దటాలుననూహించి యెచటికో పోయెను ఎందుల కెచ్చటి కేగెనో యెట్లుపోయెనో యెవ్వ రెఱుంగరు. పడమరసంద్రమున మునుఁగు నని కొందఱును, బశ్చిమశైలశిఖరముచాటునకుఁ బోయె నని మఱి కొందఱును బలుకుదురు అది యొక్కచోట నుండఁగా భూమి తనచుట్టు తాను దిరుగుటచే నామండల మస్తమించిన ట్లగపడు నని తత్త్వవేత్తలు కొందఱు నుడువఁ గొంద ఱా పల్కుల నాదరింపక కేరడములాడుదురు. భూమి గుండ్రని యాకృతి కల దని సాధువులు పలుకఁగాఁ గొందఱు నీకుఁ గన్నులు పోయినవా? చూడు మెట్లున్నదో దర్పణాకృతిఁ గాన్పించుట లేదా యని యీసడింతురు. దానియాకృతి యట్లగపడును గాని యది కదంబకుసుమమువలె గోళమనియు, దానిచుట్టును సూర్యబింబము తిరుగుచున్న ట్లగపడును గాని నిక్కముగా సూర్యబింబమున సున్నవారల కిది దృశ్యా

దృశ్యముగ నుండుననియు, భూలోకవాసులకు నించుమించు సూర్యబింబము పదునొకం డంగుళములపరిమితి గలదిగా దృగ్గోచర మగుననియు దీనింబట్టి యూహింపఁగా భూమికంటె ననేకకోటులపరిమాణ మధికమనియు ఖగోళశాస్త్రవేత్తలు పలుకఁ గొందఱు చప్పరింతురు గాని యది కా దిది యని బదు లిడఁ జాలరు. ఏలయన నట్టిశాస్త్రమునఁ గృషిచేసినవారు కారు ఊరక వా రుండువారు గారు. ఆక్షేపించుటలోఁ బెద్దలుగా నుందురు. పెద్దలమాటల వా రాదరించి యూరకుండుటయే వారికి మర్యాదగా నుండుఁగదా. పురాణములయందుఁ గల మాటల యంతరార్థ మెఱుంగక వాని ననుసరించి యిట్లు ప్రశ్నించి యుందురనుకొనఁ గూడదా యన్న మంచిదే యనవలయును.

ఇట్లు సూర్యబింబము ద్వీపాంతరములను బవిత్ర ములుగాఁ జేయ నరుగఁగా మూలమూలల డాఁగియున్న యంధకారములు సాంధ్యరాగము సూర్యబింబమే యనుకొని కొలఁదినిమేషము లూరకుండి యవి వరుసగాఁ గృశీభూతము లగుచుండఁ గాంచి చెలరేఁగి నలుదెసల వ్యాపించెను. అంధ కారారులవలని భీతి ప్రాణికోటులకు నంతగాఁ గలుగకయుండఁ బరమకరుణాళు వగు పరమేశ్వరుఁడు నక్షత్రములు పొడ సూపునట్లు లొనరించెను. నక్షత్రము లనఁగాఁ జలనము లేని వని భావము. సృష్టియందు స్థిరవస్తు వొక్కఁడే నుండవన్న నివి యెట్లు గలవని ప్రశ్నింపవచ్చును నక్షత్రము లనఁగా బ్రహ్మాండము లని యర్థము ఆలోకములయందును బ్రాణి సంతతు లుండును. భూలోకమునఁ గల ప్రాణికోటి యెట్టిదో

యట్టిదే యందు నుండునాయన్న నౌనన రాదు. అనేక భేద ములుగల జీవరాసులయందుఁ గొన్ని యందును గలవనవల యును ఆలోకముల కొక్కొక్కదానికి సూర్యుఁడు చంద్రుఁడు లోనగు దేవతలున్నవారు వారి ప్రకాశముచేతనే యవి వెలుం గును. కావున నక్షత్రములు భూగోళమునకంటె స్థిరము లన వలయును అట్టిలోకము లన్నియు నఱువదిగడియలలో (ఇరువదినాలుగుగంటలలో) భూమి చుట్టును దిరిగి వచ్చుచు న్నయ ట్లగపడును భూమి తనచుట్టును దాఁదిరుగుచు సూర్యుని కభిముఖముగాఁ జలించును. కాఁబట్టి భూమికి గతులు రెండని ఖగోళశాస్త్రజ్ఞులు వక్కాణింతురు.

నక్షత్రములు కడుంగడుం జిన్నవిగా నున్నయ ట్లగ పడును. కాని యవి భూగోళమునకంటె నెన్నిమడుంగులో పెద్దవి వాని పరిమితింబట్టి భూగోళపరిమాణము నాలోచింప నత్యల్పతమ మనవలయును. ఇంత చిన్నిగోళముచుట్టు నట్టి మహత్తమగోళములు తిరిగి వచ్చుచున్న వనుట పరిహాసా స్పదము కాదా భూమి చలించుచున్న ట్లగపడదు. కాని వాని తత్త్వమెఱింగినవా రిద్దానిగతి నెఱుంగఁజాలుదురు. నక్షత్రగోళము నెంతయో దూరమునం దున్నవి. కాననే కొన్నిదృశ్యాదృశ్యములుగ నుండుచు. కొన్ని యించుక పెద్ద విగాఁ గనఁబడును అట్టి నక్షత్రగోళముల ప్రకాశ మించుక భూమిపై వ్యాపింపఁగాఁ బ్రాణులదృష్టు లించుకించుకగాఁ బదా ర్థములు లోనగువానినిఁ గనుఁగొనఁజాలెను. ఎట్టికష్టములుగాని రానీయక భగవంతుఁ డుచితరీతి గాపాడుచుండుననుట కిది యొకయుదాహరణము.

ఆ యంధకారమున నక్షత్రరోచిస్సు లించుక వ్యాపించి యుండిన యాకాలమునఁ దొలిజాము దాఁటకమును పే రాజ మార్గమున మానవుల రాకపోకలు సుంతగా నుండుతఱి నొక పురుషవ్యక్తి నడచుచుండెను. ఆతనిమోము సంతోషమును వెలిపుచ్చుచుండెను. ఇరువదేనువత్సరములు మించని ప్రాయ మాతనువు నలంకరించి యుండెను. నాలుగుప్రక్కలకుఁ దన చక్కనిచూపులఁ బ్రసరింపఁజేయుచు నాపూరుషుఁడు మెల్ల మెల్లన నడచుచుండెను. ఆతని మనఃపద్మమున సంతోషము మూర్తీభవించి యధిష్ఠించి యున్నచందమును మోముచందు రుఁడే తెలియఁజేయుచుండెను. మనస్సంతోషము ముఖము తెలుపునన్న నానుడి యేనాఁడును దప్పదు గదా! కొంతదూర మాతఁ డిట్లు లా రాజమార్గమున నడచి యందున్న యొకనా టకశాల సమీపించెను. దాని ముంగిటఁ గొందఱు పూరుషులు వయస్స్ఫురితులు గూరుచుండి మాటలాడుచుండిరి. వారి సంభాషణము లోకాచారముల వైఖరిని వెలిపుచ్చుచుండెను. వారు నవ్వుచుఁ జప్పట్లు చఱచుచు భాషించుచుండిరి. అందు నొక్కఁ డెంతయు మనస్సున విచారము కలిగియున్నట్లు తెలుపు మాటల వెదఁజల్లుచుండెను. క్రొత్తగా నచ్చటఁ జేరిన పురుష వ్యక్తి వారికడఁ గూరుచుండి వినుచుండెను వా రామాటల సందడిలో నీవచ్చిన క్రొత్తవాని నెఱుంగఁజాలక సంభాషణ మును సాగించుచునే యుండిరి. తన్నుఁ బలుకరింపక వా రుండుటయు, సంభాషణత్వర తగ్గకయుండుటయుఁ బరికించి వారియూహా లడ్డులేక నలుదెసలకుఁ బ్రాఁకి లోకము నాక్ర మించి యవ్వలికింగూడ దాఁటఁదలంచుచున్న ట్లగపడియెను.

దాన నించుక శాంతమువహించి యా సంభాషణసారము నెఱుంగందలంచి యూరకయుండెను. వారిభాషణములు క్రమ క్రమముగాఁ దీవ్రరూపములఁ దాల్చుచుండెను ఆ వార్తా టులఁ బరికించి వీరంద ఱెవ్వరివిషయముననో విచారప డుచు వారికి సాయపడ నుంకించుచున్నయ ట్లాక్రొత్తవిగ్రహ మునకుఁ దోఁచెను మఱియుం గొంతవడి వినుచుండెను. తుద కుఁ దనయూహాయే సత్యమని పొడకట్టఁగా సంతోషించెను.

ఒకటి రెండుగడియ లట్లే మాటలు సాగుచుండఁగా నందొకచోట నించుక యవకాశము దొరకఁగా "విధివిధానం బప్రతివిధానము కాదా" యని బదులు చెప్పెను. ప్రశ్నిం చిన యాతరుణుఁడు తగినట్లు సమాధానము వచ్చుటంబట్టి యాప్రక్కకు మోము త్రిప్పిచూచి బాబూ! మీా రెప్పుడు వచ్చితిరి? ఈ మాటలగొడవలో మీారు వచ్చి కూరుచున్నది కూడ నెఱుఁగఁజాలమైతి మని తోడివారలం గలుపుకొని మాటలాడి తమవిచార మే యిందులకుఁ గారణ మనునర్థ మును దెలిపెను. ఆతఁడును వారితో మీామాటలవైఖరిం బట్టి మీా కడ్డుపడ రాదని యూరకుంటిని ఇంతలో మించి పోయిన దేమున్నదని బదులుచెప్పి వారిశంకను దీర్చి వారిని గలిసి మాటలాడఁ జొచ్చెను. పరస్పర క్షేమవార్తాప్రశ్నా నంతర మచ్చో నందఱు కొంతదనుక నేవో మాటలాడుకొను చుండిరి. కాని యీా క్రొత్తపూరుషునిమాటలు తక్కినవారి మాటలం గలిసియుండఁ జాలవయ్యెను. దానంజేసి వారు తమభావ మీాతఁ డెఱుంగఁ డని యాలోచించి యతఁ డడు గకయున్నందునఁ జెప్ప నేల యని యథాపూర్వముగా మాట

లాడఁ జొచ్చిరి. తుద కతఁడు వారితో "నను్గు మిత్రములారా! మీ మానుడులు చక్కఁగా నా కపగతములు కాకయున్నయవి. అంతియగాక విచారమును దెలుపునవిగా నామది కిం దోఁచుచున్నయవి విచారహేతువు నెఱుంగం గోరుచున్నాఁడను. అది తెలుపఁదగినదయ్యెనేని తెలుపుఁడు. లేనిచో మానుఁడు. తెలుపకపోయితిరని నే నూహింపను వినినకొలఁది నుత్తలంపాటు హెచ్చుచున్నది అదియే దానినడుగ నన్నుఁ బురికొల్పెను" అని తనప్రశ్నసారమును ముగించెను. వారు నావిషయమును జెప్పనే పూనియుండిరి గాని దాని కీప్రశ్నము చక్కనియవకాశ మిచ్చెనుగావున నించుక రహస్యముగా శ్రుతిపుటమార్గమున మనస్సునకుఁ దెలియఁ జేసిరి. అత్తరుణమున నాతనిముఖము క్రొత్తగాఁ గనుపట్టెను మదిఁ గలచింత మోమునఁ దెలుపఁబూనిన ట్లుండెను. కొంతగడియ లం దుండి వారింగూడి యించుకదూరము పోయెను. పిదప నెవ్వరియిరవులకు వార లరిగిరి.

ఇది మొదటి తరంగము.

---

# రెండవ తరంగము.

భరతఖండమున నుండు కొండలయందెల్ల హిమాలయము పర్వతరాజమని విఖ్యాతి గాంచెను దాని కెన్నియో యోజనముల దక్షిణపుదెస వింధ్యమను మహీధరము కలదు. దానిచరిత్ర మతివిచిత్రము. ఆపర్వతమే యీ భూఖండమును రెండుగ విభజించును. దానికి దక్షిణమున నున్న భాగము

నకు దక్షిణాపథ మనువేరు ప్రసిద్ధమయ్యెను అందనేకపుర వరములు గలవు వానిలో సకలవిధములఁ బ్రఖ్యాతి వహించి యొక్కనగరము విలసిల్లుచుండెను. దానిశృంగార మున్నదున్నట్లు చెప్పు నెవ్వరికే నలవిగాదనుట స్వభావవిరుద్ధము కానేరదు నదీతీరమునసుండక నది కించుకదూరమున ధర్మపదము గలదేవత దిక్కునఁ గనుపట్టుచుఁ జూచువారలలోఁ బెక్కండ్రకు నేత్రపర్వ మొనర్చుచుండెను. కొందఱి కించుక యేవను గల్గించుచుండును. అందఱి కొక్కటెఱంగున సంతోషమునుగాని విచారమునుగాని గల్గించునది లోకమున లేదనుసిదాంతము సర్వజనాంగీకృతమే యగును గదా. వరుసలుగాఁ దీర్చికట్టిన మేడలు విశేషించిలేకయున్నను, గొన్ని గైన సుందరంబుగ జేసి చూడఁదగియే యుండును. సప్తభౌమాష్టభౌమము లానగరమున నాకాశకుసుమ మనుట నిక్కము. విశేషించి యాపురమున మట్టిగోడలు గలగృహము లెక్కుడుగఁ గలవు. వానిం జూడఁగా నాగరకత యాపూర్వరమున విశేషించి తాండవమాడుజూడ కనఁబడకుండును విపణివీథు లొకొక్కసమయమున జనాకీర్ణము లై యుండును. కొన్ని సమయముల నత్యల్ప సంఖ్యాకజనయుతములై యుండును. కావున నందుఁ గలశ్రోత్రియులు మడుగుకట్టుకొని వేఱొక చోటికి భోజనమునకుఁ బోవుచు నామార్గమున నరుగ సందేహింపకుండిరి క్రయవిక్రయవ్యాపారము చక్కగనే సాగుచుండుట వైశ్యులు ధనవంతులుగ నుండిరి. తక్కుంగల జాతులవారంతధనవంతులు గారు కాని యెల్లరు నన్నదానమున విఖ్యాతిని గడియించిరి. అదియే ప్రాచీననాగరకతను వెల్లడించును గదా

ఆ పురముచుట్టును గొండలు వరుసగా నుండును. కొన్ని దూరముగను, గొన్ని సమీపముగ నుండుటంబట్టి యెండలు మెండుగ నుండును. ఆకారణముననే కాబోలు నగరవాసులు వెలవెల బాఱుమోములు గలవారుగా నుండుట. నూత్నయౌవనమున లావణ్యము పొడసూపిన నది కొలఁదివత్సరములకే యడఁగంటును ఈవిషయముమాత్రము స్త్రీపురుషుల కద్వైతభావమునే తెలుపును ఏ నాలుగుసంవత్సరములో తప్ప లావణ్యము జనులయం దుండక యెచ్చటికో పోవుచుండును. శరీరారోగ్య మంతగా లేమియు నిందుల కొక కారణమై యుండనోపునని యొక్కకొంద ఱూహించి రను ప్రతీతియుఁ గలదు. ఆరోగ్యమునుబట్టి యాయువు విశేషించి నిలువక పరుగిడుట యద్దానిస్వభావము గదా. ఇట్టిలోపములు కొన్ని యున్నను జనసామాన్యమును బట్టి పరికింపఁగా సౌందర్యముగలదిగనే యుండుననఁదగు నని తేలును. ధర్మగుణ మా నగరవాసులకుఁ బెట్టనియలంకారమనుట తగినమాట. అది యొక్కయలంకారమే సర్వాలంకారముల మించుననవలయుఁ గదా ఆయలంకారమునకుఁ దోడుగ నందుఁ గలమనుజులలో బెక్కండ్ర కసూయ యధికముగా నుండును కావుననే విద్యామహత్త్వ మవ్వారియందు మిక్కిలి తక్కువ యనవలయు. దేశాంతరసంచారము లేకుండుటయు, బహుశ్రుతులం గూడి యుండుభాగ్య మొదవకయుండుటయు శాస్త్రవిచారము విశేషించి చేయకుండుటయు నను నివి వారికొక్క కొఱంతను గల్పింపఁజాలియుండు నని యనుమానింప నవకాశ మిచ్చును.

ఇట్టిలోటులు కొన్నియుండినను ధర్మగుణ మవ్వానినెల్లఁ గప్పిపుచ్చుచుండును.

"పూనికమీఱ సర్వగుణభూషణ మెన్నఁగ శీలమేసుమీ"

అన్న భర్తృహరిసూక్తి యాపురవాసులయందు ధర్మస్వభావముచుబట్టి యూహించిన సమన్వయింపఁదగియేయుం డును. ఆఁకలికొన్నవార లాయూరివారలకంటెఁ బడిన సంతృప్తు లగుదురనుట సత్యము. తమతమ పనులుచూచుకొని వేళ కన్నసత్రములకుం బోయి భుజించి మరలఁ గృత్యములున్నం జేసికొని రాత్రులయందు గృహస్థుల యిండ్ల కరిగి చక్క భుజించి నాటకములు చూచి తమతమగ్రామములకుం బోవుట క్రొత్త వారియాచారమై యుండెను. అన్నదానమునఁ బూరుషుల కన్న వనితలే మిక్కిలి యక్కజమగు ప్రసిద్ధిని సంపాదించియుం డుటే యాపత్తనమహత్త్వమును వేయినోళ్ల వెల్లడించుచుం డును రామాయణ భారతభాగవతాది సద్గ్రంథపఠన మాయ లవాటుసు వారినెడఁ బాయకయుండఁజేసెననుట యెంతయు మంచికారణము. పౌరాణికుల కానిగమోత్తంబు శ్వశురగృ హము ప్రతివీధియందు నేదోయొక పురాణపారాయణము సర్వకాలము సాగుచునే యుండును. వనితామణులకు బ్రత్యే కముగాఁ బురాణము చెప్పుతావులు నియమింపఁబడియుండు. వానియందుఁ బండ్రెండునెలలలో నే నాలుగుదినములో తప్పఁ దక్కినప్పుడెల్లఁ బురాణపాఠము జరుగుచునే యుండును. అచ్చోటఁ జేరి పురంధ్రీమణులు తమకుచితములై యటఁ జేయఁ బ్రతిబంధకములు కానిపనులను జేసికొనుచు నాపురా ణార్థముల వినుచు వారి నిష్టాన్నదానాదులచేఁ దృప్తి

నొందించుచుందురు. కాఁబట్టియే యాతావులకుఁ బురాణములకు వియోగము లేక సంయోగమే కలుగుచుండును. పౌరాణికులు భక్తులైయున్నను లేకున్నను వినువారు భక్తి గలవారలనియే యూహింపం దగును. వినువారి కిది యిన్ని మాఱులు వింటిమే యని విసుఁగుగాని, చెప్పినట్టివారి కిన్ని సారులు చెప్పితిమే యను విసుఁగుగాని లే దనవలయును. ఏల యనఁగా సాంసారికకృత్యము లటు గొన్ని సాగుచుండును. కావున నిది లోపించెనే యని వారికిఁ దోఁపకయుండును. కావున "స్వామికార్యము స్వకార్యమును" అన్న నానుడి వ్యర్థము కాకయుండెను ఇట్టివిశేషములంబట్టి యానగరము పెక్కండ్ర కునికిపట్టయి ధర్మమునకు నెలవై విశ్రాంతికి స్థానమై యాచకులకుఁ గల్పభూరుహమై యతులకు సుఖనివాసమై మంచి బుద్ధులకు సంతోషదాయకమై ధార్మికులకు విఖ్యాతిప్రదమై యలరారుచుండును

ఆ పురముచుట్టును బూవులతోఁటలు గలవు. జాజి మల్లికా కుసుమముల కావీడు పుట్టినయి ల్లనవలయును. గొప్ప వృక్షములుమాత్ర మావీటికి నలుఁగడలఁ గనఁబడకపోవుట కేమి హేతువో యని మార్గమునఁ బోవువా రూహింతురఁట. ఆప్రోలు తూరుపు, పడమరలకు నిడివిగా సాగక దక్షిణోత్తరభాగములకు వ్యాపించియుండెను. అంతియకాక యాపురము మూఁడుభాగములుగా విభజింపఁబడి యుండెను, మొదటిభాగమును వేఱుచేసినది జలాశయము, మఱియొక భాగమును విడఁదీసినది నీటిపట్టులు. ఆ మూఁడుభాగములును గలిసియే యొకప్రోలుగా మున్నెన్నఁడో యుండెనఁట. నడుమ

నివి కలిగి మూఁడుభాగములుగా నొనర్చి యానగర శ్రీవిలాస మును ఖండించెనని ముదుసలులు పలుకుదురు ఆమాట యెంతదనుక నిజమో యూహింపఁజాలమని కొంద అందురు. ఏది యెట్లున్నను మొత్తముమీఁద నాపురము చూచుటకు మూఁడుభాగములుగా నడుమఁ జేయఁబడినజాడ గనంబడును. ఒక్కభాగమే యించుక పెద్దది తక్కుంగల రెండుభాగము లిద్దానిం గాంచి వానిని జూడఁ జిన్నవిగఁ గన్పట్టును. శివకేశ వులయాలయములే యానగరమున భక్తులుండిరన్న విఖ్యా తిని వెలుపుచుండును. శ్రీమహావిష్ణువు పాపహరమగు తన క్షేత్రపేరును సార్థకముచేయుచు నందు వేంచేసియుండును. భక్తులు జగత్ప్రసిద్ధక్షేత్రముల కరుగుచు నందుదిగి యావిష్ణు మూర్తిం దర్శించి పోవుచుండుదు. ఆకారణముననే కాఁ బోలు దేవాలయము నాల్గుదెశల వైష్ణవులగృహములు పొడ కట్టుచుండును. అవి చాలుగాఁ గట్టఁబడి ద్వారభాగమున మూఁడునామములు ముచ్చటగాఁ దీర్చిపెట్టుటచే నించుక యందమును వానికిం గలుగఁజేయుచుండును అందలివారెల్ల నా శ్రీమహావిష్ణువును నమ్ముకొని యున్నవారలే అందుఁ గొందఱు మహార్చకులు, కొందఱు ధర్మకర్తలు, మఱియుఁ గొందఱు ప్రసాదభక్తలు, అని మూఁడువిధములుగా విఖ్యా తులై యుందురు. శీతకాలమందేమి, మండు వేసవిసమయమం దేమి, జడివాన కురియుచుపుడేమి యొకవిధముగనే స్నానము చేసి నామధారణముచేసి పట్టుపంచెలు ముచ్చటగాఁ గట్టు కొని యందును బట్టుచుపై సిగనిగలాడుచుండ భగవత్ప్రసా దపరిగ్రహణముకొఱకు. దిరుగుచుందురు. భగవన్నామము

నందును సత్ప్రసాదమునందును వారికి భక్తి కడుమెండు. ఆలయమున కించుక చెంత నొకసరస్సు కలదు. అందుఁ గమలములు దొరకవుగాని మందు వేసినను గమలములుగు నొకటుల యరిది. దానికేమో కమలావాసమనియే పేరు పద్మసరోవరమని కొందఱు వాడుదురు కాని వైష్ణవుల కాపేరు గిట్టదు. ఆసరస్సును విశేషించి వనితామణులు సేవింతురు. భోజనపాత్ర ప్రక్షాళనమందే జరగును. కావుననే కాఁబోలు సస్త్రటములు నీలవర్ణములుగాఁ గనుపట్టుచుండు యాత్రికు లందు మునుంగుదురు. ఆ సరోవరస్నానము పరమపవిత్రమనియే వారి విశ్వాసము. ధనుర్మాసమునందు విష్ణుమూర్తికి మహోత్సవములు సాగును నైవేద్యము లధికముగా నాచరింతురు. యప్పటి మహోత్సవములలో నెల్ల ప్రధానము. భక్తిమాట యావైష్ణవులవిషయమున నెట్లున్నను భుక్తిమాట చక్కఁగా సాగుచుండును చక్కెరపొంగలి వారికి మిక్కిలి ప్రీతిని గల్గించు నైవేద్యము. అదియే భగవంతునకు విశేష ప్రీతికరమని వారుపదేశించుచుందురు. దానినుండి స్ఫూర్తియు ప్రారంభించుచుండవలయుననుట ఆపదార్థము నారగింపుచేసిన నారాయణమూర్తి వరముల నప్పుడే యిచ్చునని వారి యుపదేశసారము. వాని నాదరించు తైర్థికులు ధనమిచ్చి యానైవేద్యము నారగింపు చేయించి వారిడిన యేయించుకంతయో భగవత్ప్రసాదమని భక్షించి చేతులు కడుగుకొన్న మహాచారపరులు వైష్ణవులమాటల విశ్వసించి కట్టుగుడ్డలచేఁ దుడుచుకొని పోవుచుందురు. నిక్కమాలోచించిన నిది భోజన ప్రియుల యుపదేశమనియు శాస్త్రాభిప్రాయము కాదనియు నచ్చటఁ దోఁచకపోదు.

శ్లో. "పత్త్రంపుష్పంఫలంతోయం యోమే భక్త్యాప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః"

అని గీతాశాస్త్రమునందు భగవంతుఁ డుపదేశించినను వారి కది నచ్చలేదు కాఁబోలు ఇట్టివారినే కాఁబోలు తెనుఁగు భాషలోఁ బరిహాసముగా "సాపాటురామన్న"లందురు

ఆనగరభాగమునం దొకచోట మహత్తరమగు శివాలయ ముండెనఁట. కాని యది యాతరుణమున నామమాత్రావశిష్టమై పాడుపట్టెను. అం దొకచోట ధనమున్నదని యొక కాలమునఁ గొందఱుభక్తులు భగవత్ప్రసాదమునం దాదరముచేత నర్ధరాత్రమున మాంత్రికులసాయమునఁ ద్రవ్విరనియు వారిశ్రమమునకుఁ బ్రతిఫలముగా శశిశేఖరుఁడు వారికి నీల మృద్భాండశకలముల ననుగ్రహించెననియు నింతియే చాలునని తెల్లవాఱుజామున వెడలిపోయిరనియు పెక్కండ్రు చెప్పుచుందురు. దేవునిక్రింద ధన మునిచిన నెక్కుడుశక్తి యావిగ్రహమునకుఁ గలుగునని జాల్ములమతము కర్మఠులమత మది కానే కాదు. భక్తిచేఁ బూజించినఁగాని యావిగ్రహమునం దొక్కశక్తియుఁ గలుగదు. భావనయే దానియందు శక్తిని గల్పించును.

వేఱొకనగరభాగము జలావృతప్రదేశము. అందుండువా రనారోగ్యభాగ్యోపేతులు. తేజోహీనులుగా నుందురు. నీటిపట్టులు నలుఁగడల నుండఁగా నాప్రదేశ మట్టిదయ్యెనని జనులు వాడుదురు. అందుండువారు విశేషించి కృషివ్యాపారపరాయణులు. మొండిపట్టుదల గలవారుగా నుందురు. వారు కాలమును విశేషించి ద్యూతపానములతోఁ బుత్తురఁట. విద్యా

ధికులతో వారికిఁ జెలికారము లేదఁట నీచమానవులతో నిరం తరసంగతి కలదఁట కావున వారి ద్రవ్యమంతయుఁ బరోప కృతి కించుకంతయుఁ గర్చుపడక పైవిధముగా వ్యయమగు చుండునని యందలివారు వాకొందురు. అట్టివారి కనారోగ్య భాగ్యముండుట వైద్యులకేని సాయమగును

మూఁడవభాగ మారెండింటికంటె నించుక పెద్దది. అందే ధనికులు విద్యాధికు లుండుప రాజకీయోద్యోగు లాభాగముననే యుందురు. చూడఁదగినభాగ మదియే యన వలయు కాని యందు ననారోగ్యమే యారోగ్యముతోఁ గల హించి విజయ మందుచుండునఁట అట్లున్నను విదేశీయు లందుఁ బెక్కండ్రు జీవికకై నివసించి యుందురు. పూర్వము నుండి యందే నివసించువారికంటె విదేశములనుండి వచ్చిన వారిసంఖ్య హెచ్చుగా నుండును. వారే మర్యాదను సంపా దించుకొనియుందురు కాని ప్రాఁతవారికిఁ గీర్తి లేకపోలేదు. దాతలని ప్రఖ్యాతిఁ గాంచియుందురు రాజకీయపరిశ్రమ ములందు వారి కంతప్రాముఖ్యము లేదనుట యథార్థము.

ఆనగరము శిలానగర మనునామధేయమున విఖ్యాతిం గాంచుచుండును ఆపే రెట్లు సార్థకమో తెలియ శక్యము కాదు. ఏభావమున నాపేరు తొలుదొలుతఁ బెట్టఁబడియెనో యెవ్వరెఱుంగరు నగరప్రధానభాగమున మూఁడుప్రక్కల నావరించి యొకయుపనది కనుపట్టును. మహానది యించుకదూ రమున నున్నది కాన దానిలో నిది కలియును నదియనుపే రద్దానికిఁ జెల్లునా యని యూహింపఁ జెల్లదనవచ్చును ఎట్లో పేరుకల్గినది దానిని మార్పఁదరముకాదు పండ్రెండునెలలలో

నాల్గునెల లందు జలముండును. మఱిమూఁడునెలలు నీరు ప్రవహించినజాడ కనుపట్టును తక్కుంగలనెలలలో నందునీరుండెనా యనుశంకను గల్గించును. ఆ చిట్టినది యొకపవిత్రశైలభాగమునుండి వచ్చును. జలముండుకాలమున నానీరు క్షీరమువలెనుండును శీతలస్వభావము. రోగమును గల్గించుస్వభావము వానియందుఁ గలదని యాయూరివా రూరక చెప్పుచుందురు. ఏది యెట్లున్నను జలమునలసినంత యానగరవాసుల కందు దొరకదనుట యేమో సత్యము

ఆశిలానగరమున నొకగృహస్థువు కలఁడు ఆతఁడు సంపన్నుఁడని ప్రసిద్ధి గలదు నిరతాన్నప్రదాత యనునామ మాతనికే చెల్లునని యంద ఱందురు. అంతియగాదు సదాచార మాతనియింటఁ బుట్టినదనవచ్చును. విద్యావంతుఁడగు నాగృహస్థువు రాజభక్తిపరాయణుఁడు నై యుండును. ఆయనకళత్రము విద్యాధికురాలు గాకున్నను సదాచారవతి, వినయవతి, శీలవతియు నగును. రూపమునఁ బ్రఖ్యాతిఁగాంచుభాగ్య మామెకు లేకుండుటయు నొకమేలే. భర్తృశుశ్రూషాపరాయణురాలు. బంధువులను, అతిథుల నుచితరీతి గారవించుట యామెకుఁ బుట్టుకతోఁ బుట్టినగుణము. పురపురంధ్రులెల్ల నామెను కడుంగడు గారవింతురు. ఇతరుల మనస్సునకు నొప్పి గలిగించుమాట యామెనోటనుండి వెడలిన ట్లెవ్వరెఱుంగరఁట. ఇరుగుపొరుగుల నుండువారిపిల్ల లామెకడనే పెరుగుదురు. విశేషపదార్థ మేమిచేసినను వారికింబెట్టక యామె తినుట గగనకుసుమము వంటిది. కన్యకలు, గర్భవతులు పరుండుదనుక నామెచెంత నుందురు తాను భుజిం

చుటకు, నొకప్పుడు భ_ర్త భుజించుటకుముందును వారి కన్న
మిడుట యామెయలవాటులలో నొకటి కన్యకలు, బాలుఁడు,
బాలికలు, గర్భిణులు తమయిండ్లకుం బోవనొల్లక యామె చెంత
నుండుటం జేసి పైఁజెప్పినయలవా టామెకుఁగల్గ నవకాశ
మిచ్చెను. కాని కొంద ఱాయలవాటు మంచిదికాదనియు,
మగనికంటె ముందు వారి కన్నముపెట్టుట యశాస్త్రవిహిత
మనియుఁ బలుకఁగా నాపురంధ్రీమణి చిఱునవ్వు నవ్వి మాన్య
తములారా! నాప్రాణేశ్వరుని యుపదేశానుసారమే యిట్లు
చేయుచున్నదానను వారే యొకనాఁడు మనుస్మృతినుండి,

శ్లో. "సువాసినీః కుమారీశ్చ రోగిణో గర్భిణీస్త్రియః,
అతిథిభ్యోఽగ్ర ఏవైతాన్ భోజయేద విచారయన్."
సువాసినః=నవోఢాః=అని వ్యాఖ్య.

యను నీశ్లోకమును బోధించిరని సమాధానము చెప్ప వారు
తలలువంచుకొని పోవుదురఁట ఆమెపేరు సుశీల ఆమె మగని
పేరు వేంకటాద్రిశర్మ. వీ రిరువురును శాస్త్రోక్తయయస్సుఖజీవు
లైయుండు టచ్చెరువు గల్గింపకపోదు వారియాచారము
డాంబికముగాక యొకరిని మెప్పించునదియుఁగాక కేవలధర్మము
నే తెలుపుచుండెను. శ_క్తికిందగినయ ట్లతిథుల నాదరించి పూజిం
చుట వారి యలవాటులలో ముఖ్యము. వేకువజామున
స్నానముచేసి యుదికి యాఱవేసినవస్త్రములఁ దాల్చి కాల్య
కృత్యములను దీర్చి యవ్వల గృహకృత్యములను జూచుకొ
నుట వారికి వాడుక. దేవతాభ_క్తి వారికి మెండు వేంకటా
చలపతి వారి యిలువేల్పు. త్రిపురసుందరియు నిలువేల్పే.
శివుని బూజించుటయు వారి యలవాటులలో నొకటి వారి

వారలు ప్రకృతినిబద్ధులనియు నాప్రకృతి పరమేశ్వరుని యిచ్ఛాశక్తి యనియు వారికిఁగల దృఢవిశ్వాసము. కావున వా రుచితరీతిని భారతభాగవతరామాయణాదులఁ బఠించు చుండువారు. వారిని జూచినవారందఱు సదాచారమునకు నుదాహరణభూతులని తలంచుచుండురు. కావున నావాడ వారెల్ల సదాచారమును నేర్చుకొని వారివలెనే తమరు నుండఁ బ్రయత్నించుచుండిరి

వేంకటాద్రిశర్మ తండ్రి కుమారస్వామిశర్మ. ఆయన తొంబదిమూఁడుసంవత్సరములపైఁ దొమ్మిదినెలల పదునొకండు దినములు పదాఱుగడియలు జీవించి నిరోగియు దృఢకాయుఁడు నయి దంతపటుత్వము దృష్టిపాటవము గలిగియుండి స్నానముచేసి జపముచేసికొనుచుఁ బరమేశ్వరా! యని యుచ్చరించుచుఁ బ్రాణముల వదలెనఁట. వారిఁ జూడవచ్చినవారా దేహము క్రిందఁబడుజాడఁ గనిపెట్టి త్వరపడి పట్టుకొనిరని యెల్లరుఁ జెప్పుచుందురు. ఆమృతిని జక్క నాలోచింపఁగా యోగాభ్యాసమున నాతఁ డుత్తమమార్గము నొందఁజాలెనని బుద్ధిమంతులకుఁ బోడకట్టకపోదు. ఆ మహనీయునిసాధ్వి యంతకు రెండుసంవత్సరములకుముందే దేహమును వదలెనఁట. వయోవిషయమున నాయిరువురకు నాలుసంవత్సరములు మూఁడునెలలు పందొమ్మిదిదినములు భేదమఁట. ఆయిల్లాలు పుత్త్రికాద్వయమును గని యొకపుత్త్రుని బడసెను. ఆపుత్త్రరత్నమే వేంకటాద్రిశర్మ యని విఖ్యాతి నొందినవాఁడు.

వేంకటాద్రిశర్మ చిన్నతనమునఁ దండ్రికడనే విద్య నభ్యసించినవాఁడు. వేదమునఁ గొంత పఠించి కావ్యనాటకాలం

కారగ్రంథముల నభ్యసించి వ్యాకరణజ్ఞానము తగినంత యల వడఁగా వేదాంగములలోఁ బ్రధానమని ప్రసిద్ధిగాంచి సర్వ కర్మములకుఁ దండ్రివంటిదగు జ్యోతిశ్శాస్త్రమును జక్కఁగా నభ్యసించి స్మృతిపురాణములఁ జక్కనెఱింగి కవిత్వము చెప్ప నేర్చి ధర్మమని వైద్యశాస్త్రము నభ్యసించెను ఆయనపత్ని యగుసుశీలయు విదుషియే కాని యామెవిద్య యిల్లుదాఁటిం చునది కాకుండెను కొందఱామె యుపన్యసింపఁగా వినవలెని యువ్విళ్లూరుచుండిరఁట. కాని యామె సార్థకనామధేయము కలది కావున సభలోనికి స్వేచ్ఛగాఁబోవుట మరియాంపకొాద నియుఁ బురుషులనడుమ నిలువంబడి మాటలాడుట ప్రాచీన ధర్మము కాదనియు నాప్రస్తావనకుఁ బోవకుండెను ఆ విష యమునమాత్రము కొంద ఱామెచదువు నిరర్థకమని పలుకు చుండురు కొంద ఱామెయభిప్రాయమే యుక్తయుక్తము మని నుతించుచుందురు. "భిన్నరుచిర్హి లోకః" అనుట సాజ మేకదా లోకమును మెప్పించుటయు నతికష్టమే యనంజను

కుమారస్వామిశర్మ కుమారునకుఁ దా నెఱింగింపదగు విషయములను జెప్పుటయేకాక రాజ్యపాలనమునఁ బ్ర యను భవించినకష్టములను దెల్పియుండెను. ఆయనచిఱుతకాలమున రాజ్యమున ననేకవిధకష్టము లుండెవనియు, నప్పటి రాజులు కడుఁ గ్రూరహృదయులై భరతఖండవాసుల బాధించుచుండి రనియు నాబాధలు వర్ణింపఁ దరముకానివనియుఁ బ్రతిదినము దండునచ్చుచున్నది. చెఱఁబట్టుదురు. కావున నడవికిం బోవు దుమని యూరివారెల్లఁ బరుగెత్తుచుండిరనియుఁ దా నెన్ని యోపద్ర్యాయములు వారింగలిసి కొండల కరిగితిననియు, నట

చేతఁ బ్రాణములుంచుకొని ధనముండిన నేమూలనో యేకాంత ప్రాంతముననో స్థాపించి భార్యమెడలోఁ బసపుకొమ్ము కట్టి ప్రాతచీరఁ గట్టనిచ్చి కాలము పుచ్చవలయునే కాని యున్నంతలోఁ దిని కలిగినంతలో భూషణములు ధరించి హాయిగా నుండరాదు దేశనియమః జెప్పుచుండెనఁట. ఆమాటలు వేంకటాద్రిశర్మ కచ్చెరువుగా నుండెను. ప్రాప్తవయస్కుడై యప్పుడప్పుడు తండ్రి నడుగుచుండునఁట. ఒకనాఁడేదో ప్రస్తావమున రాజ్యపాలనావిషయము రాఁగాఁ గుమారుఁడు తండ్రితో నిప్పుడున్న ట్లప్పుడు లేదా యని ప్రశ్నించెనఁట. కుమారునకు నిట్లు బదులిచ్చెనఁట

వత్సా! మాతండ్రి చెప్పఁగా వినినదియు నాయనుభవమున నెఱింగినదియు నగునొకటి వచించెదను ఆలకింపుము నీ కామాట లచ్చెరువును గల్గింపకమానవు. నాచిఱుతకాలమున నొక్కవత్సరమున ననావృష్టిదోషము సంభవించెను అంతకుమున్నటి వత్సరమున సగముపంటయే పండెను చైత్రవైశాఖమాసములలో సువృష్టి గల్గియేయుండెను. తొలకరి పైరులను జల్లితిమి చక్కఁగా మొలిచెను ఆనాఁటి మొదలు వర్షము మానెను. మేఘములు వర్షింతమన్న నగపడక యుండెను నెల జరగెను. రెండవనెలయు సాగెను. జనులు హాహాకారములు చేయసాగిరి మొలచిన పైరులు క్రమముగా భూమిలోని కేగెను. ఎన్ని యోశకునములఁ గాంచితిమి. వాఁగులయందు దిసుకలోఁ జిన్ని పుట్టలు వివరములు చేసికొనసాగెను. కాపు లాజాడను గనిపెట్టి స్వామీ యిఁక నేటి వర్షము. మహాక్షామమే యనిరి ఉత్తరనక్షత్రమున సూర్యుఁడు ప్రవేశించెను. బ్రాహ్మణులు భారత విరాటపర్వమును

జపివి శంకరునకు సహస్రఘటాభిషేకమును జేయించిరి. వారుణ మంత్రములను జపించిరి భగవత్సేవ వ్యర్థము కారాదు కదా. ఆనాఁడు నూఱు నూటయేఁబదియో చినుకులు పడెను. భూమికి వృష్టి దిగినది. ఇఁక వర్షించునని యాతురులగు బ్రాహ్మణులు కొందఱు మఱుదినమున్న నేమఁడుగుదురో యని కాలికి బుద్ధిచెప్పిరి. మఱుదినమునుండి ప్రాతఃకాలమునఁ జిటపొటఁ చినుకులు పడుచు మధ్యాహ్నమున మేఘములు వియత్తలము నావరించుచు గర్జించుచు సాయంసమయమునకుఁ విస్పష్టముగా నంబరము తెలియుచుఁ జుక్కలు ప్రకాశించుట యగుచుండ నిఁక మనకేటిపనియని మేఘములు పాఱిపోవుచుండెను. మరల నుదయ మీరీతిగనే జరగుచుండెను. ఇవి క్షామచిహ్నములే యని యందఱు నమ్మిరి. అతురాత్రసమయమున నొక తోఁకచుక్క పొడసూపెను అది తాళవృక్షాకారము గల్గి రక్తవర్ణప్రధానమై జాముండి యంతరించుచుండెను. రెండు నెల లారీతిగాఁ గనఁబడెను. ఇట్టి తోఁకచుక్కను మేమెన్నఁడును జూడలేదనియు వినలేదనియు నెల్లరు చెప్పుకొనసాగిరి కార్తికమాసము నడిచెనెను. ఉన్నధాన్యము ముగిసెను క్రొత్తధాన్యము పండివచ్చునను నాశయంతయు నంతరించెను పశువులకు గ్రాసముమాట యటుండఁ గడుపునిండఁ ద్రాగుటకు జలముదొరకుటయుఁ గష్టమయ్యెను. వానియార్తివచింపఁ దరముకాదు. కొందఱు వానికష్టము చూడఁజాలక "యేమహానుభావులైన నీపశువును వశపఱచుకొని కాపాడిన మే మానందింతుము. వారికి భగవంతుఁ డీపశువులమూలమున భాగ్యాభివృద్ధిని జేయుఁగాక" యని చీటివ్రాసి మెడకుఁగట్టి నీకును మా

కును ఋణము తీఱినవి. నీదారినిబొమ్ము నీకష్టమునుభగవంతుఁడే తీర్పవలయును. అని తోలఁగా నవియు వారిని వదలిపోవఁ జాలక యాఁకలి భరింపఁజాలక యెట్లో పోవుచుఁ బదియడు గులుపెట్టి మరల వెనుకకుఁ దిరిగి రాఁజూచి వారేడ్వసాగిరి. ఆదురంతము చూచువారికి నన్నము దిన బుద్ధి పొడమదనవ చ్చును. మరల వానిని దోలుచుఁ దిరిగి తిరిగిచూచుచుఁ గన్నీరు కాఱ వారు తలుపుబిగించుకొని లోనికరుగ నవి యిల్లు వదలఁజాలక తలవాకిటఁబడి యసువులనదలసాగెను. వానిపైఁ గరుణకలిగి కాఁబోలు పర్జన్యుఁ డొక్కపదునువర్షము కురి సెను. భూమి వచ్చపడియెను. ఇంచుక జలమందందుఁ గనఁబడ సాగెను. సస్యముల కావృష్టి యించుకయు సాయపడద య్యెను. అంతకుముందే సస్యాంకురములు భూమిలోపలికిఁ బోయియుండెను గదా. పశువులకష్టము సుంత తొలఁగినందు లకే సంతోషించిరి.

ఇట్టి కట్టిడికాలమున నొకవార్త పిడుగుపాటువలె విన వచ్చెను. ఉత్తరమునుండి గుఱ్ఱపురౌతులదండు వచ్చుచున్నద నియు, వారు కనఁబడినవారిని హింసించుటయు నందును స్త్రీలు కనఁబడిన మర్యాదకుభంగముగాఁ బ్రవర్తించుటయు, గ్రామ ములఁ గొల్లగొట్టుటయు నీమొదలగు బాధలెన్నియో కల్గిం చుటయే గాక మతగురువులు కనఁబడ వారిబోడినెత్తులపై మూటలెత్తుటయు మేము మోయఁజాలమనినఁ గశాఘాతముల నొడలు నలఁగఁగొట్టుటయు సాగుచున్నదనియుఁ దెలిసెను. ఆవార్త వినఁబడగనే వత్సా! మా యుమ్మలికము నిర్వచింపఁ దరముగాకుండెను. గంపలలోఁ గుండలు పెట్టువారును, దేవ

తావిగ్రహములను సాలగ్రామశివలింగములను బెట్టెలోఁ నునుచువారును, తొందరపడి విగ్రహములతోడ వెలుఁగుచున్న దీపములనుగూడ మడిసంచులలో నిముడించువారును, ఆయలజడిలో నేమియుఁ దోఁపక పెండ్లము పిల్లలు కనఁబడ వారిఁ గౌఁగిలించుకొని వాపోవువారును, మనకెవ్వరు దిక్కని తత్తఱిల్లువారునై యల్లాడుచు నడవులకుఁ బోవుచుండ నాతల్లిదండ్రులు నేనును వారివెంటఁ బోవఁ బయనమైతిమి. మేముండునది యాకాలమున నొక్కపల్లియ. అది కొండకు సమీపమున నుండునదియే. ప్రాక్పశ్చిమభాగములఁ గొండలు గలవు. ప్రాగ్గిరి కడుంబెద్దది కీకసారణ్యము దానిక్రింద నుండు. క్రొత్తవారందఱు బ్రవేశింప నోడుదురు. మార్గములు లేవు. పశువులుపోవుత్రోవ లుండునుగాని యవి యొంతదూరమో సాగక యందందు ముగియుచుండు. మిట్టమధ్యాహ్నమునఁ బయనము సాగించితిమి. పశువులు తోలుకొని యా యడవులకుఁ బోయితిమి. రెండుకోసులలో (14 మైళ్లు) నొక సెలయేఱు ప్రవహించుచుండును. జలము శుభ్రముగా మధురముగా నుండును. ఇసుకతిన్నెలు లేవుగాని గుండ్రని చదు పాషాణములు మెండుగనుండును. వానినడుమ జలము పాయలుగాఁ బ్రవహించుచుండఁ జూడ వేడుకగా నుండును. నా యాయువునం దప్పటికిఁ బదుమూఁడేండ్లు గడచెను. నాకుఁ దమ్ముఁ డొక్కఁ డుండెను. వాఁడు నాకంటె నాల్గేండ్లు చిన్నవాఁడు. వాఁడు నడువఁ జాలఁడు. ఎత్తుకొని నడువ నాతల్లికి నోపిక లేదు. అట్లే వానినెత్తుకొని మాయమ్మ నడువసాగెను. నాతండ్రి మోయలేనంత బరువెత్తికొని ముందు నడుచుచుం

డెను. ఆయనవెంట నొక యావులేదూడయు, దానివెనుక మాయమ్మయు నామెవెనుక నేనును బోయితిమి. ఆ యూరి వారెల్లరు పరుగిడసాగిరి. అదిగో దండు వచ్చెననువారును, మనలఁ జంపుదు రనువారును, పిల్లలగతియేమో దైవమా యనువారును, గ్రామదేవతలారా! జాతర సేయుదుము. మమ్మీబారివలనఁ దలఁగింపుఁడనువారును నై చెల్లాచెదఱయి పోవసాగిరి దక్షిణోత్తరముల దృష్టిఁ బ్రసరింపజేయుదుము కదా మనుష్యులే కనఁబడిరి. ప్రతిపల్లియ నున్నవారు నిట్లే పరుగెత్తుచున్నారనుట స్పష్టమయ్యెను ఎట్లో యా యేటి కడఁ జేరితిమి. తీయని యానీరుత్రాగుటయు నా చెట్లనీడల నించుకసేపు కూరుచుండుటయుఁ గారణములుగా నాయెండ బాధయించుక తగ్గెను. కొనిపోయినయన్నము తిని కొద్దిగడియ లందుండి ప్రయాణము సాగించితిమి. కొండఁ జేరునప్పటికి సాయంకాలము కావచ్చెను. అందొక్క కోనగలదు. అందు జలపాతము కలదు. చల్లనిమ్రాఁకులు గలవు. ఎంతవర్షము కురిసిన నుండనిచ్చు గొడుగుటాళ్లు గలవు అవి పెద్దబండలు, ముందునకు సాగియుండును. ఒకొక్కబండక్రింద వందల కొలఁదిజను లుండవచ్చు. మేమెల్ల నందుఁ జేరునప్పటి కెవ్వఁడో పులిపులియని యార్చెను ఆమాట వినంబడఁగా నాతల్లి యట్లే పడిపోయెను. చిన్నతమ్ముఁ డేమయ్యెనో నే నెఱుంగను. నన్ను నాతండ్రి కౌఁగిలించుకొని యుండెను. నాకు స్మృతివచ్చినప్పటి కిట్టులుండెను తప్పెటులబోలె మనుజులయుఱ్ఱవులు కొండను భేదించెను. కొద్దిసేపటి కయ్యది పెద్దపులికాదనియుఁ దోఁడేలనియు, నది వీరంజూచి యులికి

పడి లేచి నలుగడలఁ గాంచుచుండ నెవ్వఁడో యొకక్షత్త్ర కుమారుఁడు పెద్దపులియని యార్చెననియుఁ దెలిసెను. అంతట నూఱడిల్లి యందఱ మందే కొన్నినెల లుంటిమి. ఎప్పుడో గ్రామములకుఁ బోయి వస్తువులఁ దెచ్చుకొనుచు నెట్లో కష్టపడితిమి. ఎన్నికష్టములుపడినను రోగము లొక్కనిపాలికిని రావయ్యెను. ఒకమందైనను దగ్గర లేదు. చిన్నిశిశువు లుండిరి. నిర్మలమగు నావాయువే మమ్ముఁ గాపాడె ననవచ్చును. ఫలములు పండియుండఁగా నందఱము చెట్లెక్కి వానిఁ గోసి తెచ్చుచుంటిమి. ఆకాల మెంత మనోహరముగనో యుండెనో యిప్పుడు వచింపఁజాలను. ఆసమయమున దండువచ్చి యచ్చటనుందున్నవారిని హింసించి యూళ్లఁ గొల్లఁగొట్టిపోయిన మాట సత్యము వారు పోయినపిదపఁ గొన్నిదినములకు మరలఁ బల్లెయలకుఁ జేరితిమి. అట్టి కష్టముల ననుభవించినవారము గాన నిప్పటి రాజ్యపాలనముం గాంచి యబ్బురపడుచుందుము.

మఱికొన్నిసంవత్సరములకే సీమనుండి తెల్లనివారలు వచ్చిరి వారిని దొలుదొలుతఁ జూచినపుడు భయపడుచుండుదుము. కొన్నిపన్నులఁ దీసివైచిరి. రక్షకభటుల నియమించిరి మార్గములు చక్కఁజేయించి రాకపోకల కనుకూల మేర్పఱచిరి. ఆమార్గమున నందందు గుడిసెలు వేయించి దొంగల భయము లేకయుండ వారు చేయవలయునని కట్టుదిట్టము చేసిరి మేమది యొకవింతగాఁ జూచువారము పెద్దపులిని జంపినవారి కేబది రూప్యములను బహుమానమిత్తుమని చాటించిరి. దేవాలయముల కంతకుముందున్న మాన్యక్షేత్ర

ములు జరుపఁబడుచున్నవా? ఉత్సవములు మొదలగునవి చక్కఁగా సాగుచున్నవా? అని కనుఁగొనుటకుఁ గొందఱను బుద్ధిమంతులను నియమించి మండల న్యాయపాలకులను వారిపై నధికారిగా నియమించిరి. ఏమని చెప్పుదును! ఆ కష్టములను, ఈసుఖములను అనుభవించినవారికే తెలియును గాని మీవంటివారల కవి దుర్గ్రాహ్యములే. కుశల పత్రికలు గొనివచ్చుట కెన్నియో యేర్పాటులు చేసిరి ఇరు వది వత్సరములలోఁ గష్టములన్ని నెట్టివో యనునంతస్థితికిఁ దెచ్చిరి

మఱి కొంతకాలమునకు మహారాజ్ఞి విక్టోరియాంబకుఁ బట్టాభిషేకమహోత్సవమని తెలిసెను. వార్తాపత్రికలు రాసా గెను అచ్చుకూటము లుప్పతిల్లెను భారతము తాటియాకు లపై వ్రాయించునాచార మూడిపోయెను. రెండుసంవత్సరము లన్నము పెట్టి నూటపదాఱు రజతముద్రికలనిచ్చినఁగాని భార తము దొరకకుండెను. అచ్చుకూటములు రాఁగా దేవనాగ రాక్షరములతో ముద్రింపఁబడిన దేఁబదిరజతముద్రికలకు దొర కసాగెను వ్యాపారములు విస్తరిల్లెను వివాహమున నుత్స వము చేయఁబూనిన నెంతోకష్టము కొంతధన మిచ్చినఁగాని గుఱ్ఱము నెక్క నవకాశము లేకుండెను ఇట్టి కష్టములు తొలగెను విద్యాశాలలు ప్రబలెను ఆపట్టాభిషేకోత్సవ సుదినము సమీపింపఁగా నెల్లపట్టణము లలంకరింప బడియెను నే నేను చెప్పుదు నాయనా! ఆవేడుకల జూడ రెండు కన్నులు చాలనే చాలవు ఎన్నియో వ్యాఖ్యానములు చేయఁ బడినట్లు వినవచ్చెను నీకాలమున నింపుకేఁ గషము లక

కాలము సాగుచున్నది. కాన నాకాలపుఁగష్టములఁ దలంచు కొన్నఁ దల కంటగించును. నీవంటివాని కవి యుండినవా యనియుఁ దోఁచినను దోఁచవచ్చును అని యీరీతిఁ వెలువ్రు చుండును. వేంకటాద్రిశర్మయుఁ బెక్కుసారులు వానిని వినుచుఁ దలపంకించుచు నౌరా! యిదెంతటి మంచికాలమని యానం దించుచుండును.

---

## మూఁడవ తరంగము.

ఒకనాఁటి సాయంకాలమున సుభద్ర చింతాక్రాంత చిత్తయై యుండునంత లలిత యచటి కేదోపనిపెట్టుకొని వచ్చెను, విచారముతో నుండియు సుభద్ర యామెను గూరు చుండుమని చెప్పెను. కూరుచుండినలలిత యామెతో నమ్మాయీ! నీమోము చూడఁగా విచారమున మునింగియున్న జాడ కనఁబడుచున్నదే. ఏల? ఏతరుణమునను గళకళలాడు చుండు నీముఖ మేల యీదినమిట్టులున్నది? నిష్కారణముగా నిట్టిమార్పు నొందదనియే నానమ్మకము నా యెఱింగినంతవఱకు నీకేమియును గొఱంత కనఁబడకున్నది మగఁడా సుగుణ వంతుఁడు, రూపవంతుఁడు, అనురూపవయోవంతుఁడు. విశే షించి నీముద్దు చెల్లించువాఁడు ఐశ్వర్యమా కావలసినంత యున్నది అత్తమామలా నిన్నుఁ బంచప్రాణములకంటె మిన్నఁగాఁ జూచుకొనుచుండురుగదా. కాపురమునకు వచ్చి పట్టుమని పదియేండ్లును గాలేదు సంతానము లేదనుకొందమంత లేదుగాని లాభము లేకపోయెను. అది యొకకొఱంతగా

నెంచుకొనునంత చేలవు కావు ధీరురాలవు దైవానుగ్రహ-
మున్న నది నెఱవేఱకపోదు. ఇపు డీవిచారమునకుఁ గారణ
మెఱుంగఁ గోరుచున్న దానను. తెలుపఁదగుననిఁ దోఁచినఁ
దెలుపుమని లలిత గ్రుచ్చిగ్రుచ్చి యడిగెను లలితపై సుభద్రకుఁ
బ్రీతి మెండు. ఎంతటిరహస్యమైనను జెప్పక యూరుకోనఁ
జాలదు. రెండుదినము లానెచ్చెలిని జూడకయున్నఁ దోఁచ
దని చింతించునంత మెత్తని చిత్తముగలది కాఁబట్టి యాలలిత
యిట్లు ప్రశ్నింపఁగా నించుకయు నాలోచింపక యిట్లు బదులు-
పలికెను.

లలితా! ఏమని తెలుపుదును! నీవన్నట్లు లదృష్టవంతు-
రాలనే యనుకొనుచు గర్వించుచుందును దైవ మద్దానికిం
దగినట్లే ప్రాయశ్చిత్తము చేసెను. అది చెప్పుకొనఁదగినది కాదు.
దాఁపఁదగినదియుఁ గాదు. దాన నిరంతరవిచారము నన్ను
బాధించెడిని. ఏది యెట్టులున్నను నీతోఁ జెప్ప నువ్విళ్లూరు
చుంటిని నీవేయడిగితివి. ఇతరులకుఁ దెలియఁగూడదు సుమీ!
నాతో డనుము. తెలిపెదనని యాలలిత యట్లే యన నిట్లు
తెలిపెను లలితా! కాల మెంతలో నెంత తల్లక్రిందు
లాయెనో చూచితివా! మూఁడు నాల్గువత్సరములలో నింత
మార్పుగలుగునని కలలో ననుకోఁ లేదు సుమీ! ప్రాచీనా
చారము లీనగరమున మెండుగాఁ గలవనియు, నవనాగరి
కత యించుకంతయు లేదనియు నెవరెవరో యనుచుండ నేను
నందులకు సమ్మతించుదానను నవనాగరికత యననేమో యిపుడు
వ్యక్తమైనది ప్రాచీనాచారమనఁగా నేమో స్పష్టమైనది.
ఆత్రేయి మననగరము చేరి రెండేండ్లుకూడ నిండలేదు ఎన్ని

దురాచారముల నెలకొల్పినదో వింటివా ? ఆమె యిప్పటి మగఁడు వైద్యశేఖరుఁ డనిగదా ప్రతీతి. నాలుగుడబ్బు లార్జించునఁట. దానిచే నింత మిట్టిపాటా ! ఎందఱు ధనార్జనముచేయువా రీయూర లేరు ? వారందఱికంటె నీతనియతిశయ మేమి ? తొలుత నీమె వచ్చినపు డెల్లరు తూలనాడువారు. వరుసగా నూరిలో వ్యాపించిన మగనిపేరుంబట్టి యీమె మర్యాదగలవారిలోఁ దా నొకతుకనని గర్వించినది. ఎందులకెక్కని కొందఱెల్లాంద్రు దారిద్ర్యముచేత నీమెకడఁ జేరిరి వారియోగ్యత యెట్టిదో యెవ్వ రెఱుంగరు ? నిన్న మొన్ననేకదా లచ్చమ్మ మందు మ్రింగి పతివ్రతయైనది. అట్టివారే తక్కినవారును. వారివారిచరితములు మన ముచ్చరింపనేల ? వారిపాపమును మనము పంచుకొన్నట్లగును. ప్రతి దినమును లలితా ! వంటచేసిపెట్టునఁట. అమ్మగా రమ్మగారని యామెను బొగడునఁట నాలుగిండ్లలో నమ్మగారని యామె గొప్పదనమును దెల్పునఁట వారెంత యవివేకులో నమ్ముదురఁట. ఇట్టు లాయాగృహములలోఁ దెల్పుచుండునఁట కొలఁది నెలల కాత్రేయి పేరు వ్యాపింపఁజేసినందున లచ్చమ్మకు నెలకుఁ బదిరూపాయలు జీతము చేసినదఁట నీటిబిందెలు మోయు లేక యల్లాడుచున్న లచ్చమ్మ కింతటిలాభము కలుగఁగాఁ గన్నులు నెత్తికెక్కుట యొకచిత్రమా లచ్చమ్మ యిపు డందఱిలో నుత్తమురాల ననుకొనుచున్నది ఆకబురులు మనకేల యని యూరకుందుమన్న నుండ వీలులేకున్నది. నా మగఁడుకూడ రెండుమూఁడునెలలనుండి మృత్యుంజయుని మైత్రి కలుగఁజేసికొన్నాఁడు. అపుడపుడు వారియింటికిఁ బోవు

బొంగుదు ? నాకెట్లు తెలియును ? ఆవృత్తాంతము మనకేలగాని నీమగఁ డాయప్పు నిమ్మని యడుగఁజాలకున్నవాఁడని యన్నాల మాటాడ కూరకుండెను.

సుభద్రయు ననుమానము మునుపటికంటె మిక్కుటము కాఁగా లలితా! యేల యడుగఁజాలకున్నవాఁడో చెప్పుము. మూఁడువేలరూప్యములు వదలుకొన్నమా కేమి కలదు ! ఆకారణ మెఱిఁగింపుము. నేనైనఁ జెప్పించుకొనెదను మాయన్న చేతఁ జెప్పించెదను ? చెప్పవే ? చెప్పకయున్న నన్నుఁ జంపుకొన్నట్లే సుమీ! అని గట్టిగా నడిగి చేయిపట్టుకొనఁగా లలిత అక్కా! నీకుఁ జెప్పక దాఁపరాదు. చెప్పనచో మాకు మన స్పర్ధలు కలుగక మానవు దంపతులకుఁ బ్రీతిని వర్ధించిన మహాపాపము నన్నలముకొనును కావున నేనియుఁ దోఁప కున్నయది అని యించుక యోచించి యేమైనఁ గానిమ్ము చెప్పెద. మరల దానిని బయలఁ బొంగనీయకుమా నాతో డనుము. అని యామెచే నామాటను జెప్పించి మహారహస్యము సుమీ. మానాథు విన్న నన్నుఁ జంపివేయుదురు. ఆపాపము నీమెడకుం జుట్టుకొనును అని పలికి యామె తల పట్టుకొని వంచి కుడిచెవిలో నొకగడియసేపు తా నెఱిఁగిన దంతయుఁ దెల్పి వదలెను సుభద్ర మోము చక్కనిదయ్యు నాయదనున నుదయార్కబింబమువలె నయ్యెను. కన్నులు పుండరీకములతోఁ బోల్పఁదగియుండినవయ్యు నపుడు రక్త గోళములు నాదనరెను పెదవి యదరెను. గండస్థలములు నృత్యముచేయున ట్లగపడసాగెను. హృదయము విషాదవేదనచేఁ ద్రవపడసాగెను. ఏమిచెప్పను దరముగాక యామె

సౌమ్యాకారము భీకరాకృతిగ మాఱి మహాకాళీరూపమును స్మృతికిం దెచ్చుచుండెను లలితయే భీతిల్లెను. ఇదియేమి యిట్టిరూపము నీమె తాల్చినదే ఏమికొంపలు మునుఁగునో యని యదరిపడెను రవంతలో సుభద్ర యాకోపము నెట్లో తగ్గించుకొని సౌమ్యవర్ణనమున నించుక యూరడిల్లు లలితతో సోదరీ! భయంపడితివా? నీమాటల నేనాఁడును వెలిఁబుచ్చను జుమీ! నాశక్తియుక్తులం జూచుచుండుము. ఎట్లు లామామా యలాడి నడివీధిం బెట్టింతునో అని బీరములుగా భావించు నేమో యని యట్లుగావుసుమీ యని నమ్మఁబలికి లలితంబంపి తనపడకటింటికిం బోయి శయ్యపై మేనుసేర్చి యిట్లు లాలోచింపఁ జొచ్చెను

మూఁడువేలరూప్యములు వారియ్యరనుకొనవచ్చును. వారిచ్చుటకు వారికి ద్రవ్యమెక్కడిది? ఇల్లు లేదు. భూమి లేదు బంగారునగలున్నవా యన్న నవియు లేవు గాజుపాత్రములు నాలుగుసీసాలు లోనగునవియే వారియింట నుండు వస్తువులు. నవనాగరికుల ద్రవ్యమిట్టిదే కాఁబోలును. అమ్మినచో నొక్కపూటకు భోజనమునకుఁ జాలదు. ఇఁక వారిచ్చుమాట సున్న. ఆద్రవ్యము నపహరించుటకే కాఁబోలు నూవావిని లోఁబఱచుకొని యున్నవారు మామామగారు సకల కష్టములపాలై యెన్నియో దానములుపట్టి సంపాదించిరఁట. ఈఁగలు తేనెనుగూర్చినట్లు కూడఁబెట్టి యిచ్చి కాలము వెళ్లించుకొని పోయిరి. వీరిపెత్తనమున నిట్లున్నది ఆత్రేయి మోసగత్తియ యని తెలియనయ్యెను. విద్యావతి నన్నగర్వమామెకు నలంకారము. భారత భాగవత రామాయణముల

జోలి యెఱుంగదు. ఆమెచదువు మండినట్లే యున్నది. మొదటి కాఁపురము మంటపెట్టివచ్చినది కదా పాప మాయన శాంత మూర్తియఁట ఈమె వ్యాపారమునకు వగచివగచియే చచ్చి యుండును. వెంటనే మృత్యుంజయుని చెట్టఁబట్టినది ఈమె పాతి వ్రత్యము వర్ణనాతీతము. నాకేల యిప్పు డామె ప్రశస్తప మునుగూర్చినచర్చ. ఆమెయందుఁ బ్రీతిగలవారు కొందఱు వారియింటికిఁ బోవుచు వచ్చుచుందురు ఆ రూప్యములు రాకున్న మాసంసారము తెల్లవాఱినట్లే. ఈవిషయమే లలిత యింకను దెలిపినట్లే తోఁచెడిని. మరల రావించి యడిగెదను. సర్వేశ్వరా! ధర్మరక్షకుఁడవు కదా. మాయాచారము ధర్మవి హితమయ్యేనేని మాసంసారమును గుదుటఁబడ ననుగ్రహిం పుము అధర్మము జయింపవలయునని నీభావ మయ్యేనేని ఆత్రేయి గెలుచుఁగాక సర్వమునకు నిన్నే నమ్ముకొనియున్న దానను. భక్తపరాధీనుఁడవు కరుణాసముద్రుఁడవు ఆపద్బాంధ వుఁడవు. ఓశంకరా! శ్రీమన్నారాయణా! నీవుదక్క నన్యము శరణ్యముగానరాదు అని భక్తిభావమున మ్రొక్కి యీకష్టము తప్పునుపాయ మేదియని యాలోచించుచుండెను

మృత్యుంజయునివిషయ మెఱింగినఁ గాని మనకథ చక్కఁగా నడువదు ఆతఁడు తొలుత బ్రాహ్మణుఁడు. సద్వంశ జనితుఁడు. బుద్ధిమంతుఁడు. పెద్దలయం దడఁకువఁ జూపునల వాటుకలవాఁడు. చిన్నతనమునఁ దల్లిదండ్రులు గారాబముగాఁ బెంచిరి రూపవంతుఁ డనవచ్చును. ఆకారము కడుసౌమ్యము. స్వభావము పరోపకారయుతము. పాఠశాలకుఁ బంపఁగనే చక్కఁగాఁ జదువుకొనెను. పదునాల్గువత్సరముల యీడు

రాఁగానే తగినసంబంధము దొరకినదని తండ్రి వివాహప్రయత్నము చేసెను. నలుగురుబంధువులును మించిపోయినదనియూ యిప్పుడే వివాహప్రయత్నము చేసితివని కాకిని బొడిచినట్లు పొడువసాగిరి తల్లి భర్తయాజ్ఞను శిరసావహించుసాధ్వి కావున నంగీకరించెను. శ్యామరావను మిత్రుఁ డొకఁ డాయనకుఁ గలఁడు. ఆతఁడు బీదవాఁడుగ నుండెను గాని దీర్ఘాలోచనము గలధీరుఁడు. ఒకనాఁ డామిత్రునితో మాటలాడుచుండి శ్యామరాయా! చూచితివా? బంధువు లెంత యోర్వ లేనివారో. కాలధర్మములు దేహధర్మములు స్థిరములు గావు. అంతియకాక నాభార్య జబ్బుపడుచుండును ఒక్కొక్కసారియు బ్రదుకునా యన్నంత యనుమానము నాకుఁ గలుగుచుండును. దాని కన్నులముందఱ వివాహముచేసి కొఱంత దీర్ప నెంచితి. ఈరహస్య మెఱుంగక బంధువు లీపని మానుమని నన్ను దూఱుదురు సంసారతాపము వారికేమియుఁ దెలియదు. నీ భావమేమి? పిల్లకుఁ బిల్లవానికి మూఁడుసంవత్సరముల యంతరము కలదు. వియ్యము తగినదే. అని మృత్యుంజయుని తండ్రి సదాశివరాయఁ డడుగ శ్యామరాయఁడు సుంత యోజించి నవ్వి యిట్లు బదులుపలికెను

మిత్రుఁడా! నీయాలోచనము చాల మంచిది పిల్ల తెలివితేటలు గలది కన్యక తల్లిదండ్రులు మర్యాదకలవారు. దురాలోచన మేమూలనుండునో వారెఱుంగరు. బీదవారను కొఱఁతకలదని కొందఱందురుగాని మన కది యక్కరలేదు. కులశీలములతోఁటి మనకుఁ బని. ఇల్లుదాఁటియెఱుఁగని లక్ష్మీదేవికుమారిక నీకుఁ గోడలగుట భాగ్యము. "కూఁతురు

ప్రకటించు మాతగుణము" అన్నసూక్తికి నీకోడ లుదాహరణ మగును బంధువులమాట కేమిగాని మనమిత్రులందఱు సమ్మతింతురు వధూవరులు పీటలపైఁ గూరుచున్నపుడు చూడం జూడ ముచ్చటగా నుండును. మొన్న భుజంగరాయనింటి పెండ్లి చూచినవారెల్ల వధువున కెంద ఱు పిల్లలని యడిగిరి బదులిడఁ జాలక భుజంగరావు సిగ్గుపడెను మనయింటిపెండ్లికి వచ్చిన వారెల్ల సెబాసనకుందురా! ఈడుజోడుగాఁ బెండ్లిసాగిన నావధూవరుల కాయురారోగ్యములు కలిగియుండును ఇసవ దేండ్లపిల్లను బెండ్లియాడినవారిని మన మీయూరఁ జూచుచున్నాము కదా పట్టుమని నాలుగుసంవత్సరములు కాపురముచేసిరా? ఇంటిపేరేల కాని రెండునెలలక్రిందట నబ్బాయనునట్లు వేడుకలతోఁ జేసినపెండ్లి యేమైనది? వధువు గర్భవతి యని పతి వదలెను. వ్యవహారము రాజద్వారమున సాగనున్నది సిగ్గులచేటుకదా. ఆజోలి మనకేల? మనప్రయత్నము సర్వసమ్మతమని హిత ముపదేశించెను. శ్యామరాయనిమాటలచే సంతుష్టినొంది సదాశివరాయఁ డాకన్యకను గోడలుగా గ్రహించెను. పెండ్లి కరుదెంచినవారెల్ల నావధూవరులం గాంచి కడుఁజక్కని సంబంధమని యీడుజోడుగా నున్నదని సంతోషించి యాశీర్వదించి పోయిరి.

కాలము దుర్వారము. దానిగతికి లోనుగానివాఁ డెందైన నుండఁడు పెద్ద లాశీర్వదించిన యాదంపతులకు నాలుసంవత్సరములపైఁ బదినెలలమీఁద బదిదినముల కీలోక మున సంబంధము తెగిపోయెను. ఆకాలమున మృత్యుంజయుఁడు కొన్నియేండ్లు విద్యార్థిగా నుండెను. రెండుసంవత్స

రము లే యతఁ డింటనుండఁజాలెను. ఆ కొలఁదికాలముననే యానందమును లోనుచేయుచున్న గాలము ద్రోయఁజాలిరి భార్యను వదలి యొందే నడుగవలసివచ్చునని యే మృత్యుంజయుఁడు వైద్యశాస్త్ర మభ్యసించెను. రాజకీయోద్యోగమునఁ బ్రవేశించినవాఁడు కాఁడు. ఆప్రయత్నమైనఁ జేసినవాఁడు కాఁడు. అంతలో వారియానందము నోర్వఁజాలక మృత్యువు వాసాధ్వీని దనవక్త్రబిలమున నిముడించుకొనియెను. ఆవింతలోఁ గొంత కాల మతఁ డుండవలసినవాఁ డయ్యెను. దుఃఖ మెంత యనుభవించినను దుదముట్టదని హితు లుపదేశించిరి. మరలఁ బెండ్లియాడుమని బోధించిరి అట్టి నాతిరత్నమును బోఁగొట్టుకొన్న యీదౌర్భాగ్యునకు మరలఁ బెండ్లియా యని మృత్యుంజయుఁడు బదులిడుచుఁ దత్ప్రయత్నమును గొనసాగనీయకుండెను. చిన్నతనమున నింతటివైరాగ్యము హితము కాదనియు నది చిరకాలము నిలువదనియు లోకానుభవము గల పెద్ద లనుచుండిరి. ఈమాటల లెక్కింపక యతఁడు వైద్యవృత్తినివదలక తల్లిదండ్రులమాట జవదాటక వర్తించుచుండెను.

కొన్ని హాయనము లీరీతిగాఁ గడచెను మృత్యుంజయునితండ్రి సదాశివరాయఁ డేకపత్నీవ్రతుఁడై యుండెను. అతనిశీలము నెల్లరును గొనియాడుచుండిరి శివభక్తుఁడని కొందఱాయనను బిలుచుచుందురు. రెండువేళల లింగపూజ చేయు టాయనయాచారములలో నొకటి. ఆలింగపూజం గాంచి కొందఱిది చిన్నతనపుఁబూనిక యగుటచేఁ జిరకాలము నిలుచునా యని యనుమానించుచుందురు. జరగినన్ని నాఁడులే జరగనిండు. మంచిదికాదా యని మఱికొందఱు

పలుకుచుందురు ఎవ్వ రేమనుచున్న నా సదాశివరాయఁడు తల్లింగపూజాసక్తుఁడై దినమునకు రెండుసారులు వటలక చేయుచుండెను. రెండు మూఁడుసంవత్సరము లాలింగార్చనకు నంతరాయము లేక సుఖముగా సాగుచునే యుండెను. ఒక్కనాఁ డానగరమునకు నాటకసభ వచ్చెను అందుఁ బురుషులు తరుణులవేషము వేయు నాచారము మంచిదికాదని చర్మముఁ బ్రతిమలుచేసి దీపచ్ఛాయల వాని నాడించుచుండిన దర్వ్లత్తి పట్టుపడ నవకాశము లేదను మంచియూహచే నాసభ్యు లట్లు చేయువారు. వా రానగరమునకు రాకమునుపే యం చెంతనున్న యొకయూరఁ బ్రదర్శించుచుండిరి ఒక్కపనిమీఁద సదాశివరాయఁ డాయూరికిఁ బోయియుండెను. కొలఁదిదినము లుండునట్లును దటస్థించెను. ప్రతిదినము వారు రామాయణ భారత భాగవతాది పవిత్రగ్రంథములలోనికథలు ప్రతిమల యాటమూలమునఁ దెలియఁజేయుచు లోనుండి పాటలుగా వానిని దమరు పాడుచుఁ జూచువారల కానందమును గల్గించు చుండిరి. ప్రతియాటకు సదాశివరాయఁడు పోవుచుండెడి వాఁడు. ఆసభ్యులలో నొక నారీమణియుండెను. ఆమె యంత కుముందే యొకనిఁ బెండ్లియాడి యాతనిచేఁ బరిత్యక్త యయ్యెను. ఈసభ్యుల నాశ్రయించి యందు సభ్యురాలుగాఁ జేరెను. వయస్సున ముప్పదొక్కసంవత్సరములు గడచెను. ముప్పదిరెండవసంవత్సరము ప్రవేశింపఁగనే యాయూర నాటక ఖేలనమున కారంభించెను. ఆమె కీరవాణి యనుబిరుదము గాంచెను. పరమాహ్లాదము కలుగునట్లు పాడుట యామెకు నుగ్గుతోఁ బెట్టినవిద్య. రూపము సురుచిరము కాదు. కాని

కంఠరవము సురుచిరతమము. దానింబట్టియే యానాటకమును దిలకింపఁ బెక్కం డ్రరుగుదెంచువారు. సదాశివరాయఁడు సంగీత ప్రియుఁడు. గానముచేయుశ క్తి కంఠమునకు లేకున్నను మన స్సున కుండెను. ఎందైన గానసభయన్న వారు పిలువకున్నను బోయి వారర్ధచంద్ర ప్రయోగము చేయించినను మరలఁ బడి యెట్లో వినివచ్చువాఁడు అట్టుఁగుటఁ గొన్ని దినముల కాయనకుఁ గాంతామతిశయము గలదను బెజింగి యందఱు రానిచ్చువారు.

ఒక్కనాఁ డా నాటకసభవారు శశిరేఖాపరిణయము నాడుచుండ నందు శశిరేఖ గానముచేసిన శ్లోకకథను గల్పించు కొని యాపట్టున నాసభ్యురాలిచేతఁ బాడించిరి. వాద్యధ్వనికిని గంఠధ్వనికిని భేద మగపడక

శ్లో. "ఆలాపకాలసమపల్లవితాంకవీణా
సౌరభ్యపాతిమధుపారవసంకులస్య,
తంత్రీస్వరస్య సమితౌ తరుణీస్వనస్య
జానాతి యత్ర చతురోఽపి న తారతమ్యమ్"

అను భారత చంపూగ్రంథములోని శ్లోకము ప్రేక్షకులకు స్మృతిగోచర మగుచుండెను. నాఁడు సదాశివరాయఁడు డనుభవించిన యానందమునకు మేరయే లేకుంట యథార్థము. ఈపాటపాడిన దెవ్వరనుప్రశ్నపరంపర యందు సాగఁ జొ చ్చెను. అందఱికంటె నెక్కుడుగ నీరసికుఁడు విచారించెను. వరతామణియే యాపాటను బాడెననియు నామె పరిత్యక్త భర్తృక యనియుఁ దెల్లమాయెను. ఆనాఁటినాటకమునఁ

బెక్కుసన్మానముల నాసభ పొందగలైను. మఱుదినమునుండి యీరాయఁడాసభవారుండునింటికిం బోవుచు నామెను బాట పాడుమని వేఁడుచు నామె యించుక పాడఁగా విని నిర్భరా నందవివశుఁడగుచుఁ గులగోత్రము లడుగఁదలంచుచు నడి గిన నేమి యాగ్రహించి పాడకపోవునో యని సంశయించుచు నేది యేమైన నడుగుటయే మేలని నిశ్చయించుకొనుచుఁ దుద కొకనాఁడామె పాటపాడుచుండఁగాఁ బోయి విని యది పూర్తినొందఁగా మితపరివారయుతయైయున్న యామె వృత్తాంత మడుగఁబూని లేమా! నీనామము కులము లోనగు వానిం బ్రశ్నించి తెలిసికొన నువ్విళ్లూరుచున్నవాఁడను. దయ మెయిఁ దెలుపుమా యని యర్థించెను.

ఆయనవేఁడికోలు నంగీకరించి యానాతిమిన్న యయ్యా! మీరింతగాఁ బ్రార్థింపనేల? చెప్పిన నిందుఁ దప్పేమియున్నది? వినుము. మాయూరు గోకర్ణ క్షేత్రపరిసరమునఁగల యనంత పురము. మాది వీరశైవమతము. కులము నడియే మే మితరులయింట భుజించువారము కాము. చిన్ననాఁటనుండి నేను సంగీతము నేర్చుకొంటిని వివాహమైనతర్వాత నాపతి నాయం దసూయనూని వదలిపెట్టెను. వేటొకతుక ప్రోత్సాహమున నతఁడట్లుచేసెనని నాభావము తల్లిదండ్రులు నాకుం గలరు. అన్నదమ్ములిరువురు గలరు. వారికి నాకును గొన్ని విషయములందు మనస్సులు పొసఁగవయ్యెను. సంగీతమునందు నాకుంగలమక్కువ చేత నింటనుండిన నావిద్య లాభింపదని యీనాటకసభయందుఁ జేరి దేశములుతిరుగుచు రసికు లగుపురుషులు వచ్చి నాగా నము వినంగోరినఁ బాడుచు హాయిగాఁ గాలము గడుపుచున్న

దానను. ఈసభ్యు లుత్తములు. ఉదారహృదయులు. ఎల్ల ప్పుడు తప్పులుపట్టుచుండు స్వభావముగలవారు కారు. ప్రతి ప్రాణికిం గలస్వేచ్ఛను నిర్బంధించునంత కఠినాత్ములును గారు. నామూలమున వారిపని చక్కఁగా నెఱవేఱుచున్నదనియు, ధనము సమకూడుచున్నదనియు, మీవంటి రసికులమైత్రి దొరకుచున్నదనియు నూహించువారు వీరందఱు నాయందు సుహృద్భావ మునిచి కాపాడుచున్నవారు. రాజచూడామణి బాయి యని నన్నందఱు పిలుతురు. ఇదియే నావృత్తాంతము. అని చెప్పి యూరకుండెను. సదాశివరాయఁ డపుడు మఱి కొంద ఱందున్నందునఁ గాఁబోలు విశేషించి మాటలాడక యెట్లో యింటికిం బోయెను.

---

# నాల్గవ తరంగము.

శిలానగరమున నొకనాఁడు సదాచారనిరతులు కొంద ఱొక్కచోటఁగూడి మంతనము చేయసాగిరి. అంతకుముందే జబ్బులపురమునుండి యొక యుపన్యాసకుఁడు వచ్చి రాజభక్తి మంచిది కాదనియు దైవభక్తి యుండవలయుఁగాని మనుజు లపై భక్తి యుంచుకొనరాదనియు, దానఁ బురోవృద్ధికి మార్గము దూరమగుననియు, మనసంఘమునఁ బెక్కుదురా చారము లున్నవనియు, వానిని దొలఁగించుకొనవలయు ననియు, నాకార్యము నెఱవేఱకున్న మనము వృద్ధినొందఁ జాలమనియు, నవకాశ మున్నంతదనుకఁ బ్రాఁతయాచారముల నున్మూలింపవలయుననియు, దేశాభివృద్ధికి భంగకరము లగు

నలవాటుల నడంపవలయుననియు వెల్లడించెను ఆయుపన్యాస మునందు దైవభక్తికూడఁ బ్రధానముగా నుండవలయునని సిద్ధాంతము చేయఁబడదయ్యెను. అదియుఁ బనికిరాదన్న బాగుండదని యంతమాత్రము చెప్పెనని యెల్లరును గ్రహించిరి. ఏనలుగురో తప్పఁ దక్కినవారెల్ల నాయుపన్యాసమును దిరస్కరించి యాతనివృత్తిం బరికించి యతఁడు స్వకార్య నిరతుఁడని యెంచెంగి తూలనాడిరి. తనవ్యాపారము కొన సాగుటకుఁ దాను వ్రాసిన తుక్కుపుస్తకముల నమ్ముకొను టకుగా బయలువెడలి యీ యుపన్యాసములమూలమున ద్రవ్యము నార్జింప సమకట్టెనని యందఱు తలంచిరి ఆతలంపున కనురూపముగా నాయుపన్యాసకుఁడు ప్రకటనపత్రికలు పంచి పెట్టుట కొక్కసేవకుఁడును, పుస్తకములు కొన్నియు వెంట నుండ నుపన్యసించును ఆయుపన్యాసమునఁ దనపుస్తకము లోని పద్యములు కొన్ని చదువక మానఁడు. దేశాభివృద్ధి కీకార్యము పూనితివనియుఁ బలుకును ఇవన్నియుఁ బైతలం పును దృఢపఱుపసాగెను కొన్నియుపన్యాసము లిచ్చి యవి వేకులను గొందఱ లోఁబఱచుకొని వారికిఁ దనభావములను బ్రకటింపఁ బ్రోత్సహించి దురభ్యాసములు వారికిం గల్గించి వెడలిపోయెను. ఆవల బాలకులు కొందఱు ప్రాఁతయాచార ములు పనికిరావని పలుకసాగిరి. పెద్దలంగాంచిన నడఁకువఁ జూపుట మానిరి దురాచారముల కలవాటు పడిరి. వారిం గాంచి మఱికొందఱును వారిమార్గమే బాగున్నదని తిరుగ నారంభించిరి.

ఆనాఁడుచేరిన సత్ప్రివర్తకులెల్ల నిట్టి యనర్థములం బోఁద్రోలి యానగరమును బవిత్రవంతముగాఁ జేయవచ్చిన వారలే కాని యేదో యొకలాభమును గోరి చేరినవారు మాత్రము కారు. ఎల్లరు గూడినపిదప నొక్కఁడు లేచి యిట్లు కార్యమును నివేదించెను భారతపుత్త్రులారా! సత్కార్యపటిష్ఠులారా! మనమెందుల కిందుఁ గూడితిమో తెలిపెదను. అది తెలిసినదేయైనను దెలుపక వదలరాదు. నే నీపనికి నియమింపఁ బడితిని. శ్రద్ధగా నాలకింపుఁడు మనపురము చిరకాలమునుండి విఖ్యాతిం గాంచినది. మననగరముచెంతనే రుక్మాంగదుఁడు రాజ్యముచేసిన నగరమున్నది. వింధ్యారణ్యము సమీపమున నున్నది మహర్షు లిం దనేకు లున్నవారని ప్రఖ్యాతి గలదు. వారి యాశీఃప్రభావము వ్యర్థమగునా? మనస్సర్థలులేక యెల్లరు హాయిగానుండ నలరు నగర మిది. ఇపుడిపు డనర్థదాయకులు వచ్చి యుపన్యసించిపోయినందున ధర్మతత్త్వ మించుకంతయు నెఱుంగని బాలిశులు కొందఱు స్వేచ్ఛాప్రవర్తకులై సదాచారములు దేశాభివృద్ధికి భంగకరము లనియు వాని నిర్మూలింపవలయు ననుచుఁ బల్కుచు దురాచారము లలవడఁగాఁ దిరుగుచున్నవారు. తొలుత విద్యావ్యాసంగము మానిరి చాటుగా ద్రాగుట కారంభించిరి. ఎంత రహస్యముగ వా రాపనిచేసినను ముఖపరిమళము తప్పక తెల్పుచుండును గదా. అగ్నివర్ధముఖులై ధనార్జనము మాని మబద్ధములాడుచు నెండుపోరికిఁ దినుచు రాజభక్తిని మానిరి. రాజభక్తి మానినవారికి దైవభక్త మెట్లుండఁజాలును? ఉపకర్తల బహిష్కరింపమానిరి. మఱియొకమాట నాలకింపుఁడు

లోకమున మంచిపేరు సంపాదించుకొని జీవింపఁదలఁచినవారు సాధుప్రవర్తకులు కావలయు. రాజభక్తియుండు వారు కావలయును రాజస్వాంతమగువిషయమున నున్నవారు మనశ్చింతలు లేకయుందురు. అరాజకము సర్వానర్థములకు మూలము. అదియే యిప్పటి యీనగరమున నుండువార లలోఁ గొందఱు గోరుచున్నవారు. వారి యనుచితోపన్యాసములు విని మఱికొందఱు వారిమార్గమునే యవలంబించుచున్నారు. స్వేచ్ఛగాఁ బ్రవర్తించుచున్నారు ఇష్టానుసారము తినుచుఁ ద్రాగుచు నున్నారు. పెద్దలేమేనన్నచో వారిని దూలనాడుచున్నారు. పూర్వాచారముల నడుగంటఁ ద్రొక్కవలయుననియు, వానిమూలముననే మన మింతదుస్థితికి వచ్చితిమనియు వాదించుచున్నారు. స్త్రీలకు స్వాతంత్ర్యము లేదఁట. దాన సర్వానర్థములు కలుగుచున్నవఁట. వారింటనే యుండ రాదఁట పూరుషులవలె వారును దిరుగవలయునఁట పాఠశాలలలోఁ జదువుకొనవలయునఁట. సభలలో నుపన్యసింపవలయునఁట భర్తతో సమానముగ వారును గౌరవింపఁబడవలయునఁట ఉద్యోగములు చేయవలయునఁట ఇట్టి యాచారములు వృద్ధియైనఁగాని దేశదాస్యము పోదఁట. మనమెల్ల దేశాభివృద్ధికి వేఱుపురుగులమఁట. రాజుండ రాదఁట. మనలోనే యొకఁడు సభాధిపతిగా నుండవలయునఁట. సభవారే రాజ్యమును బాలింపవలయునఁట, ఈకార్యము నెఱవేఱుటకై తీవ్రాందోళనము సలుపవలయునఁట దానికిఁ దగినద్రవ్యము నుపన్యాసకులను బ్రోగుచేయవలయునఁట, మనమెల్ల యథాశక్తి యనునట్లు గాక శ్రమంపడియైన ద్రవ్య మీవల

యునఁట. ఇట్లు వారు వీథులలోనెల్లఁ దిరుగుచు నుపన్యసించు చుండఁగా మీ రెల్లరు విని యుండవచ్చును. ముఖ్యముగా వారియుపన్యాసములలో జాతిభేదము లుండరాదనియే తెలియఁదగియుండును.

ఆర్యులారా! వింటిరిగదా. వారియూహ లెట్టులున్నవో. మన మింతదనుకఁ దండ్రితాతలు పడినకష్టములం బొందఁగానక హాయిగా నుంటిమి. రాజన్యంత మగువిషయమున నున్నవారమని గర్వించుచున్నవారము. ఈతృప్తి యడంగుటకే యీయూహలు వారికిం గల్గినవి. "నావిష్ణుః పృథివీపతిః" అన్నమాటను మనవారు జవదాఁటినవారు కారు దానిచే వారు సుఖమునే కాంచిరి. కష్టములపాలు గాలేదు. స్వాతంత్ర్యభంగము కలుగలేదు. ఎవ్వరిమనస్సులు ఖేదమును గాంచలేదు. గుండెలమీఁదఁ జేతులువైచుకొని హాయిగా నిద్రించుచున్నవారము అదిగో దండు వచ్చుచున్న దను వార్తలు వినఁబడుట లేదు. హిమాలయమున నున్నవారి కుశలములు రెండుదినములకే తెలియవచ్చుచున్నవి. వలయునేని గడియలోపలఁ దెలిసికొనవచ్చును. మానవులకు శాంతిగల్గఁజేయుట రాజుధర్మము ఆపని నెఱవేఱుచునే యున్నది విక్టోరియా మహారాజ్ఞి పరిపాలించుచున్నయది. ఆమెకరుణ యపారమని తేటపడుచున్నది. దురాత్మకుల చేత నాయుధము లుండుట మిక్కిలి యపాయమని యవి తీసికొనఁబడినవి సన్మార్గుల కవి యొసఁగఁబడుచున్నవి. దొంగల గుంపులు గ్రామములఁ బంచుకొని యధికారము చెల్లించు దురాచారమే రూపు మాపఁబడినది. చోరాగ్రేసరులకుఁ

ప్రతిభువుల (జామీనుదారుల) మూలమునఁ దినుగ నవకా
శము గల్పింపఁబడినది కావున వారు సత్ప్రవర్తకులుగాఁ
జొచ్చుట మనకే యగపడుచున్నది దేవాలయములయం
దుత్సవములు లోనగువానికిఁ బ్రభుత్వమువారిచే ధనసహా
యము చేయఁబడుచున్నది రాకపోకల కనువగునట్లు బాటలు
వేయఁబడినవి మూఁడువీసెల బరువుగలవస్త్రములఁ గట్టఁ
జాలక యల్లాడు స్త్రీపురుషులను మేలిమివస్త్రము లల్పమూ
ల్యమునకే దొరకునట్టి యవకాశములు గలిగినవి భూమినుండి
త్రవ్వి లోహములు తీయఁబడుచున్నవి. నదుల కడ్డముగా
సేతువునుగట్టి జలము భూముల కుపయోగించునట్లు యిపుడే
చేయ నుంకించుట మనమే చూచుచున్నాము కదా ఇంక నిట్టి
మహోపయోగకరవిషయములను జెప్పఁబూనిన నెన్నియో
నెలలు పట్టును ఒక్కవిషయమును బరికింపుఁడు. ప్రాఁతతాటి
యాకులలో మునిఁగి త్రుప్పుపట్టఁగా నశించుచున్న ప్రాచీన
గ్రంథరాజము లిపుడిపుడు ముద్రింప నారంభించిరి కదా.
అదొక్కటి చాలదా. వైద్యశాలలు నిర్మింపఁబడుట వారి
కన్నుల కగపడలేదు కాఁబోలు. ఆ యుపన్యాసములలో నొక్కఁ
డగు సుందరలాలు నెలక్రిందటనే నీఁపురిమీఁద నొక భయం
కరవ్రణము పుట్టఁగా వైద్యశాలలో శస్త్రచికిత్సచే బాగుచే
యఁబడఁగా నిల్లుచేరెను. అతఁ డట్టాని మఱచెనేమో. వాని
బావమఱిదిభార్య తారాబాయి ప్రసవింపఁజాలక యుంక ప్రసక
దన్నంత దుస్థితి నుండ నా వైద్యశాలాధికారి వచ్చి సుఖ
ప్రసవము చేయించిపోవుట మీ రెఱుఁగరా. ఇప్పుడా
వనిత పిల్లనెత్తుకొని తిరుగుచుండుట మన కగపడలేదా. దీని

నన్నింటిని గాంచుచున్నవా రట్లుపన్యసింప నో రెట్లాడెనో తోఁపకున్నయది.

ఇఁక మనకర్తవ్యము వినుండు మన మీ యుపన్యాసకులమాయలకు లోఁబడరాదు రాజభక్తిని వదలరాదు స్త్రీలకు సద్బుద్ధిని బెంపొందించు సద్విద్యను నేర్పవలయుఁగాని ధర్మమును దెలుపనివిద్యను బోధింపరాదు పరపురుషుల చెంతకు బోనీయరాదు. కులభ్రష్టులకూటమునకు మన మరుగరాదు. పంక్తిబాహ్యులతోఁ గలిసి భుజింపరాదు. త్రాగుబోతులతోఁ బొందుచేయరాదు. వీరిమాటలకు లోఁబడ యేకార్యమునకు ధనమీయరాదు. దేవాలయములయందుఁ బూజాసమయములయం దీప్రభుత్వము హాయిఁగూర్చుచు శాశ్వతముగా నుండవలయునని కోరవలయును దీనికై మనము చేయఁదగు కార్యము లెట్టివో యూహించి మీ రానతీవలయును." అని తన యుపన్యాసము చాలించెను. అంతఁ గొంతసేపు గుసగుసలతో జరపఁబడియెను. అందఱును గష్టసుఖముల నాలోచించి పూర్వపు టలవాటులే మంచివనియు వానిని వదలిన సుఖమే లేదనియు గష్టము లపారములుగాఁ గలుగుననియు నిశ్చయించి యాదురాత్ములయుపాయములు సాగకుండఁజేయఁ బ్రయత్నింపఁ గృతనిశ్చయులై తమతమయిరవుల కరిగిరి.

మృత్యుంజయుఁడు తనవైద్యవృత్తి సాగించుచుండి తనతల్లి యాకస్మికముగ మృతినొందుటచే మున్నున్నదానికి ఖముకంటె నెక్కుడుగ దుఃఖించుచుఁ దనమనోవ్యథ నితరులకుం దెలిపిన లాభము లేదని లోనిముడిఁచుకొని యేకాంతమునఁ గన్నీరు పదలుచు నేమియుం దోఁపనితఱి భగవద్గీతలం బఠిం

చుచు వానియర్థము తెలియనందునఁ బండితులపాండిత్యము
నభిలషించుచు నది దొరకినను వారనుసరించునర్థము తనతల
కెక్కనందులకుఁ బరితపించుచు నీజన్మమున కింతయే నాయ
దృష్ట మనుకొనుచు నెంతో ప్రయత్నించి కర్మమార్గము మంచి
దని యెఱింగి యది తనమనస్సునకు నచ్చనందున వానియంత
రార్థ మిదికాదని విశ్వసించుచు దానిం దెలిసికొనఁ గాని
తనమనోదుఃఖము పోఁజాలదని తలంచుచు నెల్లో కాలముఁ
ద్రోయుచుండెను పూర్వకర్మవశమున నాతని కొకమిత్రుఁడు
లభించెను. ఆతనిపేరు పరివేషకుఁడు. వాఁడు సూక్ష్మబుద్ధికల
వాఁడే యగునుగాని త్వరపడి ప్రతికార్యముచేసి యావల
వగచునలవాటు కలవాఁడు. కావున నాతని యాలోచనమును
బెక్కండ్రు కైకొనకుండిరి. మృత్యుంజయున కాతఁడు ప్రాణ
నేస్తగాఁడు. కావున రాకపోక లయ్యెడుపరసు మెండుగ
నుండెను. పరివేషకుని యూహలన్నియు మిగుల మంచివని
మృత్యుంజయుని విశ్వాసము. కాఁబట్టి యాతఁడు చెప్పినదెల్ల
వేదవాక్కుగా భావించుచుండెను ఒక్కనాఁ డాతఁడు తన
ప్రియమిత్రునికడకు వచ్చి యాతనింగూడి చల్లఁగాలి సేవింప
నరిగెను. రెండుక్రోశముల దూరముపోయి యందొక్కచో
నొక్క గున్నమామిడిచెట్టుక్రిందఁ గూరుచుండిరి లోకవార్త
లం గొంత ప్రొద్దుపుచ్చిరి. పరివేషకుఁడు వేడుకఁగా "తంత్రి
దుశ్చేష్ట లెన్నంగఁ దగదు సుమ్ము" అనుపద్యపాదమును జది
వెను. మృత్యుంజయుఁ డప్రస్తుతముగా నిదేల చదివితివని
ప్రశ్నించెను పరివేషకుఁడు నవ్వి యూరకుండెను మిత్రమా!
దానియుదంతము తెలుపకున్న నన్నుఁ జంపుకొన్నట్లు సుమీ.

యని యొట్టుపెట్టెను. మిత్రుఁడు మరల నవ్వి యెట్టివానికైనఁ జెప్పరాని వార్తలు కొన్ని గలవు అవి ప్రాణాంతమునను జెప్పఁ గూడదని పెద్దలు పలుకుదురు కావున నీవు నన్నడుగఁగూడ దని యొత్తిచెప్పెను ఏదియెట్లున్నను నీవు నాకీవిషయ మెఱిఁ గింపవలయునని పట్టుపట్టెను పరివేషకుఁడు సఖా! వివరిఁ జింతింపవలసియుండును జుమీ యని హెచ్చరించి యెన్నియో ప్రమాణములు చేయించుకొని యిట్లు చెప్పెను.

సదాశివరాయఁ డను నొకగృహస్థుఁడు కలఁడు. ఆతఁడు సంపన్నుఁడు. ఆతనివృత్తి చాలమంచిది. విద్యావంతుఁడు. దైవభక్తిగలవాఁడు కాని సర్వదా లింగమును బూజించు వాఁడు సూక్ష్మబుద్ధిగలవాఁడు పరోపకారతత్పరుఁడని యెల్ల రందురు. తెల్లంగనమాచరణము కొన్నాళ్లే కొక్కకీర్తిగా మాఱినది. కాలగతి యెట్టివారినేని తలక్రిందులు చేయఁ గలదు. ఇంద్రాదులే దానికి లోఁబడుచుందురట. ఇఁక మానవు లేపాటి అని తనవాతివృత్తాంతమును జెప్పిన యాలసించు చుండు లెఱింగి మృత్యుంజయుండు సదాశివరాయఁడు తన తండ్రి యని మిత్రుఁ డెఱుంగఁడని తలంచి మోమున మార్పు గలిగినట్టి చంద మగపడనీయక సఖా! యేల యాలోచించె దవు? నేను నీకు మిత్రుఁడను గానని తోఁచిన మానుము. లేకున్నఁ జెప్పుమని పట్టుపట్టెను. ఆతని మోమును గాంచి యిఁకఁ జెప్పకున్న నెయ్యునిమనస్సు మఱింత కలఁతనొందునని యూ హించి పరివేషకుఁడు చమత్కారముగా నిట్లు పలికెను. మిత్రరత్నమా! వేఱుగఁ దలంపకుము మాటలలోపడి వచింప వలసివచ్చెఁ గాని యిది నీవంటి సత్ప్రవర్తకునియెదుటఁ జెప్ప

వలసినది కాదు ముందు మించి పెదవిదాటినది. ఇఁకఁ జెప్పక యుండ నయితి కాదు వినుము. ఆవల సదాశివరాయఁడు వయస్సించుక మించినను నాటకసభనుండిన యొకయంగనామణిని గానమునఁ గలయభిరుచిం జేసి పరిగ్రహించెను. దేశాంతరయువతి యనియు నాలోచింపఁ డయ్యెను తన యార్జించినద్రవ్య మొకనిధిలో నిడియుండెను ఆవేసకలో నది యంతయు వ్యయమయ్యెను ఇప్పు డాతఁ డీయూరు వదలి గ్రామాంతరమున నున్నవాఁడు అందును గ్రామమున నుండక సమీపమున నొక్కరు భూములవెంబడి సస్యములకుఁ ద్రిప్పఁగట్టుకొన్న కొట్టమున నున్నవాఁడు ఆమెయు నందున్నది. ఆ నాటకసభవా రామె గోలుపోయి యాతనిఁ బరిపరివిధములం దిట్టుచుఁ బోయిరి. కులము చెడినను కామపుష్టివలనను నన్న సామెత యున్నదికదా. అట్లేమేని లాభించెనా? గోకర్ణక్షేత్రమునకుఁ జేరిన దేశమున నుండు కాంతయట సంగీతము కడుఁగుకొని త్రాగనా ఆమె వంటచేయుట యీయన భుజించుట ఇదేమి? సత్కులమునఁ బుట్టి నీచకులస్త్రీని బరిగ్రహించుటేమి? అడుగువా రెవరును లేరనియే కదా ఇఁక నెవ్వరెవ్వరెట్టితుచ్ఛకార్యము లొనర్చినను జెల్లుచునే యుండును. ఇదియే నేఁజెప్పఁదలంచిన వృత్తాంతమని ముగించెను.

మృత్యుంజయుఁ డామాటలు విని ఖేదపడియు నాభావము కనఁబడకుండ నవ్వుచు నెవరికర్మము వారిదనిమాత్రము పలికి కొంతప్రొద్దుపుచ్చి యింటికివచ్చుచు మార్గమున నే మిత్రుఁడగు పరివేషకుని నతనియింటికిఁ బంపివచ్చి తనయింట నొంటరిగాఁ గూరుచుండి యాహారమునైనఁ గొనఁబూనక చిత్తము

కలఁతనొందియుండఁగా నిట్లాలోచించెను. పాప మీపరివేష కుఁడు కపటమెఱుఁగఁడని స్పష్టమయ్యెను. ఈతనితో స్నేహము నాకుఁ గుదిరినదిమొదలు మాయింటికి వచ్చినవాఁడు కాఁడు. కావున సదాశివరాయఁడు నాతండ్రియగు టెఱుంగఁడు. కొన్ని నెలలనుండి నాతండ్రియు నీయూరనుండక యందందుఁ దిరుగు చున్నవాఁడు. కావున నామిత్రుఁ డీవార్త నాతోఁ జెప్ప సాహసించెను. ఆవిషయమటుంచి ప్రకృత మాలోచించెదను. నాతల్లి రాధాంబ సాధ్వీమణి యని ప్రఖ్యాతి గాంచినది. ఆకస్మికముగ నామె మృతినొందెను. అత్తఱి నాతండ్రిని మరలఁ బెండ్లిచేసికొమ్మని పెద్దలు ప్రోత్సహించిరి. ఎంతమాత్ర మావిషయము వలదనిచెప్పెను. కొలఁదివత్సరము లల్లే యామెనే పొగడుచుండువాఁడు ఇపు డిట్టిపని చేసియుండునా? నిన్న నాతో నొకనిధికార్యదర్శి మాటలాడుచుఁ దండ్రిగా రుంచిన ధనమంతయుఁ దీసికొన్నారే వ్యాపారమునకా యని యడిగెను. నాకుఁ దెలియదంటిని. నాతండ్రికి సంగీతమున నెక్కుడు ప్రీతిగల్గినమాట నిశ్చయమే పాటపాడుదున్నఁ జెవికోసికొని పోవువాఁడు. జబ్బులపురమున నొకయువతి పాటపాడు ననఁగా నూఱురూపాయలు వ్యయించి చీటిని గొనిపోవుట నే నెఱుంగుదు. నాతల్లి యంతధనమేల వెచ్చింప వలయునన్న నాచిత్తము నన్ను నిలుపనీయదు. నన్నే మియు ననకుమని బ్రతిమాలియే వెళ్లెను. వారిచిత్తము నేల కష్ట మును గల్గింపవలయునని మే మూరకుంటిమి. ఇపు డీవచ్చిన వార్తలం బట్టిచూడఁగా నాతండ్రి ధనమంతయుఁ దీసికొని యొకనారీమణిని నేకరించియుండుట వాస్తవమని యే తోఁచు

చున్నది. ఇపుడు నేఁ జేయవలసినపని యేమి? ఆపనిత వంట చేయఁగా నాతండ్రి భుజించునఁట. ఈవిషయమే సత్యమైనచోఁ దండ్రిని గులభ్రష్టునిగాఁ దలంచి పరిత్యజింపవలయును. దానఁ బాపముగాఁ యపవాదముగాని నాకు రాదు. పాలవంటిది మావంశము. ఏనాఁడు నపకీర్తినిబొందినది కాదు నాతండ్రి పౌండరీకమును గూడఁ జేసెను. వారితండ్రి వాజపేయము నొనరించెనఁట మావారందఱు పంక్తిపావనులని ప్రఖ్యాతి నొందినవారు. వైదికు లనఁబడు విప్రులలో మావారు సత్తమోత్తములని పేరుపొందిరి. నాతండ్రి యీపనిచే నపకీర్తి పాలగునుగదా. ఇంకను విచారించెదను. ఆపకీర్తిభాజనముగ బ్రదుకుటకంటె మృతినొందుటయే మేలు అని తలపోయుచు శయనించి నిదురరామి నెట్లెట్లో కాలముఁ బుచ్చెను.

---

# ఐదవ తరంగము.

లలిత యొకనాఁడు తనయింటనుండఁగా సుభద్ర పంపిన దాసివచ్చి మాదేవి మిమ్ముఁ బిలుచుకొని రమ్మన్నదని చెప్పెను. ఆమెయు వెంటనే పయనముచేయ ననువుగామి రెండుమూఁడు గడియలు గడపి పోయి సుభద్రం గాంచెను. ఆమెయుఁ జెలి రాకకై యువ్విళ్లూరుచుఁ దనమనోగతవార్తలఁ జెప్పఁబోన నుంకించుచుండెను. కాన లలితఁ గనుంగొనినంతనే మహా నందమునఁ గూరుచుండుమని చెప్పెను. పిదప లలితయుఁ గుశలవార్తల నడిగి నన్ను రమ్మన్న కారణము వినఁగోరెద ననియె. సుభద్రయుఁ జేయిపట్టి లలితను జెంతకుఁ దీసికొని

రహస్యముసుమీ యని హెచ్చరించుచు నిట్లు పలికెను. ఆనాఁడు నీమాటలు విన్నంతనే మనస్సు మాఱిపోయెను. ఎన్నియో ప్రకారములఁ బరిశీలించితి. నీమాటలన్నియు వేద వాక్కులవంటివి. ఒక్కటియైన నందుఁద్రోసి వేయఁదగినది లేదని నిక్కముగాఁ జెప్పఁగలను. నాయెఱుఁగినవంతయుఁ దెలిపెద. శ్రద్ధగ నాలకింపుము. నాపతి వారియింటఁ జిక్కిపోయినమాట సత్యము మూఁడువేలరూప్యములు మునిఁగిపోయినట్లే. అవి పోయిన మానె. దుష్టులతో సావాసముచేసి రాజద్రోహ మును బురికొలుపు నుపన్యాసముల నేర్చికొని గ్రామములకుఁ బోయి యందఱిని రాజభక్తిహీనులఁగా నొనరింప నుద్య మించుచున్నయట్లు స్పష్టమయ్యెను దాన నెన్ని చెడుగులు మూఁడునో నీ వెఱుంగుదువా. రాజకీయోద్యోగులు నాపతి నొకకంటఁ గనిపెట్టి తిరుగుచున్నారఁట ఎప్పు డుపన్యాస మీ యఁబోయిన నప్పుడే బంధింపవచ్చునని కిపెట్టియున్నారఁట. ఈమాట వినినప్పటినుండి నామన స్సుడికిపోవుచున్నది దిక్కు తోఁచుట లేదు. ఆహారము హితముగాక యున్నది. నిద్దుర పట్టదు. మాటలాడుచో నొకమాటకు వేఱొకమాటచెప్పు టయు నలవడుచున్నది. ఏమనిచెప్పుదును! నాలుగైదుదినముల క్రిందట నాతండ్రికిఁ గబురంపితిని. ఆయన వచ్చెను. ఈవిష యమంతయుఁ జెప్పితిని. మూఁడుదినములనుండి నాభర్త యింటికి రాలేదు. వారిఁ గాంచఁగోరి నాతండ్రి తిరుగుచునే యున్నాఁడు. కనఁబడుటయే లేదు. మిత్రబృందముతో నెం దున్నవారో యేమిచేయనున్నారో తెలియఁ దరముగాదు. పంచువంటిసంసారము సఖీ! యిట్లగుచున్నది. ఏమని చెప్పఁ

గలను? ఎక్కువగ భాగ్యము లేకున్న మానెఁగాని యన్నవస్త్రములకుఁ గొఱంత లేదుకదా. మనపంక్తి నొక్కయతిథికి మృష్టాన్న మిడి మనము భుజించినఁ జాలదా. అమితైశ్వర్య మేల? ఆదిగలవారికి మనకంటె సుఖముండునని నే ననుకొనను. ఈనాఁటి కీకడగండ్లు గలిగెను. ఏమిచేయను దోఁపక నిన్నుఁ బిలువనంపితిని. లలితా! మన యోగ్యత యేమి? రాజద్రోహమును బురికొల్పు నుపన్యాసముఁ లిచ్చుట యేమి? తక్కినవారంద ఉపన్యసింపలేదా యందువేమో. వారొక్కొక్కలాభమునుగోరి తమకు బాధలేకుండ నుపన్యసించిరు. నాభర్త కట్టిచమత్కారము లేదుసుమీ. ఈనడుమ నొకపండితునితో వాదించుచు నెంతకఠినముగా నెల్లరికు నొప్పిగలుగునట్లు మాటలాడెనో మనము వినలేదా. మాటలాడఁ బూనినపుడు దేహము తెలియదు. నే నొకప్పు డంతకఠినముగా మాటలాడనేల యని యడిగితిని. నే నేమిచేయుదు? అది నాస్వభావము ఆసమయమున నాయొడలు నాయధీనమున నుండదనెను. కావున నేనింత భయంపడుచున్నదాన. ఏమేని యుపాయము గల్గినఁ జెప్పి నాసంసారము చీకాకుపడకుండఁ జేయుమీ. అని బ్రతిమాలెను.

లలితయు నేమియుఁ దోఁపక కొంతసే పూరకుండి సుభద్రా! యీనడుమ నేదోయొకపనిమీఁదఁ గర్ణాటకదేశము నుండి సుదర్శనరావనువారు వచ్చియుండిరి వారిభార్యసుమిత్ర. మీయింటికి సమీపముననే వా రిరువురు నివసించిరి. కొన్ని దినములకు నాకు నామెకుఁ బరిచయము కలిగెను ఈభాష నించుక యామె తెలిసికొనఁగలదు. ఆమెభాష నాకు రాదు.

పడిపినముల కామె మనభాష జక్కఁగా మాటలాడఁజాలెను. ఇంటిపెత్తనములవిషయము మాటలాడుచు నాసుశీల నాతో మాదేశమున మాకే యింటిపెత్తనముచేయు నవకాశము గలదు. ఈదేశమున నది చాలఁ దక్కువగా నున్నదే యనెను. పురుషులకుఁ బెత్తనములేదా యంటిని. వారు భార్యలయధీనమున విశేషించి యుందురనియె. కారణమేమని యడిగితిని. కొన్నిమందులు గలవు వానిని బ్రయోగింతుము దానఁ బూరుషులు మామాట జవదాఁటక యుందురనియె నాకామాట యచ్చెరువుం గూర్చెను. ఆమందు లెట్టివో నాకుఁ జెప్పవలనుపడునా యంటిని చెప్పుటకేమిగాని తప్పక యట్లే చేయుదునని యన్నమునుబట్టి బాసచేసినఁ జెప్పుదుననెను నియమము లేవేని గలవా యని ప్రశ్నించితిని. విశేషించి నియమములు లేవు. కాని గట్టినియమ మొక్కటి గలదు. ఏమన నింటికి భోజనమున కెవ్వరేని వచ్చిన వారికిఁ దప్పక వానిం బెట్టుచుండవలయు అట్లు పెట్టకపోయినచో నాహారము పురుగులవలెఁ గనఁబడుననియెను. నే నాశ్చర్యమంది యితరులకుఁ బెట్టనేల ? భర్త వశ్యుఁడగుటకుఁ బెట్టిన నది కార్యకారి యగును. అన్యులకు నందు నతిథిగావచ్చిన వానికిం బెట్టిన లాభమేమనియడుగనా మె నవ్వి యామందున కట్టి నియమముగలదు. అది తుదకు దేహనాశనమును గల్గించును కావునఁ గడుజాగ్రత్తగా దానిం బెట్టవలయునని యేమేమో యావిషయమునఁ జెప్పెను. నాకుఁ జెప్పదగనంత భీతికల్గెను. ఆమాట మాని యేమోవిషయములు మాటలాడి వచ్చితిని ఆమందుఁ దెలిసికొని నీవు ప్రయోగించితివేని నీభర్త లోఁబడును. ఈ

దుస్సహవాసము మానును. ఎల్లప్పుడు నీకు లోఁబడియే యుండును. అని పలుక లలితమాటలు విని సుభద్రయు నాసుశీలతో మైత్రి చేయఁదగునని నిశ్చయించుకొనియెను. లలితయు మరల వత్తునని తనయింటికిం బోయెను.

ఇఁక వేంకటాద్రిశర్మ విషయము నించుక చదువుదము. ఆ సంపన్నగృహస్థుఁడు దండ్రియుపదేశానుసారము ప్రవర్తించుచు నాయుపదేశమే సకలవేదసారమని నమ్ముచు రాజభక్తియు దైవభక్తియుఁ గలిగియుండెను. ఆయూర నూతనముగా నేర్పడిన యొకసంఘమునఁ గలసభ్యులు కొందఱు రాజద్రోహమును బురికొల్పుచు నుపన్యసించుచుండఁగా శర్మ వినియు నించుకంతయేఁ జలింపక తనపితృపాదు లుపదేశించిన పద్ధతిని మానక రాజును బరమేశ్వరునిగాఁ భావించుచుఁ దండ్రివలెఁ దలంచుచుఁ బ్రవర్తించుచుండెను. ఆతనిం బెక్కండ్రనుసరించుచుండిరి ఉపన్యాసకులకుఁ బలుకుబడి తగ్గుచుండెను. కావున వారికి వీరిపయిఁ బ్రతిదినము కోపము హెచ్చుచుండెను. ఆకోపము కొంతకాలమునకుఁ గార్యరూపముగాఁ బరిణమింపఁ జొచ్చెను. వేంకటాద్రిశర్మ యనుచరులను గొందఱను చాటుగానుండి కొట్టుచుఁ దిట్టుచు వారికార్యములకు భంగము కలిగించుచు దుర్వృత్తు లను పేరఁ బరఁగుచుండిరి. వారిలోఁ గొందఱు తమతమకార్యములను గొనసాగించుకొనగోరి యుపన్యసించుచుఁ దిరుగుచుండిరి. పౌరులకెల్ల వారి ప్రవర్తనము కష్టతరముగా నుండెను. వారివారి మనోవ్యాపారముల నెఱింగినవారెల్ల నది స్వకార్యమునుగోరిన యుక్తియెత్తుగా నుండునని తలంచుచుండిరి క్రమక్రమముగా

వారిచర్యల ఖండించుచుండిరి కొలఁదిదినములకు నాయుప న్యాసకుల మోసమెల్ల వెల్లడికాసాగెను. అందుఁ గొందఱు గ్రామములకుఁ బోయి తమతమవ్యాపారముల సాగించుచు జనులకుం దమపేరు తెలియుటకు నుపన్యసించుచు నుపన్యాస వేతనములం బుచ్చుకొనుచు మనస్సునలేనిదేశభ క్తిని వెల్ల డించుచుఁ బరోపకారార్థము పాటుపడుచున్నయట్లు నటిం చుచు వంచకులై తిరుగుచుండిరి. పెక్కం డ్రీగుట్టు తెలిసికొనక వారు దేశముపైఁ గలయభిమానముచేతనే సర్వత్యాగమొన రించి పాటుపడుచున్నారని తలంచుచు వారేమో తమ్ముద్ధ రింతురని నమ్మి వారియుపన్యాసముల వినుచు వారియుపదేశ ములు దేశదారిద్ర్యమును దొలఁగించునని నమ్ముచు వారికిం దోడుపడుచు వారివలెనే తమరు నుండఁ గోరుచునుండిరి ఎన్ని దినము లుపన్యసించినను బద్ధతి యొక్కటే యగుచుండెను. వేంకటాద్రిశర్మ యనుచరులు కొందఱు వారితత్త్వ మిదియని తెల్పినను వినక వారినే యనుసరించుచుండిరి వారి నాక్షే పించిన వారియెడఁ గినుకఁ బూనుచుండిరి ఈయంతరమున వంచకులు మఱింత దేశభ క్తిని బయలుపఱచుచుఁ దిరుగ సాగిరి. ఈయాపత్తునఁ గొందఱు మధ్యస్థులు నిశ్చితబుద్ధులు కాక యెటుచేయుటకుఁ దోపకయుండిరి. సత్యముగా దేశ భ క్తిగలవారి కాతరుణమునఁ బ్రఖ్యాతి లేకపోయెను వేంక టాద్రిశర్మయు నీ విషమావస్థయం దేమిచేయుటకుఁ దోఁపక పరమేశ్వరకటాక్షమును గోరుచుఁ దనపూఁచినవ్రతము విడ నాడక సాగించుచుండెను. క్రమక్రమముగా వంచకులయుప న్యాసములు స్వకార్యార్థ మనుభావము నుంతనుంత వెల్లడి

యగుచుండెను. కాలము పక్వమైనఁగాని యేపనియుఁ గొన సాగదు గదా!

మృత్యుంజయుఁడును సదాశివరాయఁడును మనస్పర్ధలచే నొకచోటనుండ సమ్మతింపనిస్థితియందుండిరి తండ్రి ద్రవ్యమంతయు నా యెమ్మెలాడికొఱకు వెచ్చించుచున్నాఁడనియు, ముదుసలితనము రానున్నతఱి నీకార్యము మంచిది కాదనియు, దీనఁ గులమునకుఁ గళంకము కల్గుచున్నదనియుఁ జింతించుచుండువాఁడు. ఈవిషయమంతయుఁ బరివేషకుఁడు కనిపెట్టెను. ఆతనికొక తోఁబుట్టువుండెను. ఆమె మిగుల సొగసుఁదనమునఁ బ్రఖ్యాతిఁ గాంచినది. తల్లిదండ్రు లామెకు వివాహముచేసి యత్తవారింటికిఁ బంపకముందే భూలోకమును వదలవలసినవారైరి. పరివేషకుఁ డొక్కఁడే యామెకుం గలసోదరుఁడు. ఆతఁడు విశేషించి చదువుకొన్నవాఁడు కాఁడు. కాని విద్వాంసునివలెఁ బ్రవర్తించుచుండును. వారివృత్తి పెక్కండ్రుసజ్జనులకు సరిపడకుండెను. నవనాగరికులలోఁ బ్రథమతాంబూలమునకుఁ దగినవాఁడు. తోఁబుట్టువును జక్కఁగాఁ దీర్పఁగలవారుగ నాఁడువారు లేనందున నిరుగుపొరుగువారి నమ్మలక్కలను నమ్ముకొని యామెరక్షణము వారియధీన మొనరించుచుఁ గాలము గడపువాఁడు. కొన్ని దినముల కామె యత్తవారింటికిఁ బోఁదగిన యీడుకల దాయెను. ఆసమయమున నామెకుఁ బనిపాటలు నేర్పి తీర్పఁగలవా రెవ్వరు? భగవంతుఁ డొక్కఁడే. వయస్సు చిన్నది ఇరుపొరుగిండ్లకుఁ బోవ నలవాటు పడియెను. చదువువచ్చినది కాని యది పెద్దలచాటుననుండ మిఁ జక్కఁగా నుపకరిం

పకపోయెను. ధనవంతులబాలికలతో సావాసము. ఇవన్నియు దోడుపడఁగా నామె నలుగురిలోఁ దిరుగ నేర్చుకొనియెను భర్తృగృహమునకుఁ బంప నిశ్చయించి పరివేషకుఁ డామె నడుగ నిపుడే పోనొల్లనిభావ మగపడున ట్లుత్తరమిచ్చెను. బంధువులెల్ల నెక్కుడుఁ గనఁబడినను దన్నుఁ దూలనాడుచున్నం దునఁ దుదకుఁ బరివేషకుఁ డెట్లో సమ్మతింపఁజేసి యత్తవారింటికిం బంపెను. ఆమెపే రాత్రేయి. ఈపేరేల పెట్టఁబడియెనని యెవ్వరేఁ బ్రశ్నించిన మాది యత్రిమునిగోత్రమని సోదరుఁడు బదులు చెప్పుచుండువాఁడు. ఆత్రేయి యత్తవారింటికిం బోయెను. గాని యందలియాచారము లామెకు నచ్చనందునఁ గొన్ని దినములైన నటనుండనొల్లక యన్నకడ కరుగవలయునని పతితోడఁ జెప్పుచుండెను. ఆమెపతి ప్రవరనామధేయుఁడు పురోహితవృత్తి జీవించునాచార మాయింటివారికి సనాతనము. కాని ప్రవరుఁ డదియే ప్రధానముగా భావింపక పురాణముచెప్పుచు ధనవంతుల నాశ్రయించుచు మర్యాదగాఁ గాలముఁ ద్రోయుచుండువాఁడు. భార్యయం దత్యంత ప్రీతిగలవాఁడు. విదుషియని సుందరాంగియని సత్కుల ప్రసూతయని యాయాత్రేయిని మిగుల గారాబమున నేలుచుండెను. ఇన్నివిధములఁ దన్ను భర్త ప్రేమించుచుండినను దనయిష్టానుసార మొరులగృహముల కరుగుట కభ్యంతరము గల్గించుచున్నందున నామె యాపతి నంతగా ప్రేమింపక యేదో యొకవిధముగాఁ జూచుచుండెను. ఏమియు నెఱుంగనిప్రాయమని యాతఁ డద్దానినెల్ల సరకుగొనక యుండెను. ఆతనితల్లిదండ్రు లామెను మర్యాదగాఁ జూచుచు నిరుగుపొరుగిండ్ల

ఆపని జరిగినంతనే యాత్రేయిపతికి నౌర్ధ్వదైహికములు సాగు చుండఁగనే తనయందమునకు లోపముఁ గల్పించు ప్రయత్న మేమే నొనరింతురో యని యెవ్వరికిం దెలుపకయే యొక పూరుషునిం బిలుచుకొని యన్నకడఁ జేరెను.

పరివేషకున కవ్వలఁ గొన్ని దినములకు మృత్యుంజయు నితో మైత్రి యలవడెను. కావునఁ దనమిత్రునకుఁ దండ్రిపైఁ గల విరోధము నెఱింగి యతఁడు పదడబ్బులు వైద్యవృత్తి నార్జించువాఁడు కావున భార్యను బోషించుకొనఁ గలఁడని యెంచి యాత్రేయి నాతనికిఁ బత్నిఁగాఁ జేయ నూహించెను. ఆయూహ బయలుపడకుండనుండియే తండ్రిమరియాదను సమయోచితముగా మృత్యుంజయున కెఱింగించెనని యిప్పుడు పాఠకమహాశయు లూహింపఁ గలరు. దాననే తండ్రికిని గొడుకునకును మనస్పర్ధ లుదయించెననియు నూహింప వచ్చును. ఆమనస్పర్ధలు నానాఁటఁ బెరుగసాగెను. ఏగ్రామ మున రాజచూడామణిబాయిని వరించెనో యాయూరనే యామెంగూడి సదాశివరాయఁడు వసించెను గ్రామమున నుండ ననుకూలింపక కాఁబోలు నూరిబయట నొకయిల్లు కట్టుకొనియుండెను. పాషండకులజనితురాలై మాంసమును వదలుకొన్నను శ్రోత్రపతిని వరించినందున నామె మాంసమును భుజింపఁ బతి నలవరించెను. తుదకు సదాశివరాయఁడు మాంస భక్షకుఁడుకూడ నయ్యెను. ఆవిషయముకూడ నల్లల్లన నెల్ల యెడలఁ దెల్లముగా వెల్లడియయ్యెను. పరివేషకుఁ డీమాట గూడ మృత్యుంజయున కెఱింగించెను. తుదకుఁ దండ్రి కుల భ్రష్టువయ్యెనని నలుగురితోఁ జెప్పునట్లు చేయఁజాలెను

"మత్స్యాదస్సర్వమాంసాద స్తస్మాన్మత్స్యాన్ పరిత్యజేత్."
అను మనుస్మృతిశ్లోకమును జదువుచుఁ జేపలను దినువాఁ డెల్లమాంసములను దినినట్లే యని చక్కఁగా మనస్సునకు నచ్చఁజెప్పెను. ఆమాటలు తనమనస్సునఁ గలయిార్ష్యను బెంపొందింపఁగా మిత్త్రునియం దిసుమంతయు ననుమానము నొందక తండ్రితోడి సంబంధమునుగూడ వదలుకొనఁ బ్రయత్నించి పెద్దల నడిగెను. కాని వారింత త్వరపడు టుచితము కాదనియు నింకను గొంతకాల మోర్చియుండి చతుస్సాక్షికముగాఁ బరీక్షించి వదలుకొనవచ్చునని నచ్చఁజెప్పిరి కావున నూరకుండెను.

కొన్నినెలలు గడువఁగా మృత్యుంజయుఁడు వలయు నన్నిమందు లుండుటంబట్టి యూరకుండఁజాలక రక్తవృద్ధిని గల్గించుమందులఁ బుచ్చుకొనసాగెను పరివేషకుఁ డప్పుడప్పుడు ప్రస్తావవశమున "తస్మాత్సర్వప్రయత్నేన రక్తం శుక్లం చ రక్షయేత్" అనుశ్లోకమును జదువుచు నౌషధసేవకుఁ బురికొల్పుచుండెను. దాన మఱింత శ్రద్ధతో వానింబుచ్చుకొనుచు క్షీరపానము చేయుచు స్వాదుఫలములఁ దినుచు దేహము బోషించుకొనుచుండెను. పరివేషకుఁ డొకనాఁడు మాటలాడుచు మిత్త్రమా! నాగృహము కొంతకాలము నుండి వాసయోగ్యముగ లేదు. ఈఁగలబాధ మెండు. చెమ్మ యెల్లప్పుడుండును. కావున దాని మరలఁ గట్టింపఁ దలంచితి. ఆసమీపమున నుండఁదగినయిల్లు కుదురలేదు. ఆకారణము ననే పలుసారులు నిన్నుఁ జూచుభాగ్యము నాకుఁ గలుగకున్నది. నిన్న రావలెనని యెన్నియోసారులు ప్రయత్నించితిని.

కాని సాగినది కాదు. ఇంక వారముదనుక రాఁ జాలనేమో. క్రొత్తయిల్లుకుదిరి యందుఁజేరి వస్తువులఁ జక్కఁగా నమరుచు కొని కదా రావలయు. ఏడుదినములు నిన్నుఁ జూడకయుండఁ గలనా యనునదియే యిప్పుడు నన్ను బాధించువిషయము. అన్నింటికి నీశ్వరేచ్ఛయే కదా. అని యూరకుండెను. తన మిత్రుఁడు చెంతనుండిన మఱింత మేలని యాలోచించువాఁడు కావున నాతనిం గాంచి సఖా! నాతో నీమాట యెక్కఁడమా అయినను జెప్పితివా. మనయింటిపొరుగువారు రేపు గ్రామాంతరమున కరుగుదురు. ఆయిల్లు నాయధీనమున నుండును. నీవు తప్పక యెల్లియే చేరవచ్చును. అద్దెయుఁ గొంచెమే. తప్పక రావలయుఁ జుమీ యని యొత్తిచెప్పఁగా నతఁడు తనవలలోఁ బడనున్నాఁ డని యెఱింగి మఱింత యుత్సాహము గల్గియు దానిం దోఁపనీయక సఖా! దూరముగానున్న మనయిరువురకు మంచిది. సమీపముననున్న నింతటిమైత్రి యుండునో ఉండదో యనుశంక బాధించెడిని. అన నాతఁడు మఱింత శ్రద్ధగా రమ్మని ప్రార్థించెను. ఎంతోకష్టముమీఁద నట్లే యని యంగీకరించి మఱునాఁడు సాయంకాలముదనుక రాకయుండి తొలిజాము నించుకయుండఁగా వచ్చిచేరెను. తనతోఁబుట్టువును గనఁబడక యుండ నుండుమనిచెప్పి దననుజూడ మిత్రుఁడు రాఁగా నామెను లోపలనునిచి మాటలాడి సాగనంపెను.

ఆగృహము విశాలముగ నెత్తుగ నుండెను. ఇంటి ముందు బహిర్ద్వారమునకు లోపలఁ గొంత రిత్తచోటు గలదు. వేసవికాలము శయనింప నది యుపయోగించుట యింటివారివాడుకయై యుండెను. ఆచోటున రెండు వేపచెట్లు

నాలుగు పొన్నచెట్లును గలవు. ఆపొన్నవృక్షములు రెండు ప్రక్కలఁ జాలుగా నుండునట్లు వేయఁబడి యుండెను. వాని నడుమ నుత్తరమునుండి దక్షిణమునకుసాగున ట్లొక్క వేదిక యమరింపఁబడియుండెను. ఆవేదికల పైభాగమున స్నిగ్ధముగాఁ గనుపట్టు పాషాణములు రెండమర్పఁబడినవి. వాని నాపొన్న చెట్లకొమ్మలు చక్కఁగా నాచ్ఛాదించియుండును. వసంతగ్రీష్మ కాలములలో సాయంకాలములం దాపాషాణములు చల్లఁగా నుండుటకు జలములఁ జల్లుచుండుట వాడుక. అవి చల్లఁదనము గలిగి యలరార నందుఁ గూరుచుండి తాంబూలచర్వణము చేయుచు నిష్టులతో ముచ్చటలాడుచుండునాచార మాయింటి వారికిం గలదని పాఠకు లెఱుంగుటొప్పు. ఆపొన్నచెట్లకు మల్లికాలత లల్లుకొనఁ జేసియుండిరి. వేపచెట్టు రెండవది బహిర్ద్వారమునకు దక్షిణముగాఁ దూరప్పడమరలయం దుండెను. అంతపెద్దవి కావు కానవే ఝొంపములుగా శాఖ లుండఁ జల్లఁదనమును గల్గించుచుండెను. ఇంటిముందు రెండ రుగులు వేయఁబడియుండెను. వానిమీఁద సౌధభాగము కలదు. క్రొత్తవారువచ్చి యందుఁ గూర్చుండవలయుననియు నింటిలోఁ బ్రవేశింపకుందురుగాక యనియు వారిభావము. ఆవేదికలక్రిందఁ జాలుగ లతలవలెనుండు పూలచెట్లు మృత్పాత్రముల నునుపఁబడియుండెను. వానికొమ్మ లొక ప్రక్క కించుక వ్రాలియుండును. పరిమళముల వెదఁజల్లుపూవు లవ్వానినిండ నుండును. ఆవేదికలపైఁ గూర్చున్నవా రాపూవులఁ జిదుమఁ బ్రయత్నింపక వానితావుల గ్రోలుచుం డుట యలవాటు. ఆవేదికలనడుమ నల్వురొక్కపరి పోఁదగి

నంతమార్గము గలదు. గృహద్వారము సుందరముగా నమ ర్పఁబడియుండెను. దానివంటివి రెండుగదు లిరుప్రక్కలఁ గట్టఁ బడియుండెను. వానినడుమఁగూడ మార్గపరిమాణము పై విధముగనే యుండెను. అవ్వల నొకస్థలము విశాలాయామ ములుగలిగి శతసంఖ్యాకులు హాయిగాఁ గూరుచుండఁదగి నంత యుండెను. దాని తూర్పుపడమరలయందు మర్యాదఁ గనఁబఱచుపీఠములు గొన్నియుండెను. ప్రేముతో నల్లఁబడినవి కొన్ని యుం దుండెను. ఎల్లయెడల మార్గమునువదలి రత్న కంబళములు వెలయుచుండెను. దానిద్వారమున కవ్వల రెండుగదు లుండెను. పడమరదెస నున్నగది యాఁడువా రు డ నేర్పఱుపఁబడినది. తూర్పుదెస నున్నగది వస్తువ్రాతము లుంచుకొనఁదగినది. దానిద్వారమును దాఁటఁగా నొకభోజ నము సేయుస్థలము, దానిపడమటిదెస పాకశాలయు నుండెను. దానిద్వారమున కవ్వల రిత్తబయలు. అందుఁ దలవాకిట నిలు చుండి చూచినఁ గనబడునటు తులసీవృక్షము వేయఁబడి చుట్టు వేదిక యమర్పఁబడియుండెను. అందుఁ గూరుచుండి యాతులసిని బూజించుట యాయింటివారి కలవాటు. దాని కిరుప్రక్కలయందుఁ బూలచెట్లుండెను. ఆస్థలము విశాల ముగఁ గన్పట్టుచు నుండెను రెండు ఛాయాద్రుమము లందుఁ గనఁబడును. దానియందుఁ దూర్పుభాగమున నొకనూయి గలదు. అది యా యింటివారిదైనను దూర్పునఁగట్టఁబడిన గృహమున నుండువారలు జలము తీసికొనవచ్చునని లేఖాము ఖమున సమ్మతి నొసంగఁబడియుండెను. కాన నానూయిపైన గోడ కట్టఁబడలేదు నీరు తోడుకొన ననువగున ట్లొకచక్ర

మమర్పఁబడియె. రెండవవారును దమభాగమున నట్లే యమ ర్చుకొనిరి. నీరు తోడుకొనునపుడే రెండిండ్లవారును మాట లాడుకొనవచ్చును. దానికి దక్షిణోత్తరభాగముల నుండు గోడయు నంతయెత్తుగలది కాక సాధారణముగాఁ గట్టఁబడియే యుండెను. ఆబావికి నుత్తరముగ రెండుగృహములనుండు వారు వస్త్రక్షాళనముచేయ ననువగునట్లు రెండు దృషత్పాషా ణముల మమర్పఁబడియుండెను. వానినెక్కిన మోకాటిసమముగ నాగోడ యుండును.

ఆగృహమునకుఁ బైభాగమున నొకసౌధము నాతి విశాలముగాఁ గట్టఁబడియె. దీనింగాంచి తూర్పుగానుండు నింటియధికారియగు సదాశివరాయఁడు నొకసౌధమును గట్టిం చెను. ఈగృహములరెండింటిని వేఱుచేయు సందొకటి కలదు. దానివెడల్పు మూరకంటె నెక్కువకాదు. ప్రక్కయింటివా రితోఁ బ్రొద్దుపోకకు సదాశివరాయఁడు రాత్రికాలమునఁ బరుండియుండుగూడ మాటలాడుచుండువాఁడు. కావునఁ బొరు గింటివారిని దనకుఁగల మైత్రిపెంపన నాసందును గనఁబడ కుండఁ జేయనెంచి సదాశివరాయఁడు గోడకట్టించెను ఒక్కరి యింటిపైకి నొకరు వెన్నెలరాత్రులలో వచ్చుచుం బోవు చుండిరి. క్రొత్తవారాయింటఁ గాపురముండుటకు వత్తురని కలలోనైన నతఁ డూహింపలేదు. దైవవశమున వారికా పొరుగూరున నుండుభూములు దుష్టికి రాఁగా నందుండి వానిని ఫలవంతముగఁ జేయునూహకలిగి యటకుం బోయిరి. ఆసమయమునకుముందే సదాశివరాయఁడు గ్రామాంతరమున నొకయువతిం గూడియుండెఁ గదా. ఆకారణముననే పరివే

షకుఁ డాత్రేయి యనుతోఁబుట్టువుతో నందుఁ బ్రవేశించెను వారిరాకచేఁ దనకెంతయో మేలుకలదని మృత్యుంజయుఁ డూహించెను. పరివేషకుఁడు తనయుద్దేశము కొనసాగునన్న యూహతో నాగృహమును జేరెను.

---

# ఆఱవ తరంగము.

సుమిత్రతో సుభద్రకు గాఢమైత్రి లభించెను. మైత్రి యొడఁగూడుటకు లలితయే కారణము. కొలఁదిదినములకే క్షణకాలవియోగము దుస్సహమనుభావ మిరువురహృదయములఁ బొడసూపెను. లలిత యొకనాఁడు ప్రోత్సహింప సుభద్ర యేకాంతమున సుశీలా ! నావిచారమును దీర్ప నీవుతప్ప నొరులు లేరుసుమీ యని జొటజొటఁ గన్నీరు విడిచెను. ఆమె మృదుతమచిత్త గావునఁ దత్తఱపడి తనచేలాంచలమునఁ గన్నీటినొత్తి సఖీ ! ఏల యీలీల జాలిపుట్ట విలపించెదు? నాచేనైనపని గలుగఁ దీర్పకుందునా అడుగుము. ప్రాణముల నిత్తును. అని జేతిలోఁ జేయివైచి పలుకుచుఁ జుబుకము పుడికివేఁడెను. సుభద్రయు రహస్యముసుమీ యని హెచ్చరించుచు మగనిదురవస్థయుఁ దనదుఃఖము సంసారతాపమును దెలిపి మనస్సుకరఁగున ట్లుంగలార్చెను. సుశీల యామాటలు విని చప్పరించి యిదెంతపని? దీనికొఱకా యింతగా దుఃఖించెదవు.భయంపడకుము. రేపు రమ్ము. ఆదివారము కాన నామూలికల నుపదేశించెదను. దాన నీమనోవాంఛ నెఱవేఱఁగలదు. ఒక్కసారి యీామం దుపయోగింపుము. నీపతి నిన్ను వదలిపోకయుండును. కాని యతని కేమేని బాధగలిగిన నాకుఁ

దెల్పుము ప్రతిక్రియ: దెల్పుదు నని నచ్చఁజెప్పి పంపెను. సుభద్రయుఁ జింతామణి దొరకెఁగదా యని సంతోషపడుచు రాఁగల హానిం దలంపక స్త్రీబుద్ధి కుఱుచయన్న నానుడిని సార్థకము చేయుచు నింటికిం బోయి యానాఁడును పతి రానందున లలితను దోడురమ్మని యెట్లో రాత్రిగడపెను.

మఱుదినము యథోక్తకాలమున లలితను దోడ్కొని పోయి సుశీలం గాంచెను. ఆమెయు నాయౌషధమును సిద్ధము చేసి యుంచెను. కావునఁ బ్రియమార రమ్మని కూయుచుండఁ బెట్టి యా యౌషధమును జూపి దీనిం దీసికొనిపోయి మగఁడు రాఁగా నేమియు నాగ్రహమున్న జాడఁ గానరానీయక గౌరవించి భుజించువేళఁ గందిపప్పు కలిసిన కూరలోఁగాని మఱెద్దానిలోఁగాని కలిపి వడ్డింపుము. ఇది చేఁదుగా నుండదు. ఇది యంతయు నొక్కదినమే యుపయోగింపకుము. రెండు దినము లుపయోగింపుము. మూఁడవదినము భుజించినపిదప వాంతియగును మందు వ్యాపించుచున్న దని గ్రహింపుము. ఆ రెండుదినములు తాంబూలమునం దేలకుల నుపయోగింపకుము అవి యీమందునఁ గలశక్తిని దగ్గించును. నాల్గవదినమునుండి వాంతి కాదు. ఆనాఁటినుండి నీవు చెప్పినదెల్ల నర్థాంగీకారమున విడుచుండును. ఆవల నొకవారముపోవఁగా మఱి చూడు మీమందుశక్తి. కుక్కవలె నీ వెంటనుండును. నీవు పెట్టినదే భిక్షము. నీవు నందియన్న నతఁడట్లే నందియనును. నీవు నందియనుట పొరపాటు. అది పందియందువా నిజమే అని పందియే యని యాతఁడనును. కాని యొక్కమాటను జెప్ప వలసియున్నయది. ఆతఁడు క్రమక్రమమున క్షీణించును. ఆఱు

మాపములు దాటినపిదప నీమందునకుఁ బ్రతిక్రియ చేయ దైవమునకుఁగూడ శక్తిచాలదు. దృఢశరీరుఁడైన మూఁడు నాల్గువత్సరము లెట్లో సంచరించును. ఆవల జీవించుట నీయ దృష్టముననే ఏదియెట్లున్న నీయాపధశక్తి యనుపమానము. అని చక్కఁగాఁ దన్మహాత్త్వమును దెలిపెను

సుమిత్ర పలుకు లాకర్ణించిన సుభద్రచిత్తము మార్పు నొందెను. తొలుత భయముతోఁచెను. ఆమీఁద విచారము పొడసూపెను దానిపిదప దుఃఖము తలయెత్తెను. అనంత రము క్రూరకార్య మిదియని స్ఫురించెను. తరువాత భర్త లోకాంతరగతుఁడు కాఁగా నాగతి యేమగునోకదా యను నాలోచన మంకురించెను, అవ్వల నిట్టికార్య మొనర్చినని విన్నయెడల నెవ్వరైన నన్ను నమ్ముదురా దైవమోర్చునా యను నూహ యావరించెను. ఇన్నితోఁచినను వానిం బైకిఁ గానరానీయక మాపనిగాచ నట్లేయని తదవసరోచితముగ మాటలాడి యామందును జాగ్రత్తగాఁ దీసికొనిపోవుచు సుశీలా ! ఇది చేయుపద్ధతిం దెల్పుమా యని యడిగెను. ఇ ట్లడిగినసుశీలకు మఱింత నాపై విశ్వాసము కలుగుననియు నేశంకయుఁ గలుగదనియు నామెయూహ. ఆప్రశ్న మాల కించి యించుక ముఖవికారమును గుఱుతించి యనుమా నించుచున్న సుశీల దానిందిగవిడిచి యిట్లు తెలిపెను. సఖీ ! ఇదియొక లతావిశేషమునకు సంబంధించినది. ఆలతపేరు తెలు పరాదు. దాని యాకారముం దెల్పెద నీవే తెలిసికొనవల యును అది పచ్చగా నుండును. చాలభాగము నాక్రమించు కొనఁజాలదు. కాని చెట్టువలెనుండదు. దానికాడ గుండ్రముగా

నుండును. దాని యాకులు పచ్చగానుండి గుంప్రముగాక పోగగానుండక యా రెండింటికి నడుమనుండునాకృతి గలిగి యుండును. ఆకు నడుగుభాగము బూడిదరంగుగా నుండును. పై భాగము పచ్చగనుండునుగాని రెండో మూఁడో యెఱ్ఱని చుక్కలుండును. సస్యములఁ బశువులు భక్షింపకయుండఁ జుట్టును వేయువెలుగున (కంప) కల్లుకొని యుండును. అన్ని తావుల నుండక పోవచ్చును కొన్ని తావుల నుండును. ఆలతయం దచ్చటచ్చట నాకు లుండునుగాని విశేషించి యుండవు. స్థలవిశేషమున దట్టముగా నాకు లుండుటయుం గలదు. ఆకు నమలినఁ జేఁదుగా నుండదు. తియ్యఁగాను నుండదు. కావున నీగుణములనుబట్టి యాలతను గనుఁగొనవలయు. ఇట్లే యితరులకు నుపదేశింపవలయునని నాకుఁదెల్పిన పతి వ్రతయాజ్ఞ. ఈ గుఱుతులఁబట్టి కొందఱు గనుఁగొందురు. కొందఱు కనుఁగొనఁ జాలరు. వారివారియదృష్ట మెట్లుండునో గాని యావిషయమున వేఱొకమాటను జెప్ప నవకాశము లేదు. నా యూహాప్రకారము కొంతకాలమునకు నీ కగపడ వచ్చును. ఒక్కమాట చెప్ప మఱచితిని. అది కనఁబడినపిదప సంవత్సరమునఁ దక్కువపక్షమున నిర్వురకైనఁ జెప్పకయుండ రాదు. అట్లు చేయకయుండిన నన్నము పురుఁగులవలెఁ గనఁ బడును. ఆలతను దెచ్చునపుడు శుభవారమనఁగా సోమ బుధ గురు శుక్రవారములలో నొక్కఁ డుండవలెను. భగ వంతునిగా భావించి పూజించి నైవేద్యమిడినపదార్థమును దానే భుజించి పిదప దానియాకులు కోయవలయును. ముప్పది రెండాకులు చాలును. మెత్తగామర్దించి మూఁడు మిరియపు

గింజలువేసి మరల నూరి ముద్దచేయవలయును. అలతవేరు వశీకరణలత. సుభద్రా! నీవు నాకుఁ బ్రాణసమానురాలవు. ప్రాణములకంటె ని న్నెక్కుడుగ భావింతునన్నను సత్యమే. కావుననే దీని నుపదేశించితి లలిత యేమనుకొనునో. ఆవలఁ గాచుకుండమంటిని గదా. ఇది మంత్రమునకంటె రహస్యము. జాతోడు. ఇతరులకుం దెల్పకుము. నావంటిసఖి దొరకిన నసన మామె నుంగల్గిన వచింపుము గురుపరంపర వృద్ధి కావలయుఁ గదా. అని పలికి యూరకుండెను. సుభద్రయు నామె యడుగులకుఁ బ్రణమిల్లి సెలవుతీసికొని యామందుగుటిక నెట్లో దాఁచుకొని యింటికిం బోవుచు లలితతో నీవిషయము మాటలాడుచు నిది పరమరహస్యముగా నునుపుమీ యని హెచ్చరించుచు నింటికిం బోయెను.

పరివేషకుఁడు మృత్యుంజయుని పొరుగునఁ జేరిన తర్వాతఁ బ్రతిదినము సాయంకాలము మిత్రునింగూడి వనవిహారమునకుం బోవుచు రెండుగడియలకంటె నెక్కుడుకాలముండక ముందే నాసోదరి కడుజేల. ఒంటిగానుండనోడును అని పలికి త్వరపడి యింటికి వచ్చుచుండెను. ఆత్రేయిసోదరు నానతి మెయి నీరుతోడఁబోవుచోఁ దన్నెవ్వరు చూడకుండనుండు తఱినే నూతికడకుఁ బోవుచుండెను. సోదరుఁడు విహారము నకై మిత్రునింగూడిపోవునప్పుడు జలాహరణముచేయుచుండెను. మఱియు వా రింటికివచ్చినపిదప నంధకారముగనున్నను నీరు తోడుచుండెను. కొలఁది నెల లిట్లుగడచెను. ఆవల రాత్రి రెండ వజాము ప్రవేశించుతఱి నింటిలోఁ గూరుచుండి వాద్యసహాయమునఁ బాటలుపాడ నారంభించెను. ఆమెకంఠము కలర

వము. కాన నెల్లరకుం దెలియకుండును. ప్రక్కయింటివారికిం దెలియకుండునా. రెండవజామున మృత్యుంజయుఁ డొంటిగఁ గూరుచుండి యాపాట విననోచెను. పదిసారు లద్దానిని విని యామె గీత పాడుచుండఁ జెంతనుండి విన నూహించెను పరి వేషకు ననుమతిలేక యాకోరిక నెఱవేఱదని యాలోచించి యొక్కనాఁడు మిత్రునితో మాటలాడుచు సఖా! ఈలోపల సరిగా నిద్దురపట్టుట లేదు. నాటకములుకూడ నీయూర నాడుట లేదు. హాయిగా సంగీతమువినగోరిన నీయూర నవియు దుర్లభమే. జబ్బులప్రవమునకుఁబోయి కొలఁది దినములుండి వత్త మనుకొన్నాఁడను. కాని వైద్యవృత్తి కది పొసఁగదు. నిరంతరము గృహముననే యుండి యెవ్వరేపని వచ్చినను వారికి సమాధానముచెప్పి మందులిచ్చి పంపుచుండవలయును. వారొకవేళ నింటికిరమ్మన్నఁ బోయిరావలయును. కావున గ్రామాంతరమున కొకటి రెండుపూటలు పోయినఁ బోవచ్చు నుగాని వారములటుఁ గడుపఁ దరముకాదు. పోకున్న నారో గ్యము నిద్రాభంగమునఁ జెడునట్లున్నది ఏమియుఁ దోపకు న్నది. అని విసుగుకొని యూరకుండెను. పరిచేసనుఁ డతని యాశయ మెఱింగి తనసోదరీగానమును వినఁదలఁచి యీప న్నాగమును బన్నెనని తలఁచుచు నిట్లులనియెను. నేస్యుఁడా! సంగీతమనఁగా నేమియర్థము. మహావిద్వాంసులు పాడిన విన వలయునని యూహింతువా. గాలిపాటగా వినుట కింపుగా నున్నఁజాలునని యూహింతువా అనెను. మృత్యుంజయుఁడాతు రంపడి యంతగొప్పపాట వినుశక్తి నాకెక్కడిది? లయజ్ఞానమైన నాకులేదు. కర్ణానందముగా నున్నఁజాలును. ఏదోయొకతృప్తి

మనస్సునకు నుండవలయుఁ గదా. అనెను. పరివేషకుఁ డిట్లు దన యుద్దేశము నెఱవేఱినదే యనుకొని స్నిగ్ధుఁడా! నాతోఁబుట్టువు కడుబేల. లోకజ్ఞానము లేనిది అందువలనదుఃఖాంబురాశి మునింగియున్నది చిన్న తనమున నించుకసంగీతశాస్త్ర మభ్యసించినది కాని యా-జోలియే మానియుండి యిప్పుడిపుడు మఱచిపోయినదానిని స్మరణమునకుఁ దెచ్చుకొనుచున్నది. ఆధ్యానములోనున్న ప్పుడైనఁ దనదుఃఖము తగ్గునని యామె తలంపు కాన భగవద్గుణములఁ దెలుపుపాటలనే పాడును. మఱొక్కమాట. ఆమెకు మోమోటమి యెక్కుడుగఁ గలదు. పురుషుఁ డెవ్వఁడేఁ గనంబడినచో మరల మూఁడువెనముల వఱకుఁ గంఠ మెత్తి గట్టిగా మాటలాడఁజాలదు. ఎట్లు బ్రదుకునో తెలియఁజాలను నేనొకఁడ నున్నాఁడను కావున నామెను గడుపులోఁబెట్టుకొని కాపాడుచున్నాఁడను. తల్లిదండ్రులు లేరుగదా. నాకథయు నింతమాత్ర మున్నది. ముందెట్లు భగవంతుఁడు కాపాడునో తెలియఁజాలను అని పలుకుచుఁ దల వంచి దుఃఖించినట్లు నటించెను. మృత్యుంజయుఁ డతనిదుఃఖము మాన్పఁ బూని యెన్నియోమాటలాడి యనునయించి యాతని తోఁబుట్టువునకుఁ గల్గినదుఃఖమేమని ప్రశ్నించెను. పరివేషకుఁ డిట్లు చెప్ప నారంభించెను

ఆర్యా! నేనేమని చెప్పుదును. నాతోఁబుట్టు వాత్రేయి. ఆమెవయస్సిప్పుడు పదునాలుగేండ్లుగా నుండునని యెఱుంగుము. పదియవవత్సరము చేరఁబడి చేరఁబడకయుండుతఱి మాతండ్రిని మోసముచేసి యొక్కపురోహితునికుమారునకు నిప్పించి యాత్రేయికి నవిధిగాఁ గొంద ఱొకపాడు దేవాలయ

మున వివాహము జరపించిరి. మాతల్లియు నెఱుంగదు. ఆ రహస్యవివాహము శాస్త్రీయముకాదని పెద్ద లెందఱో చెప్పి మా తల్లిదుఃఖ మాపిరి. బొమ్మలపెండ్లింట్లగా నావివాహము సాగెననియు మరల సకాలమున ననుమాపుఁడగు వయసకొసంగి వివాహము చేయవచ్చుననియు మాతల్లి నమ్మియుండెను. కాని యామె యకాలమృతివాఁత బడియెను తండ్రియు నట్లే పోయెను. నేనాదుఃఖములో మునింగియుండి నలువురు చెప్పఁగా నూకక వారియింటికిం బంపితిని ఆవరుఁడు సమాసుఁడని తోఁచిన వివాహముచేసి యీయవచ్చునని నాకెల్లరుం జెప్పిరి. పూర్వము పెండ్లియయ్యెనందురె దానిగతియేమని నే నడిగితిని. అది నిశ్చితార్థముగాని వివాహముకాదని యంద ఱుపదేశించిరి. నమ్మి సోదరీ ! ఆయిల్లు వరుఁడు నెట్టివారో కనుఁగొనిరమ్మని పంపితిని ఆయూర నాబంధువులుకూడఁ గలరు. వారి వారియిండ్లలోఁ బదిదినములవంతుండఁగా నాలుగు నెలలు గడచెను. ఆవరుఁడు సదా రోగియఁట. ఆసమయమున నే రోగము వృద్ధియగుట నాతఁడు మరణించెను వాఁడే నీకు భర్తయని కొందఱుతులువలు నాసోదరిని ద్వరపెట్టి కర్మము చేయింపుమనియు నాఱువందల రూప్యము లప్పున్న వనియు నిప్పుడి యిప్పనియుఁ జెప్పిరఁట నాబంధువులొకరు శ్రమంపడి వారికంటఁ బడనీయక పిలుచుకొనివచ్చి నా చెంత విడిపించిపోయిరి ఆ యవమానదుఃఖముచే నాత్రేయి వగచుచు బయట రాఁజాలక యున్నది. చూచితివా. ఎట్టివారు కలరో. ఇప్పుడు పదునాల్గవయేడుసాగుచున్నది. త్వరగా వివాహముచేయఁ బ్రయత్నించుచున్నాఁడను. బ్రాహ్మణుఁ డైనఁ జాలును. అనాంతర భేద

నులు పాటించునాచారము మాయింట లేదు. మాది యజుశ్శాఖ. భారద్వాజగోత్రము. త్వరగా వివాహముచేసి పిదప నాగతియేదో చూచుకొనఁ గోరియున్నాఁడను. ఆవిష యమంతయు నటుండనిమ్ము. మాయింటికి రేపుసాయంకాలము వచ్చిన నాసోదరిచే మంచిపాటలుపాడుమా యని తెల్పెదను. నీవు వచ్చినది తెలియరాదు. ప్రాచీనకాలపుఁ గన్య. ఏమియు నెఱుంగదు. మోమోటము మెండు. కాన నీవు వచ్చునెడల నింటిలోనుండి పాడునట్లు సంవిధానము గావింతును. అనఁగా నామాటలెల్ల వేదవాక్యములని నమ్మి మృత్యుంజయుఁ డట్లే యని పలికెను. పరివేషకుఁ డింటికింబోయెను.

మఱునాఁడు సాయంసమయమున నామెకుఁ దెలుపఁ దగినమాటలు చెప్పి సంవిధానము చక్కఁగాఁ జేసెను. ఆమె యంతర్గృహమునఁ గూరుచుండి యాభరణాదులఁ దీసివైచి ప్రాఁతచీరకట్టుకొని మోమునఁ గుంకుమ మగపడుచుండఁగా వాద్యము సాయముచూపఁ బాడుచుండెను ఆమె కగపడ కుండ మృత్యుంజయుని రావించి యందుఁ గూరుచుండఁబెట్టెను. సంకేతముప్రకార మాత్రేయి మృత్యుంజయుని రాక నెఱింగి యిట్లు పాడ నారంభించెను.

లేఁతప్రాయము - కలిగెను వగకాఁడ
యీతటి దయచేయుమా - సదాశివ. లేఁత.

ఏతటినైనను - జేతము నీపయి
నేనుంచినదాన - నేలుము దయచే. లేఁత.

మృత్యుంజయుఁడవు - మేటిమగండవు
మేలుభక్తులకు - లీలఁగాఁ గ్తవు. లేఁత.

దాసురాల నన్ను - వేసరుదానను
గాసినొందకుండః - గాపాడుము నాథ. లేఁత.

ఈపాట ముఖారిరాగమునఁ గలరవమునఁ బాడఁగా విని మృత్యుంజయుఁ డచ్చెరుపంది యోగివలెఁ దన్మయుఁ డయ్యెను. ఆమెమోము కనరాదయ్యెనని చింతించెను. మఱి రెండు పాటలు పాడెను. తమజాడ తెలియనట్లు వా రిరువురు లేచి వచ్చిరి. ఆపాట యేదేవునిమహిమమును జెప్పునని ప్రశ్నింపఁ బరివేషకుఁడు సర్వార్థవాసదక్షుఁ డగుమృత్యుంజయుని గూర్చిన గేయమిదని తెల్పెను. పిమ్మటఁ జాల సుగేయ మిది యని నమ్మెదను. మంచిపాట విన్నాను. అని విసుతెచి చెలికాని కడ సెలవుపుచ్చుకొని మృత్యుంజయుఁ డింటికిఁ బోయెను. ఆమఱుదినము మొద లాయమ్మాత్రేయినిజూడఁ దివురుచు సాయంకాలమున గాలిసేవింపఁ బోవు ప్రయత్నముఁగూడ మాని యపుడపుడు నూఁతనింగాంచుచు నిట్లు కొంతకాలము తదేక చింతతో నుండెను.

సదాశివరాయఁడు తనవలపుఁగత్తియఁగూడి యాగ్రామమునకుఁ జెంత నొకపాకలోఁ గొన్ని నెలలు కడపెను తానార్జించి నిధిలోనుంచియున్న ద్రవ్యమంతయు నించుమించుగా వ్యయమయ్యెను కొన్ని జబ్బులుచెలఁగి దేహపాటవము తగ్గఁజేసెను. దానితోడ నామెపైఁగలప్రీతియు నించుకశేషముగానే తగ్గెను. నలుగురుబంధువులు నీకిది యేమి దుర్వృత్తి పట్టుపడియెను ? మాణిక్యమువంటివంశమును మంటఁ గలిపితివి ఆస్త్రీ యేకులమునఁ బుట్టినదో నీవెఱుంగుదువా? ఆమె పెట్టినయన్నము నెట్లు భుజించుచున్నాఁడవు ? నీతెలివి తెల్ల

వాఱినట్లే యున్నది. అను నీమొదలగు చీవాట్లు పెట్టుచుఁ గనఁబడినపుడెల్ల దూఱసాగిరి. ఎందుఁ బోను వలనుపడ దయ్యెను ఎవ్వరితో మాటలాడుదమన్న నవమానము గలుగు నేమో యని తోఁచెను. ఎవ్వరితో మాటలాడక యుండఁ దలంచినను ధనవిషయమున మాటలాడుట తప్పని సరియగు చుండెను ద్రవ్యమును సేకరించునుపాయ మేమి తోఁపకయుం డెను. సంగీతమువిన నెవ్వరింటికి వత్తురో యనుచింత మెండ య్యెను "వృద్ధస్య తరుణీ విష" మ్మనుసూక్తి యనుభవము నకు రాసాగెను. నాభార్య యింట నున్నదని యెవ్వరితోఁ జెప్పినను వారు నవ్వుచుండుటంగాంచి దుస్సహతాపము మదిగదుర నెద్దియొనరించుటకు నాలోచనము కుదురనందునఁ దుందుడుకు చెందుచుండెను ఇంచుమించుగాఁ బదివేలరూప్య ములు వ్యయమయ్యెను. అందు నాలువేలరూప్యములు చేదు పానకమునకు నుపహారములకును, బరిమళవస్తువులకు, వస్త్ర ములకును వ్యయమయ్యెను మూఁడువేల రజతముద్రికలు భోజనమునకు శయ్యాసనాదులకు వెచ్చింపఁబడిరెను. వేయి వెండినాణెములు రాజచూడామణి యాభరణములకు వ్యయ మొనర్పఁబడియెను. కాఁగాఁ బదివేలును నిధినుండి గ్రహింపఁ బడి వ్యయింపఁబడియెను. ఇఁక సదాశివరాయనియొద్ద నించు మించుగా మూఁడువందల రజతముద్రిక లుండెను. నిధియు ద్యోగు లిఁక మాకడ మీద్రవ్యము లేదని వ్రాఁతమూలమునఁ దెలిపిరి. ఏకాలమున నాద్రవ్యము సంపాదింపఁబడినదో యూ హింపఁజాలము కాని యంతయు నిట్లే పాడుచేయఁబడినదే యని వెక్కిండ్రు వగచిరి. రాయనికిని మనశ్చింత కలుగక

పోలేదు. కాని బయటికిఁ దోఁపనీయక లోలోనఁ గుళ్లుచు నంద ఱకుంజూడఁ దనగౌరవమునకు లోపమురానియట్లు కనఁ బడుచు నిఁక నిండుండిన నీయపారసంసారము నెట్లు సాగింపఁ గలనురా తండ్రీ యనుకొనుచు నెంచుచుండఁగా నాతని ప్రియురాలు చూలా లయ్యెను. ఐదవమాసమున నాభరణ ములు తెచ్చియిచ్చువాఁడుక నూయింటఁగలదని యప్పటి పతితో నామె హెచ్చరించెను. లేనిసంతోషమును దెచ్చుకొని రాయఁడ ట్లేకానిమ్మని యామూఁడువందలు వ్యయించి యెల్లరు మెచ్చుకొనున ట్లుత్సవమును జరపెను. రాజచూడామణి బాయి యంతకుముం దెట్లున్న నపుడుమాత్రము మఱొక రిని జేపట్టినది కాదు. కావునఁ దన నే నమ్మియున్న దని సదాశివ రాయఁడు సర్వమును కామహాపతివ్రతనే నమ్మియుండెను. ఆమె గర్భవతియైనప్పటినుండి పతిని గష్టపెట్టసాగెను ఆకష్ట మాయన కాకాలమున సుఖముగనే తోఁచెను. కాని ధన మెక్కడినుండి తెత్తునా యన్నవిచారమునకు లోనుగావలసిన వాఁడే యయ్యెను. కొంతకాల మట్లే యాలోచించుచుండి తగినయోజన తోఁపనందున నిఁకఁ గుమారునికొఱ కొఱగక యున్న సంసారము నడువదని యూహించి కృతనిశ్చయుం డయ్యెను. ఒకరిద్దఱు ప్రాఁతమిత్రులు కనఁబడినందున నిధినుండి తెప్పించియిత్తునని నమ్మఁబలికి వేయిరూప్యములఁ బుచ్చుకొని యొకవత్సరము గడుపవచ్చుఁగదా యని యెంచే యుండెను. కొన్ని నెలల కాయొమ్మెలాఁడి యామగనికడఁ బోలికలుగా నొకబాలికను బాలకునిఁ గవలఁ గనియెను. సదాశివరాయనికిం గల్గినప్రమోద మింతింత యనరాదు. నామకరణమహోత్స

వము ధనవ్యయముకాని యాడంబరముతో నడపెను. పేరు పెట్టుసమయమునఁ బతియేమోపలుకఁ బోవఁగా నాతి మాట కడ్డమువచ్చి లక్ష్మీబాయి యనియు, రామమూర్తి యనియు నామములఁ బెట్టుఁడని గట్టిగాఁదెలిపెను. భర్తకా పేరు లిష్టము లేకున్నను గుండెగాలముగానుండు నండజయానమాట జవ దాఁటకుండ నుండఁగల వాగ్దానము ననుసరించియు ముఖ్య ముగాఁ బ్రేమననుసంధించియుఁ దాను నంగీకరించెను. ఆనాఁటి యుత్సవవ్యయము రెండువందలరూప్యములే యైనను భార్య కిచ్చిన పట్టుచీర మొదలగువాని కాఱునూటముప్పదేడు రూప్యము లయ్యెను. విధిలేక వచ్చిన యాగ్రామవాసులు తాంబూలముల గైకొని పోయిరి. భోజనమున కుండుఁడని ప్రార్థింప సదాశివరాయఁడు జంకి యూరకుండెను.

---

# ఏడవ తరంగము.

ఉపన్యాసకులయలజడి ప్రజలకు మెండయ్యెను. పల్లెల కుంబోయి యుపన్యసించి వారినెమ్మదికి భంగము కలిగించిరి. ఇదిగో మనకే రాజ్యము వచ్చును. అప్పుడు ధనము త్రవ్వి మీానెత్తినఁ బెట్టుదుము. ఇపుడు మాకు సాయపడుఁడు. ద్రవ్యమొసంగుఁడు. రాజున కీయవలసినకరము తీసివేయఁబడును. ప్రతిపల్లెయుఁ బట్టణమువలె నుండును. తటాకములు బాగు చేయింతురు. బావులు త్రవ్వింతురు. సత్రములు గట్టింతురు. త్రోవలన్నియు బాగుచేయంబడును. చల్లనినీడలఁ గూరుచుం డుచుఁ బోవచ్చును. అయోమార్గము లుండనిపల్లియ యుండ దని నమ్ముఁడు. ఈపనులన్నియు మా యుపన్యాసములమూల

మున సాగును. మాకడ మందులున్నవి. వానిం గొనుడు. ముతకవస్త్రము లున్నవి. వానిం గట్టుడు. స్వరాజ్యము వారములోపలనె వచ్చును. నిష్ఫలములగు జాతిభేదములం బాటింపకుడు. స్త్రీలకు స్వేచ్ఛ నొసంగుడు. వా రూహపతిపగు చుండవలయును. చక్కఁగా నుపన్యసింప నేర్పుదుము. వారి మూలముననే మనదేశము వృద్ధికావలయును. ఆఁడువారిని భీతిగలవారినిగాఁ జేసినపాపము ననుభవించుచున్నాము కదా. చిన్నతనమునందే వివాహములు చేయక వారిని స్వేచ్ఛఁగాఁ దిరుగనిండు. పురుషులలోఁ గలిసి తిరిగినగాని వారికి భయముతొలఁగదు. ఇష్టసిద్ధి చేకూరదు. ప్రాఁతయాచారములఁ దొలఁగింపుఁడు. అవియే మనకొంపల ముంచుచున్నవి. ఇంకను ముంపఁగలవు అన్నము పావనము. ఎందు భుజించిన నేమి? సురాపానము చేయు నలువురు మంచినప్పుడుట. కాన నట్లు చేయఁగూడదు. మాసంఘమునఁ జేరుఁడు. కొందఱు సంఘ లోనికి రానీయరాదని యేలయందురు. అందఱకు భగవంతుఁడు తండ్రి. కరుణాస్వరూపుఁడు కదా భగవంతుఁడు. మనమెల్లర మాతనిపిల్లలము. జాతిభేదములఁ బాటింపకుఁడు అసు లోనగువిషయములనెల్లఁ గంఠస్థముగానున్న వాని నెగరియెగిరి పలుకసాగిరి రెండుమూఁడునాళులు ధనమొసంగి యాగ్రామములనుండువారు వినగి వారివ్యాపారములఁ బరీక్షించిరి వారిప్రవృత్తి స్వార్థమునే తెలుపుచుండెను. ఇచ్చినద్రవ్యమంతయు నపహరింపఁబడుచుండు నెఱుకపడెను. గాడరు బాడ రనుగ్రామమున నిట్లే యుపన్యసించి ధనమడుగ నందున్న చిన్న పెద్ద లొక్కచోఁగూడి మాప్రశ్నములకు బదులు చెప్పి

మాసంశయములం దీర్చి ధనముగైగొనుఁడని వారిని బ్రార్థించిరి. వారును సమ్మతించి యాసభ కేగిరి. ఇట్లు ప్రశ్నోత్తరములు సాగెను.

ప్రశ్నము:—అయ్యలారా! భూపతి కీవలసినకర మీావల దంటిరికదా. స్వరాజ్యము లభించినపుడు పాలకులకు ద్రవ్యమెట్లు వచ్చును?

ఉత్తరము:—ఇపుడున్నంతగాక చాలఁగొంచెముగానుంతురు.

ప్ర:—ఉద్యోగులకు రక్షకభటులకు వీరభటులకు వేతన మేలాగిత్తురు?

ఉ:—పెక్కండ్రూరక దేశక్షేమార్థ ముద్యోగముచేయుదురు. తక్కుంగలవారి కేదో భుక్తికై వేతనము లిత్తురు.

ప్ర:—అటులైన వారు తృప్తిగాఁ బనియుచేఁజాలుదురా? ఎంత కాలము చేయఁగలరు ?

ఉ:—కొంతకాలము కాఁగా భూములయాదాయము ననుసరించి కరము వృద్ధిచేయఁబడును. ఆధనమునుండి వేతనము లీఁబడును.

ప్ర:—అప్పటికి స్వరాజ్యమువలని లాభ మేమి ?

ఉ:—అట్లు ప్రశ్నింపరాదు అనేకరహస్యము లందుఁ గలవు మనవారే యధికారులగుట చాలదా. ద్రవ్యమంతయు మన దేశముననే యుండును

ప్ర:—మీాయుత్తర మేమియు బాగులేదు. ఈయుపన్యాసములతో స్వరాజ్యమురాదు. మఱికొన్ని చిక్కులు గల్గును. అనుచుండునంతలో రాజభటులు వచ్చి యాయుపన్యాసకుల నిర్బంధించిరి. మేము దేశమునకై ప్రాణదానముచేయ సిద్ధముగ

నున్నారమనువారు మోములు వెలవెలఁ బోఁగా గ్రామస్థుల నాశ్రయించి యెట్లైని మమ్మువదలించినఁజాలునని పాదములఁ బట్టుకొన నందొకపెద్దమనుష్యుఁ డెన్నియో సమాధానములు చెప్పి వారిని వదలిపెట్టునట్లు, వారిఁక నిట్టియవివేకములు మాటలాడమని వాగ్దానము చేయునట్లు చేసిరి. రక్షక భటులు వారిని వదలిరి. మరల నాగ్రామములో నుండ మొగ ముచెల్లక వారు నాలుగుచీవాట్లు పెట్టిపంపఁగా నిఁక నీలాటి వేషమువేయమని స్వాపరాధముల నొప్పుకొని తమదారిని బోయిరి. ఆవార్త నలుదెసల వ్యాపింపఁగాఁ దక్కినయుప న్యాసకులు తలవంపులవునన్న భీతిచే వారి నాక్షేపించుచు మమ్ము నిర్బంధించినఁ గారాగారమున కరుగ సిద్ధముగనున్నార మని ప్రల్లదములు పలుకుచు నుపన్యసింపసాగిరి. వారిపలుకు లాపల్లియలనున్న వారికిని రుచింపనంత నిస్సారము లయ్యెను. ఈయుపన్యాసకులెల్ల స్వకార్యదక్షులనుటయు దృఢమయ్యెను క్రమక్రమముగా వారి నాదరించువారు తక్కువవారైరి. వేంక టాద్రిశర్మపక్షమునఁ గలరాజభక్తులమాటలు విన నుద్యుక్తు లైరి. శర్మయుఁ బితృవాక్యము ననుసరించి రాజభక్తిని బోధిం చుచు రాజన్యాయప్రవర్తకుఁడు కాకయుండఁజేయ భగవం తునిబ్రార్థించుచుఁ దననియమమును వదలకయుండెను. తచ్ఛిష్య ప్రశిష్యులు సర్వజనవినుతపాత్రులై యొప్పుచుండిరి.

మృత్యుంజయునిస్థితిగతులు విచారింప నవసర మిపుడు న్నది. ఆత్రేయిసందర్శనకుతూహల మాతనికి మెండయ్యెను. ఆమెను దొంగపెండ్లి యయ్యెననియు నది విధివిహితము కాదనియుఁ జెప్పిన పరివేషకునిమాటలు మిక్కిలి రుచించెను.

గోత్రసూత్రములు సరిపడినందునం దా నామెను బరిణయమా డిన బాగుండునని నిశ్చయించుకొనెను కానియామెరూపమును బరికించికాని యాప్రయత్నము చేయరాదని యూహించెను. సాయంసమయమందు విహారముపోవుటమానిన నాత్రేయి యా సందర్శనభాగ్య మాతనికి లభింపలేదు ఆమె ఘటికింతపట్టు దలతో నాతనికిం గనఁబడక యుండనెంచెను. "తానొక్కఁడు తలఁప దైవమొక్కఁడు తలచెఁ" అన్నట్లామెయుద్దేశము నెఱవేఱక తటాలున నొకనాఁడు నూతియొద్ద కామెపోవున ప్పటికి దైవయోగమున మృత్యుంజయుఁ డచటికి వచ్చియుం డెను. ఆమె నాతఁడు తొలుదొల్తనే చూచెను. ఆమెయు నాతనిఁ దరువాతఁజూచెను మృత్యుంజయుఁ డట్లేచూచుచు నిలుచుండెను. ఆమె తటాలున నాతనిం జూచి మొగము వంచఁబోయి యప్పుని కస్వాతంత్ర్యాలయి యట్లే యుండెను. మొత్తముమీఁద నిద్దరు నట్లే చూచుకొనుచు నిలుచుం డిరి ఎట్టకేల కాత్రేయి యించుక తలవంచుకొనఁ జాలెను. వెంటనే లోపలి కరిగెను.

ఆమె రూపవతియే యనవచ్చును. మోము గుండ్ర ముగాక విశేషించి సోగఁగానుండక పాటిగానుండును. కన్నులు మిగులఁబొడవులై హరిణేక్షణముల నీసడించుచుండును. మేని ఛాయ యపరంజిని దిరస్కరించుచుండును. సాముద్రికశాస్త్ర మునఁ జెప్పఁబడినలక్షణములన్నియు ననకున్నను గొన్ని యా తనూవల్లికఁ గనఁబడుచుండును. నేత్రములు హస్తములు నాయసన్నలమిన్న యందమును ద్విగుణముగాఁ జేయుచుండు ననుటమాత్రము సత్యము. కావుననే యామెనుగాంచి పరి

వేషకునిమాటలు సత్యములనియే నమ్మి కన్యక యని నిశ్చయించి పెండ్లియాడఁ గోరెను. కాని యావాంఛను దెలుపు టెట్లో యని చింతించుచుండెను. నాటంగోలె నాత్రేయి నాలుగుపెనములకొకసారి యేదోయొక నెపముపెట్టుకొని మూతికడంజేరి కలరవంబునఁ బాడుకొనుచు నచ్చట నించుక కాలము గడపుచు నంతలో నెవ్వరో తన్నుఁ బిలిచినట్లు, ఇదిగో వచ్చుచున్నానని తాఁ బలికినట్లు సుంత గట్టిగా మాటలాడుచు నాసమయమునఁ దనరాకనెఱింగి మృత్యుంజయుఁడు వచ్చునో రాఁడోయని పరికించుచు, వాతఁ డొకకార్యమునకని యచ్చటికిరాఁగా క్షణమైననుండక యింటిలోని కరుగుచు నాతని నూఁచియూఁచి పరీక్షించుచుండెను.

ఇప్పట్టునఁ బాఠకోత్తములకు నొక్కవిషయము తెలుపక తప్పదు. ప్రేమమహత్త్వ మెట్టిదో కనుఁగొనవలయుననవియే యావిషయము. ఒక్కపురుషుఁడుయువతిని ప్రేమించుటకు రెండుకారణము లుండును ఒక్కటి రూపము. రెండవది గుణము. వీనికి వేఱగుకారణము ద్రవ్యమని కొందఱందురు. అది తఱచుగా లోకమున ననుభవసిద్ధము కాదు. సౌందర్యముగాంచి ప్రేమించినచో నాప్రేమ మస్థిరమే యనవలయు గుణమును బరికించి ప్రేమించినయెడల నది శాశ్వతమనవలయును. ఫలవృక్షమునుగాంచి మనమద్దానిం బ్రీతిగాఁ దిలకించిన నాప్రీతిఫలములు ముగియఁగా ముగియును. చెఱకునుగాంచి దానిం బ్రీతినర్థించిన నామధురము బహువిధరూపముల మన కగపడుచుండుటంజేసి యది తగ్గక యుండును. సౌందర్యము గాంచినంతనే ప్రేమ మంకురించు.

కొలఁదిదినములకే యది లభింపఁ బోలఁగు. గుణములఁబరికించు టకుఁ జాలకాలము పట్టును. ఆపరీక్ష యైనఁగాని ప్రేమము కుదురదు. ఆప్రేమము చిరకాలము నిలుచును. గుణములు స్థిరములు. సౌందర్య మస్థిరము. దీనింబట్టియే ప్రేమముండునని మన మంగీకరింపవలయును. కావున గుణవతి యని పరిగ్రహించిన నాదాంపత్యమునకు నంతరాయము గలుగదు. సుందరాంగి యనికోరి చేరఁదీసిన వియోగము కలుగక తప్పదు. ఈసిద్ధాంతమున కెందేని భంగముకూడఁ గలుగవచ్చును. కాని యది తఱచుగ లేదని చెప్పవచ్చును. కావుననే,

సీ. "ఇల్లుచూచినఁ దోఁచు నిల్లాలిశుచివృత్తి
కూఁతురు ప్రకటించు మాతగుణము"

అని పెద్దలు చెప్పిరి. కన్యకను బరీక్షించి గుణవతి యనియెఱింగి పరిగ్రహింపవలయును. తల్లిగుణంబులంబట్టి తఱచుగాఁ దద్గుణములఁ బొందిన పుత్త్రికాగుణము లుండునని పెద్దల భావము. దీనిం బరికించిన గుణములనుగాంచియే ప్రేమించి గ్రహింపఁదగునని ప్రాచీనులభావ మైనట్టు కనుపట్టుంగదా. ఆ భావమును ద్రోసిపుచ్చరాదు. విశేషకాలపరీక్షలవలనఁ దేలినదవి. పూర్వుల కాయుర్దాయ మధికము. పట్టుదలయు నసామాన్యమే యనవలయు. అల్పకాలపరీక్ష యట్టిది కాదనియు నెఱుంగవలయు. ఇఁకఁ గథకు మరలుఁడు.

మృత్యుంజయుఁడాత్రేయిని బ్రేమించెననుట స్పష్టము. ఆమెయు నట్టిదేకదా. ఇఁక వివాహసంస్కారవిశేషము కొదువ. మాటలసందడిలో నపుడపుడు మృత్యుంజయుఁడు పరివేషకునితో విక్రయాన్నము దేహమునకు సరిపడకున్నదనియు, నాఁడు

దిక్కు లేకుండ నుండుటకంటె సన్న్యసించి కాశికింబోవుటయే మంచిదని యోజించుచున్నాఁడననియు సన్న్యసించినచో వైరాగ్యము స్థిరముగా నిలుచునో లేదో యనుశంక కలదనియు, ముప్పది యేండ్లకే పొడసూపినవైరాగ్యము చలించినచో నది యుభయభ్రష్టుఁడ నగుటకు హేతువగుననియు నీశంకలతోఁ దన చిత్త మూఁగులాడుచున్న దనియుఁ బల్కుటయేగాక తన బంధువు లెవ్వరో యొకకన్యకను మాటలాడిరిమనియుఁ బెండ్లియాడవలయుననియుఁ ద్వరపెట్టుచున్నారనికూడఁ జెప్పుచుండెను. పరివేషకుఁడు నీటిలోఁ జాడ లరయువాఁడు. కావున నాతనిభావమును గనిపెట్టి మఱింతబిగించుకొని వినుచు బదులేమియుం బలుకక సరేసరే యనుచుండెను. పదిదినము లిట్లే సాగెను. పరివేషకునిభావ మనుకూలముగా లే దని నిశ్చయింపఁజాలక యనుకూలించునదియే యనియు దృఢపఱచుకొనలేక మృత్యుంజయుఁడొకనాఁ డావిషయమే మాటలాడుచు మిత్రమా! ఎందైన నీవే యీవిషయమును గనుఁగొనుమా యని చెప్పెను. ఆతఁ డావిషయము తన కనుభవసిద్ధముకాదే. ఐనఁ గనుఁగొందు ననిమాత్రము బదులుచెప్పి వానియెత్తిది కదా యని కనుఁగొని చమత్కారముగాఁ దప్పించుకొనుచుండి యతఁడే పలుకరించిన నప్పుడు చెప్పవలసినమాటలు చెప్పుదుగాక యని యెంచి యూరకుండెను. మృత్యుంజయుఁ డాత్రేయి యనుదినము కనఁబడసాగుట మఱింత చంచలస్వాంతుఁడై మాటలాడ నుంకించియు నేమనునో యని జంకుచు నామెవచ్చువేళ తెలిసినందున నప్పటి కేదోపనిమీఁదఁ దానచ్చటికిం బోవుచుఁ దేఱి చూచుచు నుండెను. ఆమెమాత్రము

సుంతయేని మాటలాడక యట్లేపోవుచు మరలవచ్చుచు లేనిపని యున్నట్లు కల్పించుకొని యాతఁడచ్చటనుండునంతలో నాలుగు పారులు వచ్చుచుంబోవుచు దలవంచుకొనుచుఁ బనినెపమున నించుకయెత్తుచు నిట్లు లాతని నూఁగులాడించి చూచుచుండెను. స్వాత్మైకచిత్తుఁ డని నిశ్చయించుకొనియెను. పరివేషకుఁడు లోలోన నామెకుం దెల్పఁదగినవాక్యములఁ దెల్పుచు నుండఁ దగుమార్గము నెఱింగించుచుండెను.

అట సదాశివరాయఁడు కుమారునికడకుఁ బోయి యతని దయను సంపాదించుకొనక తప్ప దని యాలోచించి కుమారునకుఁ గలమిత్రులలో నొకఁడగు శ్యామరావు కనఁ బడఁగా నాతని బలుకరించి మిగుల సత్కరించి తనవృత్తాంత మెఱింగించి ముదుసలితనమున నాకుఁ జేయూఁత యొసఁగ కున్న నాపదలపా లగుటయేకాక దుర్మరణముపాలుకూడఁ గావలసివచ్చుననియు నట్లుగాకయుండ నన్నుఁ గాపాడుట కొడుకునకు విధియనియుఁ బూర్వకర్మవశమున దీనితగులము గలిగెననియు నాయపరాధమును బాటింపక నన్నుఁ గాపాడు నట్లు చేయవలసినభారము నీదే యనియు దీనత్వమునఁ బలి కెను. ఆమాటల కార్తినొంది శ్యామరావు మెత్తనిమనస్సు గలవాఁడుగాన నాచేతనైనసాయము చేయుదునని వాగ్దా నముచేసి మఱియు నిట్లు చెప్పెను. మీకుమారుఁడు పూర్వ మార్గమున నాతో మాటలాడుట లేదు. పరివేషకుఁ డనువాఁ డొకఁడు మిత్రుఁడుగాఁ జేరినాఁడు. వాఁడు మిక్కిలి వంచ కుఁడు. వాని కొకసోదరి కలదు. ఆత్రేయి యని యామెపేరు. ఆమె పెండ్లియైనపిదప భర్తగృహమునకుం బోవక యిల్లిల్లు దిరు

గుచుఁ దుద కెల్లరును దిట్టిపోయఁగా నెట్లో పోయి యందు నిట్లేయుండి వారికిఁ దలవంపులు కలిగించి యింతలోఁ బతికొక మందుపెట్టి తుదముట్టించి వానికిఁ గర్మముచేయ నారంభింపఁ గనే యెవనినో పిలుచుకొని సోదరునికడఁ జేరినది. స్వేచ్ఛగా నున్నది. ఆమె యందగత్తెయే. సంగీతమున నించుక ప్రవేశము కలదు. ప్రస్తుతము మీకుమారునియింటి ప్రక్కనుఁ గలసౌధమునఁ జేరినది. పరస్పరము ప్రేమించియున్న వారని యును నికఁ గొలఁదిదినములలో వివాహము సాగుననియు నెల్లరు చెప్పుకొనుచున్నారు. పరివేషకుఁ డామెకుఁ బెండ్లియే కాలేదని చెప్పి నమ్మించె నఁట. ఈకారణములచేత నాఁటి వానిమైత్రి యతనికిపు డవసరములేదు. వినను గనఁబడిన ప్పుడు యథాపూర్వముగా మాటలాడుచుండుము. సమయము కనిపెట్టి మీవిషయము తెల్పెదను అని పలుక సదాశివరాయఁడు మనస్సున మిగుల సంతోషించి శ్యామరావు హస్తముంబట్టుకొని నాయనా! ఆ వివాహము కాకయుండ నభ్యంతరము గల్పింపనుము. మేమెల్లర మొక్కకుటుంబముగా నుందుము. ఒకరియిండ్లకు రాము. మావలన మీకే మియు బాధలుండవు. నామాట యింతమాత్రము పాటించి దిక్కులేని నాయందు దయయునిచి యీకాపురము చక్కఁ బెట్టుమా. అని మఱియుఁ గొన్నిమాటలు తెల్పి పంపెను. అతఁడు సదాశివరాయని సంతోషపఱచి యట్లే యొనర్ప బద్ధకంకణునివలె నటించి బయలువెడలెను.

శ్యామరావు సహజసౌజన్యము గలవాఁడు. విశేషించి మోమోటమిగల సభ్యుఁడు. కాని పూర్వాచారప్రియుఁడు.

అట్టులని నవీనసదాచారవిముఖుడు కాఁడు. ప్రాచీనాచారము లలో వర్జింపఁదగినవియుఁ గలవని, నవీనాచారములలో గ్రాహ్యములు కొన్నికలవని యాతనిమతము. ఏది యెట్లున్నను వేద శాస్త్రములయందుఁ బురాణములయందు మిక్కిలి విశ్వాసము గల సాధుమనీషుఁ డనుట యతిశయోక్తి కాదు. ఆత్రేయుని మృత్యుంజయుఁడు పెండ్లియాడుట కాతఁ డిష్టపడని వాఁడు. వివాహవయస్సు కలకన్యలు పెక్కుండ్రుండఁగా నీవిధవనేల పెండ్లియాడవలయునని యాతనిభావము. విధవావివాహము లాతనికి సమ్మతములేకాని యిష్టిపా రొకతెగగానుండఁ దగుననియు వారును బ్రాహ్మణులే యనియు వారితోఁ దక్కినవారు వియ్యమందరాదనియు నాతెగవారే పరస్పరసంబంధము చేసికొనుట మేలనియు నాశ్యామరావుసిద్ధాంతము.వారి నాక్షేపించువారి నాతఁడు గారవించువాఁడు కాఁడు. అవకాశముదొరకినవారి నాక్షేపించువాఁడు. ఇట్టులున్నను సాధుప్రవృత్తికిదూరమునసుండునాత్రేయి మృత్యుంజయుని యంగనయగుట యించుకంతయు నాతనికి సమ్మతముకాదు. ఆసంబంధమునఁ దనమిత్రునిచరిత్రము మలినతఁ గాంచునని తలంచెను. ఎట్టులైన దానినాపి మంచికన్యకను బెండ్లియాడఁజేసి నలువురిలో మర్యాదగలవానినిగా సఖు నొనరించు కుతూహల మాతనికిం గలదు. దానికి భగవదిచ్ఛయుఁ దోడ్పడినఁగాని ఫలము కలుగదు కదా.

శ్యామరావు సదాశివరాయనికడ సెలవుపుచ్చుకొని పయనమై వెంటనే శిలానగరమునకు రాఁజాలక స్వీయకార్యములఁ జూచుకొనుచుఁ బదునెనిమిదిదినము లాయాయి

తాపులఁగనపెను. శ్యామరావు సదాశివరాయనితో మాట లాడుట లోనగువార్త లెట్లో పరివేషకుఁకర్ణరంధ్రములఁ జొచ్చెను. ఇఁక మేకపోతుగాంభీర్యము పనికిరాదని యాలోచించి సోదరి కావార్త లెఱింగించి యేదో యొకవ్యాజమున మాటలాడుమని హెచ్చరించి తాను నాప్రస్తావము రాఁగా నొకవిధముగా నంగీకారమును దెలుపనెంచెను. ఆత్రేయియుఁ దనగాంభీర్యమును వదలించుకొననెంచెను. ఆమఱుదినమునుండి మూఁడుదినము లామె యింటిలోనికి రాఁగూడని స్థితియందుండినను దానింబాటింపక యొక్క దినముమాత్రమాయాచారమును బాటించి మఱుదినమున స్నానము చేసి సాయంకాలమున కించుకముందు నూతికడ కరిగెను. అంతకు ముందే గృహరాజుఁ డామూపసమీపమున నస్త్రశాలనమునకై పోయినట్లు నటించుచుండెను. ఆత్రేయి నీరుతోడి యింటిలోనికేగుచు మాయన్నగారు తమయింట నున్న దెమ్మని చెప్పుడునని గారుమని మోమున సుస్మితమునాట్యమాడుచుండఁగాఁబోసాగెను. ఆయొక్కమాట యామె నోటినుండి వెడలఁగనే యతఁడుపొంగి బదులాడఁబోయి రాక యించుక ప్రయత్నించి నాకడకు రాలేదు. అంగిడి వీధికిఁ బోయి యుండునని కొనెదను. వచ్చినయెడఁ బంపెద ననెను. నడచుచున్నయాత్రేయి నిలువంబడి యాతనిం జూచుచునే నడిగి తిననిమాత్రము తెలుపకుఁడు.అని మఱిమాటలాడక లోనికరిగెను. ఇటఁ దానాయువతిని బల్కరించినను బ్రమాదము రాదని యాఁతడూహించి యించుక యందే కాలమువచ్చి యామె మరల రాదనిఁగొన్ని యింటిలోనికిం బోవుచుండ నీరుతోడు

చున్నట్లు వినవచ్చెను తిరిగిచూచునంతలో బరివేషకుఁ డాత్రేయియు నందుఁ గనఁబడిరి. అది మాటలాడ సుసమయమని భావించి పోయి మిత్రమా! నేఁ డుదయమునుండి కనఁబడవైతివి. ఏమియుఁ దోఁచలేదు సుమీ. అనఁగా నతఁడు కార్యాంతరమునం బోయియుంటిననియు నీయపరాధము సైఁపుమనియుఁ జెప్పి యీసౌభాగ్యవతియే నాసోదరి. తల్లిదండ్రులు విడిచిపోవ నన్నే తండ్రిగాఁజూచుకొనుచున్నది. దురదృష్టవంతురాలు. ముందీమెయదృష్ట మెట్లుండునో చూడవలయు ననెను. మృత్యుంజయుఁ డామె నంతకుమున్ను చూడనట్లు నటించి మఱచెను. దిక్కులేనివారికి భగవంతుఁడే దిక్కుగదా. రక్షకుని నెవ్వరినో చూపును. మనప్రయత్నమేమియు నక్కఱకు రాదు. అట్లని యూరకయుండరాదు. ప్రయత్నము చేయుచుండవలయును. పదిడబ్బులు సంపాదించుకొనువానిని బరికించి యీయవలయును. కాలము చాలవ్యత్యాసముగ మాఱుచున్నది పెక్కండ్రు దేశక్షోభకరములగు నుపన్యాసముల నిచ్చుచున్నారు. ప్రజలు గొఱ్ఱియలవంటివారు. మాటలకు బేలుపోవుచుందురు. ముందెట్లుండి యెట్లువచ్చునో తెలియఁ దరముగాదు. అని పలికి మఱియేమో చెప్పఁబోయి నిలిపెను. ఈమాటలు వినుచున్న యాత్రేయియుఁ దలవంచి ముసిముసినవ్వు చెలువారుచుండ స్వాభిప్రాయమును దెలిపెను. తరువాత నెవరిపనులకు వార లేగిరి.

శ్యామరావు శిలానగరమును జేరి మిత్రునితో మాటలాడఁదలంచుకొనియెనని ముందే చదివియుందురు. ఆదినము లాపనులకుఁ జాలకపోవుట మఱియుఁ బంద్రెండుదినములు

గడపవలసి వచ్చెను. అప్పటి కొకనెల దాఁటెను. త్వరపడు చునే తనపనులఁ జూచుకొని యింకను గొన్నియుండఁగాఁ బయనముచేసెను. నగరము చేరెను. ఆదినమునకు మూఁడు దినములకుముందే యాత్రేయికిని మృత్యుంజయునకు దాంపత్యము కుదిరియుండెను. వివాహము నవీనాచారము ననుసరించి యంగుళీయకపరివర్తనపద్ధతిని జరిగెను ఆసాయంకాలము మిత్రులకందఱకు విందు గుడుప రమ్మనులేఖలు వచ్చెను. అచ్చెరునంది కొంద ఱిదియేమి యాత్రేయి యెవ్వతె? ఎట్లు వివాహముసాగెను? మనకుఁ దెలుపకయుండ సాగవలసినంత యవసర మేమి? పురోహితుఁ డెవ్వఁడు? అని యనుమానింపుచు నపు డెచ్చటికో పోవుచున్న పురోహితుని రఘునాథ ద్వివేదినిఁగని మృత్యుంజయుని వివాహము చేయించిన దెవ్వరని ప్రశ్నింప నాతఁ డది విధవావివాహమగుట మాకుఁ బిలుపే రాలేదనియు నుంగరముల మార్పే యుద్వాహానికి విధియని తెలిసిన దనియుఁ దెలిపి తనదారిం బోయెను. ఆయఱుదినమున కావార్త యెల్లయెడల వ్యాపించెను. నలుగురు చేరిన తావులనెల్ల గుసగుసలు బయలువెడలెను. ఎందుఁ జూచిన నీవార్తలే చెప్పుకొనసాగిరి. కొందఱు మిత్రులు మృత్యుంజయు నింటికిం బోయి తమసంతోషమును దెలుపుటకుబదులు విచారమును దెలిపిరి. కాని యతఁ డమ్మాటల నాదరింపక వారి ననాదరభావమునఁ దూలించెను. ఇఁకఁ గార్యము లేదని వారు వెడలిపోయిరి. ఆత్రేయి భర్తయింటనుండి లజ్జయే లేక తిరుగుచుఁ దా నంతకుముం దరుగునిండ్లకుం బోవుచు వారు మోమోటమున నేమియు ననలేక సత్కరింపక యుండుట కేవ

గించుచు నుండెను. నగరవాసు లగువిప్రులెల్ల నాతని యిం
టికిఁ బోవరాదని పట్టుదలం బూనిరి. సభాముఖంబున నది
సిద్ధాంతిత మయ్యెను. నగరమెల్ల నావార్త వ్యాపించెను.
ఆమఱుదినము శ్యామరావు పురమును జేరి యావృత్తాంతము
నాలకించి నివ్వెఱఁ డయ్యెను. మ్రాన్పడియెను. చంచలాత్ముఁ
డయ్యెను. పరితపించెను. జాలినొందెను. ఇదేమి గ్రహచార
మని యూహించెను. మణి మసిగుడ్డలో నిమిడించిన ట్లయ్యెనే
యని దుఃఖించెను. కులక్రమాగతసదాచారము తూలనాడ
వలసినయంత యవసరమేమో యని యాలోచించెను. ఇఁకఁ
జేయఁదగిన దేదియు లేదుకదా యని నిస్పృహుం డయ్యెను.
నా కించుకయేని తెలుపక యీపనిచేయనేలా? మనోదౌర్బ
ల్యముండియే యుండవలెనని నిశ్చయించెను. మతాచార
ములయం దాతనితోడి చెలిమివదలుకొనుటయే కర్తవ్యమని
వితర్కించెను. సదాశివరాయనితోఁ జెప్పినమాటలలో నొక్క
దానినైన నిఁకఁ జేయఁజాలను గదా యని చింతించెను గత
జలసేతుబంధమన్న ట్లిఁక నాలోచించి లాభములేదని నిరాశఁ
జెందెను. అంతలో నలువురుబంధువు లరుదెంచి కుండఁ
బ్రద్దలుగొట్టినట్లు నాలుగుమాటలు శ్యామరావునకుం జెవి
పిరి. తమసిద్ధాంతము నెఱుకపఱచిరి. ఆతఁడు నామాటల కంగీ
కరించి నలువురతోఁ దానుండ నిశ్చయించుకొనెను.

ఇఁక నాత్రేయివిచిత్రచరిత్రము తెలిసికొనందగును. ఇం
చుకంతయు లజ్జలేక యాయన్ను లమిన్న స్వేచ్ఛగాఁ దిరుగుచు
నవ్వుచు నెల్లరతో మాటలాడుచుఁ బెద్దలంగన్నఁ దలవాల్చక
పరపురుషులం గన్న సిగ్గునొందక మగవారివలెనే మాట

లాడుచుఁ దిరింపసాగెను వైద్యవృత్తిగలవాఁడు కావున మృత్యుంజయునింగాంచ నెవ్వరే వచ్చినఁ బిలువనిపేరంటముగఁ దానే వారిం బల్కరించుచు నవ్వుచుఁ గూరుచుండుఁడనుచు నప్పుడే యప్పటిపతితో మాటలాడుచు వారినడుమఁ దానును గూరుచుండుచుఁ గరము వారికరములఁ బెనఁచుచు విచ్చలవిడిగా సంచరింపసాగెను. ఇంచుక మృత్యుంజయుఁడు మదినేవగింపూనెనుగాని యతిశయప్రీతి వరించిన యువతిగాన నేమన జాలక యుండెను. ఆమెయాప్రవర్తనము దినదినప్రవర్ధమాన మయ్యెను. పెద్దమనుష్యు లెవ్వరును మృత్యుంజయునింటికిఁబోవ నుంకింపరైరి. విధిలేక కొందఱు మందులకై మాత్రము పోవుచు నాకోలఁడిక్షణము లాగృహమున నెట్లో పుచ్చుచుఁ బోవుచుండిరి

ఈ వివాహవృత్తాంతమును సదాశివరాయఁడు విని యొకనాఁడు మధ్యాహ్న కాలమునందు మిడిమిడియెండలో గొడుగైనను బట్టుకొనక మోమునిండఁ జెమటబిందువులు గ్రమ్మఁ గొడుకుయింటికి వచ్చెను. అప్పుడే మందిచ్చుపనిమీఁదఁ బోయియున్న మృత్యుంజయుఁ డింటికి వచ్చెను. ఇరువురు నాయింటిముంగిట నేకలిసికొనిరి. తండ్రిని గాంచి నమస్కరించి యుచితమర్యాదలం దన్ని యింటిలోనికిం బోయి కూర్చుండఁ బెట్టి లోపలికిం బోయి యాత్రేయీ! నాతండ్రి వచ్చినాఁడు. విశేషించి మాటలాడి నాకుఁ దలవంపులు గావింపకుము. మర్యాదగా మాటలాడుమూ యని ప్రార్థించి పాదప్రక్షాళనమున కుదకముఁ దెచ్చియిచ్చి కుశలప్రశ్నము చేసెను. ఇరు

పుర క్షణము మాటలాడిరి. భోజనముచేసి బయలుదేరివచ్చి నారా యని కోడు కడుగ లేదని బదులువచ్చెను. భుజింతము రండు. అని యాయనం బిలుచుకొనిపోయి కూరుచుండెను.

వారియింట నొకవంటచేయు సుదతియుండెను. ఆమెయు వితంతువే. కాని యెట్లో వికేశి యాయెను. లక్ష్మీదేవి యని యామెం బిలుతురు. వయసున నిరువదాఱువత్సరములు చెల్లియుండెను. నల్లనిదేహచ్ఛాయ యున్నను గురూపవతి కాదు. అయిదుమూరలయెత్తున్నను దానికిఁదగినంత లావు లేనందున సంచరించుటకు బాధ లేకుండెను. సులువుగాఁ దిరుగ నలవాటుపడియుండెను. తల్లి చిన్నతనముననే పోయి నందునఁ దండ్రియే యామెం బెంచెను. గోముగాఁ బెరిగినం దునఁ గాఁబోలు నెవరితో నేమి మాటలాడవలయునో యామెకుఁ దెలియకుండెను. చిన్నతనమున నది యంతవిపరీత ముగాఁ దోఁపకయున్నను బెద్దఁ బెరిగినతర్వాత మఱింతవెగ టుగా నెల్లరకుం దోఁచుచుండెను. ఎవరి కెట్లుతోఁచిన నామె లెక్క పెట్ట సాహసింపక యుండెను. పెండ్లియైన మూఁడవసంవ త్సరముననే పతి యామెపొత్తునొల్లక వియద్గతి నెచ్చటికో పోయెను. ఆయనవలని చిక్కు కలుగునేమో యని చింతించు చున్న యాయువతి తన్మృతి వినఁగనే డెక్కలు జాడించెను. విచారముం బెట్టుకొనక యథాపూర్వముగా నామె తిరుగు చున్నందునఁ దండ్రి యించుక కుందుచుండెను గాని యామె మాత్ర మణుమాత్రము లజ్జింపక తండ్రిని విడనాడి వారి యింట వీరియింట నుండసాగెను. తండ్రిని జూచి యామె నేమియుననఁజాలక యెల్లవారు మనకేల మనకేల యని యూర

కుండిరి. అది తనకు మఱింతప్రోత్సాహము కలిగింపఁగా నామె యెందో నివసించుచుఁ దండ్రిని గన్నులనైనఁ జూడక యుండెను. తండ్రియుఁ గడుబీదవాఁడే యైనను మర్యాదగా సమయము పుచ్చుచు నొకగృహస్థునింట దేవపూజ చేయుచు నుండి యామనశ్చింత తన్ను మఱింత ముదుసలిని జేయ నను పంచకము వీడి యేలోకమునకో నివసింపఁబోయెను. ఆచిక్కు వదలఁగనే యాలక్ష్మీదేవి తన వేగునకుం గలయొకయర్థము సార్థకముకాఁగా సందడుఁ దిరిగితిరిగి తుదకానగరమున నొక్క పల్లపువీధియం దొక్కనియింటఁ గాపురముండఁ గుదిరెను. ఆయి ల్లామెకుఁ గాపురము సేయ ననువుగా నుండెను. ఆయిల్లు రెండుభాగములుగా విభజింపఁబడి యుండును. నడుమగల గోడ బల్లలకూర్పున నైనది. వలసినచో దానిందీసి యొక యిల్లుగాఁ జేయవచ్చును. లేనిచో రెండుభాగములుగా విభజింపవచ్చును. ఈరీతిగా నమరుపఁబడిన యాయింట నుండెను. ఆయింటియధికారి యొక్కఁడే. ఆపత్పరంపరలో మునిఁగి యందఱఁ బోఁగొట్టుకొన్నవాఁడు. ముదుసలికావున్న నదృష్టము క్షీణించెను. ఎవ్వరే నాఁడుతోడుంగూర్చినఁ జబ్బుపడినతఱి మంచినీరయిన దొరకునుగదా యని యాశించుచుండెను. లక్ష్మీదేవి యాయింట నొకభాగమునఁ జేరెను. ఆమెతో నెవ్వఁడుగాని నాలుగుమాటలు మాటలాడిన నిఁకఁ జాలునని పించును. అట్టిదయ్యా నున్నయింటఁ జాలకాలము నివసింపక తిరుగుచుండెడిది. ఆయిల్లు చేరినది మొద లేమనుకొనెనో కాని తనచాంచల్యమును వదలుకొని కొంతకాల ముండఁగలిగెను. ఆమెయే యాత్రేయికడఁ జేరి వంటచేయుచుఁ దనయింటనే

భుజించుచుండును. కొంద ఱందే భుజించి పరుండ నింటికిం బోవుచుండుననుదురు. ఆమె నేల యీవిషయమున నాక్షే పింపవలయునని పెద్దమనుష్యులు మానుకొనిరి. చిఱుతవా రామెనాక్షేపింప సాహసింపకయే యుండిరి. స్త్రీపురంధ్రులు మాత్ర మామెతెచ్చిననీరు పుచ్చుకొనుట మానిరి. ఆమెచేతి నీరే గంగోదక మనుకొనువారు పరమపావనముగాం ద్రాగు చుండిరి.

సదాశివరాయఁ డందే కొన్నిదినములుండి పుత్త్రస్నేహ మును గనఁబఱచుచుఁ దాఁజేసినపని రాఁబోవుబాలుర కుదా హరణము కాగలదనియుఁ దుష్టములగు కులభేదములు పాటింపరాదనియు, గుణమునుమాత్రమే, గ్రహింపఁదగు ననియుఁ దేనెపట్టునందు సారభూతమగు మధువును గ్రహించి పట్టును వదలునట్లు మంచిని గ్రహించి చెడుగును విడనాడ వలయుననియు, విశేషించి స్త్రీలవిషయమున నిట్లే ప్రవర్తింప వలయుననియు, "స్త్రీరత్నం దుష్కులాదపి" అని మనుస్మృతి చాటుచున్నదనియు నిట్టి వేవో పదిమాటలు గూర్చి యుపన్య సించుచు నుండెను. మృత్యుంజయరాయనికిఁ గొలఁదిదినములకే యాత్రేయివృత్తి స్పష్టమయ్యెను. కావున నికఁ జింతించి లాభము లేదనుకొని "వెనుకఁ జింతించుట వెఱ్ఱితన" మను సామెతను స్మరించుచు మనస్సున విచారముపడుచు నలువురిలో నాచింతను గనఁబఱుపక తలయెత్తుకొని యెట్లో తిరుగుచుండెను. కావునఁ దండ్రియందలి యాగ్రహమును వదలుకొనెను. తండ్రియుఁ బెద్దవాఁడయ్యెనని యాతనికుటుంబమును రక్షింతునని యొక నాఁడు తండ్రియడుగ వాగ్దానము చేసెను. సదా

శివరాయనిచింత కొంత తగ్గెను. ఆ మఱుదినమే పోయి రాజ చూడామణిబాయిని సంతానద్వయముతోడఁ బిలుచుకొని కొడుకుకడఁ జేరెను. ఆత్రేయియుఁ దనకు సహాయముగా నుందురన్న యూహాచే సంగీకరించెను. మృత్యుంజయుఁడు తనయింటికిఁ దూర్పుభాగముననున్న యొకయింట వారినునిచి యందు వంటచేసి తనయింటికి నిరువురకుఁ బంపునట్లు నియ మించి వారందే యుండునట్లు చేసెను. ఈయేర్పాటుప్రకా రము వివాదములు రాకయుండఁ బ్రవర్తింప వచ్చునని యాయన యూహయైనట్లు పాఠకు లూహింపవచ్చును గదా.

రాజచూడామణిబాయి మృత్యుంజయునింట జేరిన తర్వాత నెల్లరు నా కుటుంబము ననులోమజాతికుటుంబ ముగా భావించిరి. అత్త కోడలిని బ్రేమతోఁ జూచుచుం డెను. సంగీతము వాద్యసహితముగా నేర్పుచు నామెప్రీ తికిఁ బాత్రురాలయి వాస్తవముగా నత్తకోడండ్రు వరుసగనే యుండెను. సంసారము చక్కఁగా సాగుచుండుటే చాలునని మృత్యుంజయుఁడు తలంచి యదియే యొకయానంద మను కొనుచుండెను. అత్రేయిప్రవృత్తి మనస్సునకు సరిపడకయు న్నను దాఁ బొరపడి పెండ్లియాడినందులకు నొరుల దూషింప నవకాశము లేదనియుఁ దానే దానికి నుత్తరవాదిననియు మేలో కీడో యనుభవింపవలసినదే కాని విసుగుకొన్న లాభ ము లేదనియు నిట్టిపొరపాటు తానొందుటకుఁ బరివేషకుఁడే కారణమని దలంచుకొనుచు మృత్యుంజయుఁడు తనపనియందే బద్ధాదరుఁడై యుండెను. వివాహానంతరము ప్రాతమిత్రులు

తలచుచుగా నింటికిరాక యందందుఁ జూచిన మాటలాడుచు నతఁడు కుశలముగ నుండుటే చాలునని తలంచుచుండిరి. మృత్యుంజయుఁడును వారియందు గౌరవ మెప్పటియట్లే యునిచి ప్రవర్తించుచుండెను. క్రొత్తమిత్రు లింటికి వచ్చుచుం బోవుచుండిరి. వారు విశేషించి యాత్రేయి మాటలాడుచు గౌరవించుచుండ మృత్యుంజయునియందు గౌరవమును జూపుచు నుండువారు. వారిరాకకుఁ గాలనియమము లేకయుండెను. సదాశివరాయఁడును వారితోఁ జక్కఁగా మాటలాడుచు నుండెను. రాజచూడామణిబాయియుఁ గోడలిని గొడుకును వారిమిత్రుల నుచితరీతి సత్కరింపుచు నపు డపు డతిథులను సంగీతమున నానందింపఁ జేయుచుండెను

ఆనగరమున వ్యాపారముచేయుటే కులవృత్తిగాఁగల యొకకుటుంబము గలదు. ఆకుటుంబమునకుఁ జేరినవారే పలుతావుల నివసించిరి. ఆయూరనే కొందఱు వేలువేలు గృహంబుల నిర్మించుకొని వ్యాపారము చేయుచుండిరి. అందొక్కరుఁడు విద్యావంతుఁడు గుణవంతుఁ డనియు విఖ్యాతింగాంచెను. నూత్న యౌవనస్ఫురితుఁడు. ధనవంతుఁడు. మర్యాదగాఁ బ్రవర్తించువాఁడు. కాని కపటోక్తులకు బేలుపోవువాఁడు. అదియొకఁటే యాతనియందుఁ గలలోపము. తక్కంగలగుణములు పొగడఁదగినవే. ఆరోగ్యభాగ్య మించుక తక్కువగా నుండుటంబట్టి మృత్యుంజయుని హస్త మమృతహస్తమని కొంద ఱనుటంబట్టి మందు పుచ్చుకొనుచుండెను. కొంతకాలమున కతని కించుక జబ్బు తగ్గి యారోగ్యము కలుగున ట్లుండెను. రాకపోకలచే మైత్రియుఁ గుదిరెను.

నూతనాచారమున నాతనికుటుంబ ముండుటంబట్టి ఫలాహా రాదులం దంతయు కలిసియే యుండు నాచార ముండుటం బట్టియు నాతఁడు విశేషించి మిత్రుఁడయ్యెను మృత్యుం జయుఁడు నతనిపొత్తు మంచి దని తలంచుచుండెను. ఆతని నామ మనంతుఁడు. ఈమిత్రుఁడు కాక మఱియొకమిత్రుఁ డాయనంతునకుఁ గలడు. ఆతఁడు గౌడబ్రాహ్మణుఁడు. మత్స్య ములఁ దినుట వారిజాత్యాచారమే యైనను వారియింటివా రాయలవాటు మానిరి. పూర్వము వారు ప్రయాగక్షేత్ర మున నుండువారు అందు జీవనముసాగక యీనగరమునకు వచ్చి యెట్లో కుటుంబయాత్ర సాగించుచుండిరి. కొలఁదికాల మున కించుకధనము సమకూరెను. భూలాభము కలిగెను. మృత్యుంజయునియింటికిఁ బడమరదెస నొకకోసుదూరమున వారియిల్లు గలదు. అనంతునిసఖుఁ డాయింటివారిలోఁ బెద్దవాఁడు. మఱియిరువురుసోదరు లతనికిం గలరు. ముగ్గురు నన్యోన్యప్రీతి గలవారలే. పెద్దవానిపేరు కుమార స్వామిరాయఁడు. ఆతఁడే యనంతునకు మిత్రుఁడని మీరింతకు ముందే చదివియుందురు. కుమారస్వామిరాయఁడు మృత్యుం జయునకుఁ గ్రొత్తగా నైనమిత్రుఁడు. ఈముగ్గు రన్యోన్య ప్రీతిగలిగి యది దినదినాభివృద్ధి నొందఁగా నెడతెగక యొక్కచో నుండుట కలవాటుపడిరి. అనంత కుమారస్వామి రాయ లిద్దరు పాఠశాలలో నొక్కపర్యాయము చదివి యుండిరి. ఆమైత్రియు దృఢమైనదే. సుభద్రభర్త రంగ రాయఁడు. మృత్యుంజయునితోఁ బాలిపేర మొనరించిరనియు, నందు మూఁడువేలరూప్యములు మృత్యుంజయుఁడు గ్రహించి

వెనుకనుండి యిత్తునని కమ్మ వ్రాసియిచ్చెననియు, నత్యంత మిత్రుఁడు కాన నతఁ డందుల కంగీకరించి యూరకుండెననియు నాత్రేయి నతఁడు పెండ్లియాడినపిదప రంగరాయఁ డాకమ్మను జించివైచి వారియింటికి వచ్చుచుఁ బోవుచు మైత్రినే ప్రధానముగా భావించి ద్రవ్యమును దృణీకరించెననియు సుభద్ర లలితవలన నీవార్త నాలించి చింతించె ననియుఁ బాఠకు లింతకుఁ గొంతముందే చదివియున్నవారు. ఆ రంగరాయఁడే యీతఁడని స్మరింపవలయును. ఈముగ్గురును దఱచుగా నొక్కసారిగను, వేఱువేఱుగను గూడ మృత్యుంజయునింటికి వచ్చుచు నెడఁబాయఁజాలనంత మైత్రిఁ గనఁబఱచుచుండిరి. వారినెల్ల సదా శివరాయఁడు, నతని నూత్నపత్నియు నాత్రేయిచలెనే యనురాగమునఁ జూచుచుండిరి. ఈ కారణములం బట్టి మృత్యుంజయునికుటుంబమునకు నానగరమునఁ గొఱంత లేక నివసింపవలనుగలిగెను. వీరుతప్పఁ దక్కినవారెల్ల వారినడవడిని సమ్మతింపక తూలనాడుచుండిరి. క్రమక్రమముగా నాత్రేయి పలుకుబడిని సంపాదింపఁ గల్గెను. ఆమె వాక్చమత్కృతి మెండు. దానికిఁదోడు సంగీతము. దానినసుసరించి యందఱు నాదరించి వశ్యులఁగా నొనరించుకొనఁజాలశక్తియు ననునిది మనశ్శాంతిని గల్పింపఁజాలెను. తనకృత్యములన్నియు మంచి పనియే యామె తలంచుచుండును. ఈనూతనమిత్రులందఱు నామె వినుచుండఁగాఁ బొగడుచుండిరి. మృత్యుంజయుఁ డందులకుఁ దానానందించునట్లు నటించుచు లోలోనఁ గృశించుచుండెను. "అంతస్తాపము బహిశ్శీతము" అనునా మెత యసంగతతమగునా ? క్రొత్తమిత్రులుముగ్గురిలో రంగరాయఁడే ధనము

పోయినను లెక్కపెట్టక యానందించుధీరుఁడు. ఆసంబంధమే యన్నింటిలో గొప్పదైనను దానినివదలుకొని యించుకంతయు ఖేదపడకయుండువానికంటె ధీరుఁ డెవ్వఁడు కలఁడు ? అట్లుండు టకుం గలకారణమేదో, యద్దానినెఱుంగుటయే నేర్పజాలతనము. ఈమిత్రచతుష్టయ మొక్కటిగా నుండెను. కావున నితరు లెవ్వరు వీరియింటికి రాకపోయినను గొదువపడక యామృత్యుంజయరాయఁడు సదాశివరాయఁడు నెమ్మదిగ నుండిరి.



# ఎనిమిదవ తరంగము.

సుభద్రవిషయ మించుక విచారింతము. ఆమె దయార్ద్రహృదయ. సద్వృత్తియే యలంకారముగాఁ గలమానిని. పూర్వకర్మానుసారము రంగరాయఁ డామెకుఁ బతిగా దొరకెను. ఏమి చేయఁగలదు ? మానవతిగాన నెవరితోనైనఁ జెప్పకొనక లలిత యతిప్రియురాలు గాన నామె బలవంతముచేసి యడిగినందునఁ దనకష్టమును జెప్పకొనియె. ఆమెయు నొక యాలోచనము చెప్పెను. అది సమకూడెను. ఇంటికి వచ్చిన పిదప నేకాంతమునఁ గూరుచుండి విచారింపసాగెను. ఇది క్రూరమగుమందు. ఆఱునెలలు దాఁటినపిదప నేమిచేసినను మందు గుణము నడంపలేదని సుమిత్ర పలికెను. త్వరపడి పతికిఁ బెట్టిన నది తలకెక్కినపిదప నేమిచింతించిన నేమిలాభము ? భర్త వశ్యుఁడగుటకుమాఱుగా మృత్యువశుఁ డయ్యెనేని నాగతి యవ్వల యేమగును ?

శ్లో. "విశీలః కామవృత్తోవా గుణైర్వా పరివర్జితః,
ఉపచర్యః స్త్రియాసాధ్వ్యా సతతం దేవవత్పతిః. ౧౫౪
నాస్తి స్త్రీణాం పృథగ్యజ్ఞో న వ్రతం నాప్యుపోషణం,
పతిం శుశ్రూషతే యేన తేన స్వర్గే మహీయతే. ౧౫౫

అని మనుస్మృతి శాసించుచున్నదని నాతండ్రి చెప్పఁగా విన్నదానను.

శ్లో. "వాంఛాసజ్జనసంగమే పరగుణే ప్రీతిర్గురౌ నమ్రతా
విద్యాయాం వ్యసనం స్వయోషితిరతి ర్లోకాపవాదాద్భయం,
భక్తిశ్శూలిని శక్తిరాత్మదమనే సంసర్గముక్తిఃఖలే
యేష్వేతే నివసంతి నిర్మలగుణా స్తేభ్యో నరేభ్యో నమః."

అను భర్తృహరిశ్లోకమును నాతండ్రి నాకు నేర్పెను. లోకాపవాదమునకు భయంపడవలయునుగదా. మంచిచ్చి భర్తను వశపఱచుకొనఁ జూచినదని నలుపురెట్లో తెలిసికొనక పోరు. ఒకప్పుడు తెలిసికొనరనియే యూహించినను,

"అంతఃప్రచ్ఛన్నపాపానాం శాస్తా వైవస్వతో యమః."

అన్నసూక్తి తప్పదుకదా. భగవంతుఁడు సర్వసాక్షి చూచుచుండలేదా. కులకాంత కిట్టియకార్యములు మఱింత పాపజనకము లగును సుమిత్ర యట్లు తెలిపినను క్షణభంగురమగు నీసంసారమును నమ్మి శాశ్వతమగు పరలోకమును బోఁగొట్టుకొనుటకంటె నవివేకము కలదా. ఎంత పొరపడితిని? లలిత నాయందుఁ బ్రీతిగలదియే కాని లోకజ్ఞానములేని గోల. నా కుపకారము చేయుపాంటె నెఱింగించెను. సుమిత్ర

జాణ. ఆమె తన దేశమర్యాద ననుసరించి చెప్పెను. కర్నాటకదేశమున నిట్టి క్రూరతమాచారము లున్న వేమో! ఆడువారికే యందుఁ బెత్తనమేమో. మగవారు వారికి లోఁబడి యుందురేమో! ఎంతయు విచిత్రముగా నున్నది! సుమిత్రభర్త యామెకు లోఁబడియే యుండునని వింటిని గాని యీనగరము చేరి సంవత్సరము మించినదే. ఆయన కీమందు తలకెక్కలేదేలొకో! లేక నావంటివారి కిట్టి మందిచ్చి వారియింట వేటొకమందు నుపయోగింతురో యూహింపఁ దరముగాకున్నది. ఆమె యావిషయ మెఱుఁగించినప్పుడే యడుగనైతిని. ఇపుడడిగిన బాగుండ దనుకొనియె దను. ఆమెను జూడఁబోవఁగా మందిడితివా యన్న నేమను దాన. అసత్యమాడుదునా. అది మైత్రికి లక్షణము కాదుకదా. నిజమే పల్కితినా లలితమర్యాద పోవును. ఏమిచేయుటకును దోఁపకున్నది. ఐన పురల నొక్కమాఱు పోయి యడిగెదను. అని యాలోచించుచుండఁగా లలితవచ్చెను. తనయుదంత మంతయు నానఖికిం దెలిపి యామెయు సమ్మతింపఁగా నపుడే లలితయు వెంటరాఁగాఁ బయనమై సుమిత్రయిల్లు చేరెను.

సుమిత్రయు వారినాదరించి కూరుచుండఁజేసి కార్యము పండించితివా యని ప్రశ్నించెను. నిన్న నొక్కరాణమున నను కూలించినది కాదు. నేఁ డనుకూలించును. ఒక్కసందియము డెందమును బురికొల్ప వచ్చితిని. వేఱుగాఁ దలంపనని వాగ్దాన మొసంగినఁ దెల్పుదాన. అన విని యామె చేతులోఁ జేయి యునిచి ప్రమాణముచేయ సుభద్ర యిట్లు పలికెను. ఆఱుమా

సములు దాఁటిన మరల దానికిఁ బ్రతిక్రియ చేయ సాధ్యము కాదంటివి కదా. నాగతియేమి? నన్ను రక్షించువారు లేరు కదా. వినాయకుని జేయఁబోయినఁ గోఁతియాయె నన్నట్లగును గదా. ఈశంక నన్ను బాధించెడిని. ప్రాణాపాయము కలుగక యుండ నాకు లోఁబడియుండునట్లు చేయవలయును. అని దీన ముగా వేడుకొనియెను. సుమిత్రయు నించుకయుఁ గోపగింపక చెలీ! దీని కింతయేల చింతనొందెదవు. అప్పుడే అడుఁగుదు వనుకొంటిని. అడుగవైతివి. మరల నీవు వచ్చినప్పుడు చెప్పఁ దలంచియే యుంటిని. ఆమందు మూఁడుదినము లిచ్చినపిదప వమనమైనమీఁద మూఁడుదినములు నిదానించి యీయాకు దెచ్చి తూర్పుమోముగాఁ గూరుచుండి మూఁడు మిరియపు గింజలు నాల్గు జీలకఱ్ఱపోఁచలు వేసి మెత్తగా మర్దించి యావ స్తువుతోఁ గలిపి పెరుగులోఁ జేర్చి యిమ్ము. ఆమందు దుర్గుణము నశించి మేలుచేయును. ఆవల నీవు కూర్చుండుమన్నఁ గూరుచుండును. లెమ్మన్న లేచును. ఆరోగ్యమునకుఁ గొదువ లేదు. ఆ మందు లిచ్చిగదా మావారిని లోఁబఱచుకొంటిని. అని చెవిలో వానిపేరులం దెల్పెను. సుభద్రయు భక్తిమీఱ గ్రహించి యామెకు నమస్కరించి సెలవంది లలితం గూడి తనయిల్లు చేరెను. మఱుదినమే దైవవశమున రంగరాయ డింటికివచ్చెను. వారమునుండిరాక నాఁడువచ్చినందున సుభద్ర మహాప్రీతిని గనఁబఱచుచు నిసుమంతయు నసూయలేని యట్లు నటించుచు మాటలాడెను. తన కుచేష్టల నామె గుఱుతింపలేకపోయెఁగదా యని రంగరాయఁడు పరమసంతుష్టుఁడై లేనిప్రీతిని గనఁబఱచుచు సంసారతాపములు బాధించుచున్న

వనియు వానిం గొలఁగింప. దిరుగుచున్న వాఁడననియుఁ గొన్ని దినములలో నవన్నియుఁ దుదముట్టఁగలవనియుఁ దెలిపెను.

సుభద్ర తలయంటి వేఁడినీళ్లుపోసి తడియొత్తి యిం చుక యుపహారము నిడి త్వరపడి వంటచేసి భుజింపఁబెట్టెను. ఆపూఁట సుమిత్ర యనుగ్రహించినఘుటికలలో నొక్కదానిని జెప్పినప్రకారమే పెట్టెను. ఘుటికాకృతి మిగుల నల్పము గావున నాతఁ డెఱుంగకయే మ్రింగెను. ఆరాత్రి భుజించు నపు డొకఘుటిక నుపయోగించి సుభద్ర కృతకృత్యురా లయ్యెను. మఱునాఁటి యుదయముననే రంగరాయఁడు యథా పూర్వముగా నాత్రేయిగృహమున కరిగి మిత్ర గోష్ఠి నుండెను. కాని ప్రతిదినమింటికి వచ్చుచుండెను. సుమిత్ర చెప్పి నగుఱుతులన్నియు ననుభవమున సరిపడెను. సుభద్ర వానిం గాంచి యికఁ బతి తనమాటనుదాఁటకయుండ నుండఁగలఁడని నమ్మి సుమిత్రయే తనకు మహోపకారిణి యని స్మరించుచుఁ గృతజ్ఞురాలై యుండెను.

కొలఁదిదినముల కానగరమున నాత్రేయి యొక మహి ళాసభను నెలకొల్పఁ బూనెను. మృత్యుంజయుఁ డౌషధశాల తనయింటనున్న మనశ్చింత హెచ్చు పెరుగునన్న యూహతో నాసమీపమున ననఁగా నర్ధక్రోశదూరమున నొక్కయిల్లు నెల కింతయిత్తునన్న నియమముపైనఁ దీసికొని యందు నౌషధ ముల నునిచి వృత్తి సాగించుచుండెను. భుక్తివేళ కింటికి వచ్చి భుజించుచుఁ దరువాత నొకనిమేషమైన నుండక యాచోటికే పోవుచు నందే కొందఱుమిత్రులను గూర్చుకొని కాలము పుచ్చుచుండెను. కాని యెంతయోప్పుగలవాఁడైనను దాఁ

జేసినకార్యము మంచిదికాదని పరితపించుచునే యుండెను. రంగరాయప్రభృతులు మూవురు వారిలో నొక్కనిమిత్తుఁ డింక నొకఁడు మొత్తము నలువురు మృత్యుంజయు నింటనే తక్కవపక్షము రెండుజాము లుండుచు నామెకు రాజవిద్యను జెప్పుచు సంగీతము నామె పాడుచుండ నాలకించి యామెను విసుఁగులేక పొగడుచు నామె యానందించిన నదియే తమకు నానందమని యూహించుచునుండిరి. ఆమె యారంభింపఁబూనిన మహిళాసభను బెంపొందించినఁ బ్రఖ్యాతి గల్గుననియు, నగరమునందు స్త్రీలకుఁ గలమూఢత్వము తొలఁగుననియుఁ బెక్కండ్రు కొమ్మలు పతులనే దైవమని భావించి శ్రమపడుచున్నారనియు, స్వాతంత్ర్యము వారి కిసుమంత లేదనియు, సభలకు వచ్చునాచారమే వారికి లేదనియుఁ దుదకు నాటకములకు రాఁగూడదని పల్కుదురనియు నీమొదలగు నాశయములున్న స్త్రీలవలన దేశమునకు లాభము లేదనియు, నీమహిళాసభవలన వవన్నియుఁ దొలంగి సభలలోఁ బురుషుల తోఁగలసి మాటలాడఁగల నేర్పుగలుగుననియు మననగరము నాగరకత గలదగుననియు నాత్రేయికిం దెల్పుచు మఱింత ప్రోత్సహించిరి ఆసమాజమునఁ జేరుసభ్యురాం డ్రందఱు స్వాతంత్ర్యమును గోరువారుగ నుండవలయుననియు, నాటపాటల సంతోషముగాఁ గాలము గడుపవలయుననియు బతి చెప్పినదెల్ల వేదవాక్య మని ప్రతిభాషింపక యంగీకరించు నలవాటు వదలుకొని భర్త కెంతపఱకుఁ దోడ్పడవలయునని యాత్మ నిశ్చయించునో యంతమాత్రమే తోడ్పడుచుఁ దక్కినకార్యములయందు స్వేచ్ఛగలిగి యుండవలయు నను

నీమొదలగునియమములుండిన బాగుండునని పురికొల్పిరి. ఆత్రేయి యట్లే చేయనెంచితిననియు నాఁడువాండ్రను నాగరికతయం దాఱితేఱినవారినిగా నొనరింతుననియు రేయింబవళ్లు భర్తలు భార్యలను వేఁపుకొని తినుచున్నవారుగాన నట్టిబాధలకు లోనుగాక యుండఁజేయుటయే యుద్దేశమనియు నామె ప్రతినచేసెను. దేహదార్ఢ్యమును గలుగఁజేయు వ్యాయామక్రీడల నాసంఘభవనమున నెలకొల్పఁ బ్రయత్నింతుననియు దానికివలయు ధనము నేకరింపఁ బోవవలయుననియు, రసికులగుపూరుషు లీనగరమునఁ బెక్కండ్రు గలరని వినినదానననియు వారిని గలిసి తిరుగుచు సమయముఁ జూచి యీవిషయమును బ్రస్తావింతుననియు వా రిత్తురన్నవిశ్వాసము నాకుఁగలదనియుఁ దెలిపి తనపూన్కి స్థిరీకరించెను. ఆమె ప్రయత్నము సఫలము కావలయునని రంగరాయప్రభృతు లాశీర్వదించిరి. రంగరాయఁ డావఱకే మూఁడువేల రూప్యము లాకుటుంబమువారి కిచ్చి పోఁగొట్టుకొనినవాఁడు గావున మరల ద్రవ్యమీయఁ దలంపుగొన్నను ఋణమిచ్చువారు లేనందునఁ దనదాతృత్వమును వెల్లడింపక యూరకుండెను. తక్కుంగలమూవురిలో బేహారి కొంతధన మొసంగుదుననియె. మిగిలినయిరువు రొకరిమొగము లొకరు చూచుకొనుచు నూరకుండిరి. పురోహితుఁ డొకఁడు వీధినిబోవుచుండఁ బిలిపించి యాత్రేయి యొకసభ నారంభింప సుముహూర్త మాలోచించి చెప్పఁగలరా యని ప్రశ్నింప నష్టమీసోమవారము బాగున్నదనియె. అష్టమి పనికివచ్చునా యని రంగరాయఁ డడుగ నాపండితుఁడు "కుర్వీత బుధసోమ

యోః" అని యున్నదిగానఁ బనికివచ్చుననియె. అష్టమిమాట లేదేయని మరలఁ బ్రశ్నింపఁగా నతఁడు" కుర్వీత" అనఁగా జ్యోతిశ్శాస్త్రమునం దష్టమి యని సంకేతింపఁబడిన దనఁగా నిజమే కాబోలు నని యతఁ డంగీకరించెను. ఏవేళయందని యాత్రేయి ప్రశ్నింపఁగా ప్రదోషకాలమం దనియుత్తరము వచ్చెను. ఆకాలము మంచిదేన యని మఱియు రంగరా యఁడు ప్రశ్నించెను గోధూళిలగ్నము మహాపావన మని యాశౌచరత్నాకరము తెల్పుచున్నదని బదులు చెప్పి యతఁ డు పోవ నుంకింపఁగా నాఁడు చేయఁదగినతంత్ర మేమని యాత్రేయి యడిగెను నియమితస్థలమునకుం బోయి శుద్ధి పుణ్యాహవాచన మొనరించి పురోహితునిచే నా చోటున నీళ్లుచల్లించి యిష్ట దేవతాప్రార్థనము ముగించి పనికి నారంభిం పవచ్చునని పలికెను. తమరేవచ్చి యాపని చేయింతురా యని యడిగిన నాఁడొకరియింట వైకుంఠసంతర్పణ జరుగును భుజించి వారిని దేవతాదర్శనమునకుఁ బిలుచుకొనిపోయి శుభస్వీ కార మను గార్యము జరిపి వచ్చెదను. నేను వచ్చునప్పటికే తొమ్మిది కొబ్బెరకాయలు తిలలుదర్భలు బియ్యము తెప్పించి యుంచుఁడు. దర్భలు నేనే తెచ్చెదను. తక్కుంగలవానిని దెచ్చి యుంచుడు. తెల్లనివస్త్రము క్రొత్తదిగా నొకటి కావల యును క్రొత్తకుండయు నగ్నియుః గావలయు నని తెల్పెను. క్రొత్తకుండ యేలనయ్యా యని రంగరాయఁ డడుగ దానితో డనే కర్మ మారంభము కావలయుననఁగా నదెందులకో యని యతఁ డట్లే తెప్పింతుమనియెను. పురోహితునకు నాత్రేయి

తాంబూల మిచ్చి యొక్కరూప్యముకూడ నొసంగి పంపెను. ఆతఁ డందుల కానిందించుచుఁ బోయెను.

ఆమహాకార్యము చేయఁబూనితినని యాత్రేయి యెల్ల రకుం దెల్పెను. ముద్రితకరపత్త్రములు పంచిపెట్టఁబడియె. అష్టమీసోమవారము ప్రదోషకాలమున నని యందుండెను. దానిం గాంచి యందఱు నవ్వసాగిరి. ఎల్లరు దయచేసి వెనుకఁబడిన స్త్రీజాతి నుద్ధరింపుఁడు. అవియే మహాపురుషులకర్తవ్యమని యందుఁ గనఁబడుచుండెను. చక్కనివ్రాఁత యని యొకరొకరితోఁ జెప్పుకొనసాగిరి. మృత్యుంజయుని యనుమతి నామె కోరక తానే స్వతంత్రించెను. "మహిళాసభ" స్థాపించుట శేషించిన సదాచార మడుగంటుటకే యని కొందఱు దలంచిరి. కొంద ఱంపు మంచియుండునేమో చూతమని యూరకుండిరి. తత్త్వవేత్తల మనుకొను కొందఱుని మోగు లాకార్యమున లోకుల కెంతో మేలుగలదనియు మేము తోడ్పడుదుమనియు వాగ్దానము చేసిరి. ఒక్క పాడుదేవాలయమునకుఁ జేరువ నొక్కయిల్లు మాసభ్యులకిం బుచ్చుకొని యందా యష్టమీసోమవారము ప్రదోషకాలమున మహిళాసభాప్రారంభకార్య మొనరించిరి. పురోహితుఁడు చెప్పినట్లే కార్యమును ముగించుకొని వచ్చి పుణ్యాహవాచనముచేసి నీళ్లుచల్లి క్రొత్తకుండ నందే పగులఁగొట్టి యొక్కరూపాయయు, బదునాలుగణాలు పుచ్చుకొని పోయెను. ఆమహోత్సవమున కాహ్వానితులగు వారలలోఁ బెక్కండ్రు వచ్చిరి సకాలమునకు మృత్యుంజయుఁడు రాలేదు గాని యాత్రేయియు నామె సవ్యాపసవ్య భుజములనందగిన ముప్వురుమిత్రులు నరుదెంచిరి. వారే యెల్ల

కార్యముల కామెకుఁ జేదోడువాదోడుగా నుండిరి. కొందఱు వనితలును వచ్చిరి. పురుషులలో వయస్సు చెల్లినవారు మన కేల యని రారైరి. నూతనవయస్కులు కొందఱు నవీనాచార పరాయణులు వచ్చియుండిరి. ఆత్రేయి యెవరో వ్రాసియిచ్చిన వ్యాసము నిట్లు చదివెను. అగ్రాసనాధిపత్యమునువహించిన యొకయతివ పిదప మాటలాడుదు ననెను.

"సోదరీమణులారా! సమానోదర్యులారా! చిరకాలమున నాడెందమున నెలకొనియున్న యూహలను నేఁడుబయలు పఱుప నోచితిని. అట్టియవకాశము మీరు కల్పించితిరి. ఏతద్విషయమున మీకెల్లరకుం గృతజ్ఞురాలను. మహానుభావులెల్ల దయచేసి నాయీప్రయత్నమును సఫలముగా నొనర్చినందులకుఁ బరమానంద మనుభవించుచున్నదానను. ఇప్పటి నాభర్త యగు (నవ్వు) మృత్యుంజయుఁడు నాపూన్కి నంగీకరించెనని మీ రూహింపవచ్చును. ఎట్టి యిక్కట్లు వచ్చినను దీనిం గొనసాగింపవలయునని యే నా పూనిక. వలదనక నాపతియు నంగీకరించెను. ఈసందర్భమున నాకృతజ్ఞతం జూపుచున్నదానను. నేనంత విద్యావంతురాలను గాను నాలుగక్షరములు చదువుకొన్నదానఁ గాని పాండిత్యము సంపాదింపలేదు. అత్తవారియింటినుండి (పకపకనవ్వు) యీనగరము మరలఁ జేరినదిమొద లీమృత్యుంజయుఁడు నాహృదయరంగమున నాట్యమాడుచుండువాఁడు. నేను నాయనహృదయము నట్లే యుండుదాననఁట. పరస్పరము ప్రేమించియే దాంపత్యమల వరిచికొంటిమి. అంతకు నించుకపూఁదే నాస్వాతంత్ర్యమును గాపాడెదననియు, స్వేచ్ఛకు బదులాడననియు నా కొక్కకాల

మున వాగ్దాన మొనరించెను. ఆసమయమున నాచోట మేమిరువురమే యున్నను సర్వమునుజూచు పరమేశ్వరుఁ డున్నవాఁడుగదా యన్న నమ్మకము నేఁడును నాకున్నది ఇంతదనుక వాగ్దానము నెఱవేర్చుచునే నాపతి యున్నవాఁడు.

ఈనగరమున మహిళామణులు చాలదుస్థితియందున్నవారు. స్వేచ్ఛాప్రవర్తన మించుకంతయుఁ గానరాదు విద్యనేర్చుకొనుట కిసుమంతయు నవకాశము లేదు. విరామము లేనిపని వారికిం గలదు. నీళ్లబిందెలు మోసిమోసి యాయుర్దాయము నాజలములకు దారపోయుచున్నారు. భర్తలు పెట్టుబాధలు వచింప నలవిగానివి. సంవత్సరమున కొక్కపర్యాయముగూడ నాటకమునకుఁ బోవ నవకాశము గలుగదు. నాటకమును జూడరాదఁట. మహాపాపమఁట వృత్తి చెడునఁట. ఇంతకంటె నన్యాయము వేఱొకఁ డేప్రపంచముననైనఁ గలదా? ఇట్టివానిం బేర్కొనఁబూనినచో నొక మహాభారతమంత యగును. అట్టిజాలినొందఁ దగునదృష్టముగల యీనగర మహిళామణుల కష్టములఁ దొలఁగింపఁబూనియే యీసభ నారంభించితిని. ఇందు సభ్యురాండ్రు కాఁదగినవారు నెలకొక్క పావరూప్య మీయవలయు. భర్తలిచ్చిన మంచిదే. ఈయక యున్న నేపాటి బీయమ్మినను దొరకును. పతు లింతమాత్ర మేని వారికిఁ దోడ్పడుదురని నమ్ముచున్నదానను.

ఇఁక నీసభానియమములను "సభ్యురాండ్రకుఁ గలుగు లాభముల నించుక తెలిపెదను సాయంకాలము నాలుగు గంటల కింటఁ జేరవలయును. ముప్పదినిముసములు వార్తాపత్రికలఁ బఠింపవలయు. లేక పుస్తకములనైనఁ బఠింపవలయును.

నాలుగున్నరగంటలనుండి యొకగంట కందుక ఖేలనము, ఆవల నొకగంట గోష్ఠి. అప్పుడు లోకవార్తల నొకరికొకరు తెలుపుకొనుట లోనగువిషయములు సాగుచుండును. ఆవల నవకాశమున్న నుండవచ్చును. ఇంటికి వెళ్లినను వెళ్లవచ్చును. ప్రతిభానువార మొక్కవేడుక జరుగుచుండును. అందు నుపహారము లొసంగఁబడును ఆసమయమున జాతిమతములు పాటింపఁబడవు. ఎల్లరు సోదరీమణు లన్నభావము మఱచిపోరాదు. ఒక్కొక్కసభ్యురా లొక్కవార మందులకగువ్యయము నీవలయు. భర్త లిచ్చిన సంతోషమే. లేకున్న నొక్కయంగడిలో నప్పుతెచ్చి యవ్వాల న్యాయస్థానమూలమున రాఁబట్టుకొనఁబడును. విధిలేక తమ యవివేకమునకు లజ్జించుచు భర్త లిచ్చుకొందురు. సభ్యురాలుగాఁ జేరఁగోరు మహిళామణి ముద్రితమగుపత్త్రముపై నీ సభానియమములకు బద్ధురాలనై యుండుదాన. కందుక వినోదమునఁ బాల్గొనుదాన. జాతిమతముల బాటింపక యుపహారాదుల భుజింతును. అని వ్రాయవలయు. వత్సరాంతరమున సాంవత్సరికము జరుపఁబడును. దానికి ముందు దివసము మఱుదినము దానియంగములు సాగును. ఆ మూఁడుదినములు రేయింబవళ్లు సభాకార్యములయందే యాసక్తి గలిగియుండవలయునే కాని సంసారతాపమున మునింగియుండరాదు. పతు లేమన్నను లోఁబడరాదు. ఎంత ప్రీతి భర్తలయందుఁ జూపఁదగునో అంతయే చూపఁదగును గాని సర్వకాలసర్వావస్థలయందు నాతనినే కనిపెట్టి భగవంతునిగా భావింపరాదు. దాన స్వాతంత్ర్య మనునదెట్టిదో తెలియకపోవును. నాటకములను జూడవలయును. వేషధా

రణముంగూడఁ జేసికొని నైజశక్తిని గనఁబఱచిన మఱింత సంతసమే. ఇప్పటికిఁ దోఁచినవిషయము లివి. ముందుముందు వీనిలో మఱియుఁ గొన్నింటిని జేర్పవచ్చును" అని చదివి యుపన్యాసమును ముగించి తనయాసనమున యాసీనురా లయ్యెను. సభ్యులందఱు గుసగుసలు చేయసాగిరి. ఆత్రేయి యుపన్యాసధోరణి యామె ప్రవర్తనము నెల్లరకు నలవడఁజేయ నుంకించుచున్నదని గ్రహించిరి. ఇట్లే సాగినచో నిఁకభార్యలు భర్త కుపకరించుటకంటె నపకార మొనరించుటే యెక్కువగా సాగు ననియుఁ దలంచిరి.

అవ్వల నగ్రాసనాధిపత్యమునువహించిన మహిళార త్నము లేచి కంఠపాఠము చేసినపాఠము నప్పఁజెప్పెను. ఆమె యింత స్వాతంత్ర్యమును గోరక సాధారణముగ వనితలకు నుండినను బాధింపని స్వాతంత్ర్యమును గోరుచు మాటలా డెను. భాషామంజరి ముగియఁగా నూరకుండక మఱేమో మాటలాడఁబూనె గాని యొక యక్షరమైనను సాగకపోఁగాఁ గూరుచుండెను కరతాళములు నభోవివరము నిండునట్లు వాయింపఁబడియెను. తాంబూలము చందనము వెనుకముం దులుగా నీఁబడియెను. ఈసభ కిట్లే యుండవలయునని యొక్కఁ డుల్లసమాడెను. అగ్రాసనాధిపత్యమును గొనసాగించినందు లకు వందనాదికము లొనరింపఁబడియెను. ఎవ్వరెవ్వరి యిరవు లకు వారువార లేగిరి. ఆత్రేయి యవశిష్టకార్యము నవరించు చుండ మృత్యుంజయుఁడు ముందేవచ్చి తుధార్తుఁడై యింట వంటచేయమికిం దిట్టుచు నిట్టి యకార్యమును దా నొనరించి నందులకుఁ దన్నే విశేషించి తిట్టుకొనుచు నేదో యొకయుప

హారము నెచ్చటనుండియో తెప్పించుకొని భుజించి తనయాపు థాలయమునకుఁ బోయి యందే శయనించెను. మిత్రత్రయము సాయపడఁగాఁ గృత్యములందీర్చి యందే యొకచో నించుకతడ వుండి యలజడిం దీర్చుకొని తనయుపన్యాసము నెల్లరు మెచ్చు కొని రని రంగరాయఁడు పలుక నానందించుచు నిష్టాలాప ములఁ బ్రొద్దుపుచ్చి పదంపడి యింటికివచ్చి పతి యాగ్రహ మున వెడలిపోవుటయు నప్పటికి వంటకాకుండుటయుఁ దన సేవకురాలు చెప్పఁ జప్పరించుచుఁ జక్కఁగా భుజించి శయనిం చెను. తోడెవ్వఁడు లేఁడే యని రంగరాయఁడు మాత్ర మందే శయనించెను. అందఱు పోయినవెనుక వంటయింటికిం బోయి మిగిలియున్న యన్నముం దిని రంగరాయఁ డామెతో మాట లాడుచు నగరమాధ్య మిఁక వదలునని యాత్రేయి నుబ్బిం చుచు నిద్రపట్టఁగా నారాత్రి శేషము గడపెను.

---

## తొమ్మిదవ తరంగము.

రాజభక్తినిదొలఁగింపఁ బ్రయత్నించుసంఘము రాజసేవ కులకు జంకి తమయుద్ధతి మాని యూరకుండఁజాలక వేఱొక వ్యాజమున నాపనినే చేయఁబూని స్త్రీవిద్య వృద్ధిచేయవలయు ననియు, వారు విద్యావిహీనులుగా నున్నంతకాలము దేశము వృద్ధికి రాఁజాలదనియుఁ బ్రాచీనాచారము లవివేకమూలము లగుటయే గాక దేశాభివృద్ధినిరోధకము లనియు వాని నిర్మూ లింపక యూరకుండరాదనియు నిట్లు క్రమక్రమముగ దేశము వృద్ధికావలయు ననియు నాచారము లెప్పటికప్పుడు మాఱు చుండుననియు, వాని నరికట్ట బ్రయత్నింపరాదనియు, న ట్లది

కట్టఁ బాటుపడువారు దేశద్రోహులగుదురనియు నీమొదలగు నభిప్రాయములఁ దెలుపుచు నుపన్యసింపఁ బూనిరి. రాజభటుల బాధలు దీనికి నుండవని యీమార్గమున నడచుచున్నారనియు వీరెల్ల స్వకార్యధురంధరు లనియు నెల్లవారును గ్రహించిరి. ద్రవ్యము నెన్ని యోవిధముల సంగ్రహించుచు, స్వేచ్ఛగాసంఘ ద్రవ్యమును వ్యయించుచు, నియమములేక తినుచుఁ ద్రాగుచుఁ ద్రాగువారి నాక్షేపించుచు నోటికివచ్చినట్లు మాటలాడుచు, వేదముల దూషించుచు, శాస్త్రములను దిట్టుచు, స్మృతుల దూఱుచుఁ బురాణముల నీసడించుచుఁ, దదనుసారులఁ గేలి సేయుచుఁ బతివ్రతలఁ బదఱుచు, స్వేచ్ఛాప్రవర్తకుల భూషించుచుఁ విదుషీమణులై యూరూర నిర్భయముగాఁ దిరుగు యువతీమణులఁ గొనియాడుచు, జాతిమతవిసర్జకుల సన్మానించుచు నూతననాచారపరాయణుల నుత్కర్షించుచుఁ దిరుగుచు నుపన్యసించుచుఁ దద్వ్యాజ్యమున ధనము గడించుచుఁ దమ వారికిం బనుపుచు దేవాలయములు దేశాభివృద్ధి భంగకరము లని యొత్తిచెప్పుచు సీతాది పతివ్రతాశిరోమణుల నధీరస్వాంత లని హేతువాదములఁ జేయుచుఁ దిరుగుచుండిరి కొందఱవ్వారి గౌరవించుచు నుండిరి. మృత్యుంజయుఁడు సభలో శిరఃకంపము చేసినను దనహృదయమున వారిని వారివాదములఁ జేకొనక స్వయంకృతాపరాధమునఁ గల్గినదుష్ఫలము ననుభవించుచుండెను.

ఒకనాఁడు వేంకటాద్రిశర్మభార్య సుశీల కూరుచుండి యేదోపని చేసికొనుచు నిరుగుపొరుగిండ్ల బాలికలకు భాగవతమునందుఁ గల శ్లోకముల యర్థమును హిందీభాషలోఁ

పాటలుగా వ్రాసియుండ వానిని నేర్చుచు బాలికలారా! చూచితిరిగదా శ్రీ కృష్ణపత్నులయందుఁ గల సౌజన్యము. నారదముని రాగా వందలు వారిపాదములను గడిగి తడియొత్తి యా పాదోదకములను శిరస్సులఁ జల్లుకొనిరఁట. అంతటివారే యాకార్యము పరమపావనమని చేసినపుడు మన మేమి చేయవలయునో చెప్పుఁడు. అని యడుగ మనము పెద్దలు రాఁగా వారిపాదములు కడుగవలయును. సుశీల! మన మూలాగు చేసిన నేమిలాభము గల్గును? వార లాశీర్వదింతురు. దానిచే శుభములు కలుగును అని వారు బదులుచెప్ప మరల నామె బాలికలతో సత్యభామ యందఱికంటెఁ దా సందగత్తెయని విఱ్ఱవీఁగుచు గదా. భార్యలయం దెవ్వ రెవ రుత్తమురా లని మీ రూహింతురు? అన విని బాలికలు శ్రీకృష్ణమూర్తి యందఱకన్న రుక్మిణీదేవియే ప్రియభార్య యని గ్రహించెననియు సత్యభామ యందగత్తె కావున నామెనుగూడ దయతోఁ జూచుననియు మే మనుకొంటిమి. రుక్మిణి సీత యీ యిరువురిలో నెవ్వరు గొప్పయని మీ రూహింతురు? లక్ష్మీదేవి రామావతారమున సీతయని, కృష్ణావతారమున రుక్మిణి యని పేరులుగలదిగ నయ్యెనని మేము వింటిమి. ఇంక నెవరు గొప్పయనవచ్చును? ఇరువు రొక్కరేకదా. సుశీల యా మాటల కానందించి శ్రీకృష్ణుఁడు శివపూజచేయునని శివుఁడు కృష్ణుని బూజించునని చెప్పుదురు. రుక్మిణీదేవి వివాహకాలమున దేవాలయమునకుం బోయి పార్వతీపరమేశ్వరులను బూజించెనని భాగవతమునఁ గలదు. ఈదంపతులలో నెవ రుత్తములు? మీకుఁ దోఁచినమాట చెప్పుఁడు. రుక్మిణీవాసు

దేవులు పార్వతీపరమేశ్వరుల నారాధింతురు. పార్వతీ పర మేశ్వరులు లక్ష్మీనారాయణులఁ బూజింతురు. భగవంతుఁడు ప్రకృతియుఁ గార్యములకొఱకు వేలు వేలురూపముల ధరిం తురు పామరులకు నుపదేశించుకొఱకుఁ దమలో నొకరినొకరి పూజించుకొనుదురు. వారికేమి భేదము కలదు? మేము విన్న దింతయే. సుశీల యాపలుకులు సుధాధారలవలె శ్రుతిపుట ములఁ జొరఁబడఁగా నానందపరవశమై బాలికలారా! మంచివ్యాసమును గ్రహించితిరి. ఈమాటల నెప్పటికిని మఱువ రాదు సుఁడీ. ఇంకొక్కవిషయ మడిగెదను బదులిండు. భయం పడకుఁడు. మీకుఁ దెలియకున్న నేను జెప్పెదను. దక్షిణ దేశమున బాలాజి యనుక్షేత్రము కలదుకదా? ఈదేశవాసు లెందఱో యాత్రకుఁబోయి ధనరాశి నర్పించివత్తురు. సువా సినులటకుంబోయి తలవెండ్రుకలను స్వామికర్పించి వత్తురు. ఆయాచారము మంచిదియా కాదా? ఈయాచారము పూర్వ మున నారంభించినవారియూహ యేమని యుండవచ్చును? ముత్తైదువులకుఁ గురులేకదా భూషణములు. వాని నిచ్చిన నున్న యందముకూడ నశించును. అట్టులయ్యు వారిచ్చుచుండ భర్తలుకూడ నుందురు. కాని యాక్షేపింపరు. ఏల?

అమ్మా! మేమిరువురము బాలాజికిఁ బోయివచ్చితిమి. వేలకువేలు ముత్తైదువులు తలవెండ్రుకలను సంతోషముగా నిత్తురు. మేముకూడఁ జూచితిమి. మాకుఁ దోఁచిన దేమనఁగా భగవంతునకు మనకుండుపదార్థములలో మంచివస్తువు నర్పింప వలయుఁగదా. సువాసినులకు మిక్కిలిప్రియము లగుశిరోజ ముల భక్తితో నాదేవదేవున కర్పించిన నాబాలాజి మెచ్చుకొ

సును. దాన వీరికి శుభములు కలుగును. భగవంతున కర్పించిన పదార్థము స్థిరముగా నుండును. ఈయూహతోనే పెద్దలు దీని నాచారముగాఁ జేసియుందురు. ఇంతకంటె నెక్కుడు మాకుఁ దోఁపకున్నయది. ఇంకేదేని కారణమున్నఁ దెల్పుము. అన వారిఁ గౌఁగిలించుకొని నాముద్దుకూనలారా! చక్కనిభావమును దెలిపితిరి. ఈయభిప్రాయము సామాన్యముఁగా నెవ్వరికిం దోఁపదు. మీకాభగవంతుఁడే తోఁచునట్లు చేసెను. మీకా బాలాజియనుగ్రహమున నాయురారోగ్యసౌభాగ్యములు కలుగుఁగాక. మఱొకమాట యడుగుదును. విసుగులేక బదులుచెప్పుఁడు. నవరాత్రములు మనకు మిక్కిలి పండుగుదినములుకదా? ఆదినములలో బొమ్మలుపెట్టి మీవంటిబాలికలు పూజింతురు. ఏల? అన విని బాలికలమ్మా! పూర్వము రాక్షసులు చెలరేఁగి లోకుల బాధించుచుండిరఁట వారి నెవ్వరును గెలువఁజాలక పోయిరి. పార్వతి మూఁడవతారము లెత్తెనఁట. లక్ష్మి కాళి సరస్వతి. అని యీ మూఁడవతారముల వేసులఁట. వారినెల్ల వధించి లోకులకు సుఖముగల్గించెనఁట. ఆయుద్ధమునే యిపుడు బొమ్మలుగాఁబెట్టి యీ జగదంబపరాక్రమమును బాటలుగాఁ బాడుచు సువాసినులనెల్లం బిలిచి తాంబూలము లిచ్చి పంపుచుందురు. నవరాత్రములు మిక్కిలి శుభదాయకములు. కావున నాదినములలో నాయంబను బూజించిన మనకు మేలుకలుగునని యెల్లరు నట్లొనర్తురు. ఇదియే మాకుఁ దోఁచినయూహ. సుశీల యాయూహ కానందించి కుమారికామణులారా! అన నూయ సావిత్రి లోనగువా రెట్లు ప్రఖ్యాతినొందిరి? ఆప్రఖ్యాతి కల్గుటకుఁ గారణ మేమని మీరు గ్రహించితిరి? అనఁగా

నాబాలికలు తల్లీ! పతినే దైవముగా భావింపుచుఁ బతియాజ్ఞ మీఱక స్వప్నమునందును బరపురుషుని గోరికయుండుటచే వారికిఁ బ్రఖ్యాతి కల్గెను. పాతివ్రత్యమే యందులకుఁ గారణము అన విని యామె వారుచేసినఘనకార్య మేమేఁగలదా? మీరెఱింగినఁ దెలుపుఁ డనెను. వార లనసూయ సీతాదేవికి భర్తృహితకరము లగువరముల నొసంగెను. సావిత్రి మృతుఁ డగునాథుని యమునికరుణచేఁ బడసెను ఇంతకంటె గొప్పకార్యము లేవి యొనరింపవలయును? అనఁగా నాలకించి ప్రతిహితములగు నామాటల కలరి సుశీల వారిం జేరఁబిలిచి బాలికలారా! మీ రీయూహల వదలక ప్రవర్తిల్లిన లోకమునకు మహోపకారము చేసినవార లగుదురు. కలియుగమునఁగూడ మీవంటిబాలికలు కొందఱున్నఁ జాలును. ఎవ్వ రెన్నిమాటలుచెప్పిన నీయూహల వదలకుఁడని నొక్కిచెప్పెను.

ఇంతలో నొకయువతి యరుదెంచి సుశీలవద్దకి యమ్మా! యాత్రేయీదేవి మీకీపత్త్రమును జూపి యీసభలో నొక సభ్యురాలుగానుండ మీరు సమ్మతించిన మీపేరు వ్రాసిపంపుఁడని నన్నంపిరని పత్త్రము నొసంగెను. దాని నొకకన్యకయందుకొని చదివెను. సుశీల యంతకుమున్నే యాత్రేయివృత్తాంతము నెఱుంగును. కావున నమ్మా! నా భర్తయనుమతి నొందవలయును. వారిప్పు డింటలేరు. వారు వచ్చినపిదప వారికిం దెలిపి తరువాత మీకుఁ దెలిపెదనని యాదరమునఁ బలికెను. ఆయువతి సుశీలా! ఇది వెఱ్ఱియాచారము. భర్తయనుమతి నేల పొందవలయును? నీ వొకదాసీవా? ఇంతమాత్రము స్వాతంత్ర్యములేకున్న మనజన్మమేల? ఇఁక బ్రాఁతయాచారములఁ

గట్టిపెట్టి స్వాతంత్ర్యమును వహింపవలయు. లేకున్న స్త్రీజాతికి మర్యాదలేదు. భర్త యనుమతింపవలెండు. మాననిండు. మీకేల? మీయాత్మ యేలాగు నడచునో యట్లు చేయవలయును అంతి యకాని వెఱ్ఱియూహలం బెట్టుకొని ప్రాతపురాణములలో నున్న చచ్చుమాటలకు లోఁబడియుండరాదు. భర్త కెంత యధికారము కలదో భార్యకు నంతయధికారము కలదు ఆతఁడుం భార్యను శాసింప నర్హుఁడు కాఁడు. అట్టియధికారము నతనికి దేవుఁడు ప్రసాదించి యుండఁడు. దైవము సర్వసముఁడు. కావున మీరు రీతిగుణమున నా ప్రాఁతయలవాటులఁ బెట్టుకొని ప్రాఁకులాడక క్రొత్త యాచారముల నవలంబింపవలయును. స్వేచ్ఛగా సంచరింప నేర్చుకొనవలయును. ఆత్మకుఁ గలస్వాతంత్ర్యము నరికట్టరాదు. అది మహాపాపము. దేశాభివృద్ధికి భంగమును గల్గించునది. ప్రతిసాయంకాలము రెండుమూఁడుగంటలు హాయిగా నాటలతోఁ బాటలతో సల్లాపములతోఁ గాలము పుచ్చవచ్చును. అందే ఫలాహారములు చేయవచ్చును. పురుషులు వత్తురు. స్వేచ్ఛగా మాటలాడవచ్చును. మనస్సు మంచిదిగా నున్నం జాలును. అంతియగాని పరపురుషులతో మాటలాడరాదని వారివెంటఁ దిరుగరాదని చెప్పుట మిగులఁ బొరపాటు. దాంపత్యమనునది ప్రేమలతికాబద్ధము. ఆప్రీతి విడనాడినతఱి నీదాంపత్యము విడిపోవలసినదే కదా. ప్రీతిగలతావునఁ బెండ్లియాడవచ్చును. భర్త యనవసరమని తోఁచినపుడు మానవచ్చును. అంతియకాని విధిలేక యొకరికడ నుండరాదు ఇట్టి యద్భుతవిషయము లందుఁ జర్చింపఁబడుచుండును. జాతిమత

ములు పురోవృద్ధికి భంగకరములుగాన వానిం దొలఁగింపవల యుననువిషయము లపుడపుడు పెద్దలచే నుపన్యసింపఁబడును.

ఈనువాక్యము లందుండెను. ఆపత్త్రము పూర్తిగాఁ జదువఁబడఁగనే సుశీల పరమేశ్వరా యని చెవులుమూసికొని భరతఖండమా! ఎంతటియదృష్టము నీకుఁ గల్గనున్నది. అనసూయాది సాధ్వీమతల్లులు పుట్టినచోటుగదా యది యని గర్వించువారల కీధన్మములు శ్రుతిపుటభేదనపటుతరములు. ఎంతటి దుర్విదగ్ధురాం డ్రుదయించిరి మహర్షులయాజ్ఞ లిఁకఁ బనికిరావు. భర్త యనవసరమని తోఁచినపుడు మానవచ్చునఁట. ఔరా! ఎంత సులభమార్గమిది! ఇదంతయుఁ గాలమహిమము స్త్రీలతనూలత మహాపవిత్ర మనుమాట నీషత్తైనఁ దెలియదు కాఁబోలు. ఇస్సీ! ఇసీ! సీ! ఇదేటిసభ. ఏటి సభ్యురాండ్రు. ఆసభలో నేనుగూడ సభ్యురాలిని గావలయుననఁట. పుణ్యము పుచ్చివత్తే యైనది. ఈపెతో నా కేటిమాటలు? అనుకొని పత్త్రము మరల నెత్తి నావంటిపురంధ్రి యందుఁ జేరుట మీకు మంచిది కాదు. మీ నియమములు నాకు రుచింపవు ప్రాచీనమార్గములు మీకును రుచింపవు. పతులయాజ్ఞ భగవదాజ్ఞ యని నాభావము అది సామాన్యమని మీ సభానియమము. ఈరెండింటికి హస్తిమశకాంతరము గలదు. భూమ్యాకాశము లేకమగు టెట్లో యీ రెండును సరిపడు టట్టులే. కావున నేను సభ్యురాలను గాఁ జాలను. నాభర్తగా రింటలేరు. వారితో విన్నవించెదను. వారి యానతిమెయిఁ బ్రవర్తింతును. ఈవిషయమే మీదేవిగారికిం దెల్పునగు. ఇట్లు చెప్పితినని వేఱుగాఁ దలంపఁబోలదనియుఁ దెల్పుము. అని సుశీల పలుక విని యాదూతిక చప్పరించుచు

మోటుఁదనము వదలలేదని గొణుగుచుఁ బోయెను. బాలిక లమ్మా! యేమి యామె మాటలువిన నసహ్యములుగా నున్నవి. దురాచారములను వ్యాపింపఁజేయునూహచే నాసభ నెలకొలి పినట్లు పొడకట్టెడిని. లోకమున నెల్లరు కులటలు కావలయునని యుఁ దనవృత్తియే యందఱకుఁ బట్టుపడవలయునని నాత్రేయి యూహయైనట్లు కనుపట్టును ఈయాచరణమే యెల్లరకు మంచి దని తోఁచెనేని సీతాదిపతివ్రతలకు నీలోకమునఁ జేరేలేదు. రంభాదినిలింప భామినులకే ప్రశస్తి వాటిల్లెడిని. కలికాల మహత్త్వ మిట్టిదియేకాఁబోలు నని పలుక వారల నాశీర్వదించి మీరు పతివ్రతాతిలకములై నెగడుదురుగాక యని భగవం తునిఁ బ్రార్థించుచున్నానని పలికి వారి నిండ్లకుం బనిచి తన పనిలోఁ దానుండెను.

---

# పదియవ తరంగము.

రంగరాయనికి నానాఁటికిఁ దల తిరుగసాగెను. పొడి దగ్గు ఆఁకలి కాకయుండుట, అపుడపుడు వాంతియగుచుండుట మొదలగుదుర్గుణములు క్రమక్రమముగ హెచ్చసాగెను. ఆత్రేయి యపుడపుడు మృత్యుంజయునితో రంగరాయనికి మారకే మందిచ్చి యారోగ్యమును గల్గింపఁ దగుననియు, నయ్యది తనకెంతయో సంతోషమును గల్గించుననియు, మీ రింటలేనితఱి నతఁడు నాతోడ మాటలాడుచుఁ బ్రొద్దుపోవు నట్లు చేయుచుండుననియు, నతఁ డుపాధ్యాయవృత్తియం దున్నను దదితరకాలములయందు మనయింటనే యుండువాఁ డనియు, నంతియకాక మూఁడువేలరూప్యములు మన కిచ్చి

యుండియు మరల నాప్రస్తావమే చేయకయున్నవాఁ డనియు, నాపత్త్రమునకు గడువుదాఁటినను మనమాతనికిఁ గృతజ్ఞులమై యుండఁదగుననియు నే నట్లే శరీరకష్టమున కోర్చి యాతనికి సాయపడుచున్న దాననియు హెచ్చరింపసాగెను. లేనియు త్సాహ మున్నయట్లు నటించి తెచ్చుకోలునవ్వుతో నట్లే మం దిచ్చువాఁడననియు మందులకు మూల్యమిచ్చినఁ జాలుననియు నా శరీరకష్టమునకు బుద్ధిక్లేశమునకు నాతఁ డిచ్చినమూఁడు వేలు నెన్నఁడో చెల్లించుకొంటి ననియు నట్లయ్యును నీమాటను జెల్లింపఁ బరితపింతుననియుఁ దెలుపుచుఁ గాలముపుచ్చుచు నేదో యొకమందిచ్చుచుఁ బంపుచుండెను. అనంత కుమార స్వామిరావు లిద్దఱును జింత నభినయించుచు రంగరాయుని కూఁటటగల్గఁ బలుకుచు వాఁడు రాకుండుటయే తమకు మేలని లోలోపల దలంచుచుండెను. కుమారస్వామిరావున కొకపాఠ శాలలో నుద్యోగము దొరకెను. అఱువదిరూప్యములు వేతన ముగా నీఁబడుచుండెను కాని యాతనివృత్తినిబట్టి నగర మున మర్యాదలేకుండెను. దాని కావంతయు నతఁడు జంకక స్వేచ్ఛగాఁ దిరుగుచు సాయంప్రాతఃకాలముల నాత్రేయియింట గడుపుచు ననంతుఁడు మిత్త్రుఁడు గావున నాతనిసంగతి సం తోషదాయకమే యని సంతోషించుచుఁ దానాత్రేయికిఁ జదు వునేర్పుచు నుండెను. సంసారతాపత్త్రయములు సోదరులపై నునిచి కుమ్మరపుర్వుచందమునఁ దిరుగుచుండెను. సోదరులిరు వురు నన్నమాట దలపెట్టక బుద్ధిమంతులు గావున నింటికి వచ్చినవారల గారవించుచు ఋణబాధలఁ దప్పించుకొన నోపి నంత ప్రయత్నించుచుండిరి. కుమారస్వామిరావు తనవేతన

మును గొంచెమైనను సోదరుల కీయక తానే వ్యయించుచుం డిరుగుచుండెను. ఆతఁడు లోభియే కాని యెట్లో యాపేరెు మంతయు వ్యయమగుచుండెను. అనంతుఁడో వ్యాపారము నొకనికి భాగమిచ్చి సాగించుచు నించుక మర్యాదకలవానివలె నటించుచు నిటునటు తిరుగుచుండెను. రంగరాయఁడు లో పూర్వులు సేకరించిన ధనమంతయు నాటకములకుఁ గొంత, మిత్రుల కిచ్చుఫలాహారములకుఁ గొంతయు నటుకొంత యిటు కొంత యన్నట్లు వ్యయించి నిర్ధనుం డయ్యెను మీఁదు మిక్కిలి యారోగ్యము చెడుటయే గాక రోగ మొక్కటి తోడు వున నలముకొనఁగాఁ గృశించుచుండెను.

సుభద్ర తనఘుటికా ప్రభావమునను [illegible] నానం దించుచు దానిం ద్రిప్పుకొనునుపాయ మానెచ్చెలి [illegible] శింపఁ గలదని నమ్మి భర్తకు మహోపచారము లొనర్చుచు నుండెను. క్రమముగా రంగరాయఁడు బహిస్స్రాచారము [illegible] ష్టుఁడన్న యంతవఱకు వచ్చెను తిన్న యన్నము జీర్ణమగుటలేదు. అంతియగాక వాంతియగును. నిదురపట్టదు. నాలుగడుగులు నడచిన నాయాసము కల్గును. అంతియకాక జ్వరము వచ్చినట్లుం డును. ఎవ్వరితో మాటలాడుట కిచ్ఛయుండదు. ఇట్టివెన్నియో గలుగుచుండెను. నాలుగు నెల లాఘుటికా ప్రవేశానంతరము గడచెను. ఆనాటికిం గల్గినబాధలే పైఁజెప్పఁబడినవియని పాఠకమహాశయు లెఱుంగుదురుగాక. లలితయు సుభద్రయు నపుడపుడు కలిసికొనుచు మాటలాడుచు [illegible] స్మరించుచు రంగరాయఁ డిట్లగునని తలంచితిమే ఘుటికా ప్ర భావ మెంతగొప్పదో యని చెప్పుకొనుచు నుందురు. [illegible]

నొక్కపారి యాకర్ణాటకజనపద నారీమణికడ కరిగి పరిహారము డిగివచ్చి యాచికిత్స చేయఁదగునని యుఁ దలంచువారు. కాని లలిత యాతనివృత్తికెంతయు నేవగించుచుండునది కావున నాతనికింకను గర్వశాంతి కావలయుననియే తలంచుచు నింకను గొంతకాలముజరగఁగాఁ బరిహారమడుగుదము లెమ్మని సుభద్ర యత్నము సాగకయుండునట్లు చేయుచుండెను. మఱియొక నెల గడచెను. మాసపంచక మారీతిగాఁ గడచిన ట్లయ్యెను. రంగరాయఁడు శ్రమపడియైన నాత్రేయియింటికిం బోవుచుండు వాఁడయ్యె నింక శక్యముకాదని శకటమునెక్కిపోవసాగెను. అందు ననంతకుమారస్వామిరావు లుండుటం గన్నులారఁ గాంచుచు, వారు తన్నెంతో మర్యాదగాఁ జూచుచుండువార లయ్యె నపుడు సామాన్యదృష్టితోఁ జూచుజాడ తెలిసికొని వగచుచు నాత్రేయిప్రీతి తనవిషయమున వ్యాపింపక సన్నగిలు టకుం గారణ మెఱుంగనేరక పరితపించుచు నింక వచ్చినచో నున్నమర్యాదకూడ వీడునేమో యని యనుమానించుచు, మూఁడువేలరూప్యములపత్త్రమునకు గడువు గడచిపోయినది యెఱింగి కన్నములోఁ దేలుకుట్టినవానివలె లోలోననే దుఃఖిం చుచు నదియే యింతులకుం గారణమని నిశ్చయించుచు ద్రవ్య ములేకయున్న నిఁక లోకమున మర్యాద దక్కదని యూహిం చుచు నది తనకులభించునుపాయము కానరామికి దురపిల్లుచు గతజలసేతుబంధ మనున్యాయము మనస్సునకురాఁగా వెచ్చనూ ర్పుచు నుండెను. భార్య మున్ను తెల్పిననీతి యప్పటి కనుభవ మునకువచ్చెనని యరయుచు నామె నెక్కుడుగా గారవించుచు నుండెను ఐదునెలలు తనయనారోగ్యకాలమునఁ బూర్తియగు

నప్పటి కారంగరాయనిభార్య యలంకారవస్తువులలో సగము మాత్రమే మిగిలెను. రెండువేలరూప్యములఋణ మగపడు చుండెను. అంతియ విలువగలకేదారము లాతనికిం గలవు. కాని యవి యుంకువగా నాఋణ మిచ్చినవారల స్వాధీనమున నునుపఁబడియెను. కావున ధాన్యాగమము లేకుండెను. ఇంట దరిద్రదేవత తాండవమాడసాగెను. రంగరాయని కింక నెట్లు సంసారము సాగింపఁదగునన్న యూహాపుట్టి వృద్ధినొందసాగెను. ఉపాధ్యాయపదవినుండి యొకవత్సరము విశ్రాంతిపుచ్చుకొను టయు దాన వచ్చువేతన మించుకయే యగుటయుఁ గారణము లుగా మనశ్చింత యధికమగుట యొకవింత కాదు కదా!

స్వార్థపరులసంఘము క్రమక్రమముగా సార్థకనామమై స్త్రీవిద్యాభివృద్ధికై పాటుపడునట్లు నటించుచు దానిచేఁగాని దేశాభివృద్ధికాదని యుపన్యసించుచుఁ జాతుర్యమున మెలంగుచు ద్రవ్యమును సేకరించుచుఁ పాఠశాలల స్థాపించుచు, నుపాధ్యాయుల సంగ్రహించుచు వారలకుఁ బద్ధతుల నేర్పుచుఁ దమనిధినుండి వారికి వేతనముల నిత్తుమని యాశపెట్టుచు నూరూరఁదిరిగి సేకరించినద్రవ్యము నిష్టానుసారముగ వ్యయించుచు శేషించినదాని నొకసంఘముస్థాపించి వశము చేయుచు నింకను సంపాదించుచుఁ బ్రాచీనాచారములఁ దూలనాడుచు, నవీనాచారముల నెలకొల్పఁ బ్రయత్నించుచు. వానిమూలమున దేశము వృద్ధియగునని యుద్ఘోషించుచుఁ దమకాలము గడపుచుండిరి. కొందఱుకాంతలు తమకులాచారముల వీటిఁ బుచ్చి వేతనముకొఱకు వారలలోఁ దిరుగుచు, నుపాధ్యాయులగుచుఁ బతులఁ దృణీకరించుచు విచ్చలవిడిఁ దిరుగుచుండిరి.

వారి సదాచారములు పెక్కండ్రకు రుచింపవయ్యెను. ఉపాధ్యాయులందఱు నాత్రేయి స్థాపించినసంఘమున సభ్యులుగాఁ జేరవలయుననియు, గ్రామాంతరముల నున్నవారు సంవత్సరమునకు రెండుమాఱులు వచ్చినఁజాలుననియుఁ బైసంఘముచే నియమము చేయఁబడియెను. దాని ననుసరించిన కొంద ఱుపాధ్యాయులు తత్సంఘమునఁ జేరిరి. కొందఱదియేటి చిక్కని పదవిని వదలుకొనిరి. కృత్రిమసంఘముమాటలు క్రమక్రమముగా నీతిదూరములనుట తేటపడసాగెను. సజ్జనులెల్లవారి మాటలఁ దూలనాడుచుఁ బ్రచారము చేయసాగిరి. పల్లియలలో నున్నవారెల్లరు కపటములనియే నమ్మునట్లు ప్రచారకులుపన్యసించుచుండిరి. ఇరుదెగలవారును బట్టుదలతోఁ బని చేయసాగిరి. మధ్యస్థులు కొంద ఱీవాదముల బలాబలముల నరయుచు వినోదము చూచుచున్న ట్లుండిరి కొలఁదికాలమిట్లే వాదములు ప్రబలుచునే యుండెను. ప్రజలేపక్షమునఁ జేరవలయునా యని యాలోచించుచుండిరి అట్టివారు కపటాత్ముల దుర్వ్యాపారములను గాంచి యేవగించుచు సనాతనప్రాచీన సదాచారములే యనుష్ఠేయము లని గ్రహింపసాగిరి. కొలఁది దినములు కపటాత్ముల మాయావాగురావళిఁ జిక్కియుండియు వారలయలవాటులు సరిపడమిఁ గొందఱు చాలునిఁక స్వామీ యని మరలఁ బూర్వాచారములనే యనుసరింపసాగిరి. తమ భార్యల ప్రవృత్తి విపరీతముగా మాఱుచుండుటం గని యెట్లో శ్రమంపడి వారల నివ్వారింపఁగల్గిరి. కొలఁదిదినములకే యిట్టిచందమునఁ బ్రవర్తనము తాఱుమాఱయ్యెఁగదా యని

భీతిల్లవలసినంతయనర్థములు పొడకట్టెను. ప్రజలించుక కన్ను తెఱచి యిది యనర్థదాయక మని యాలోచింపసాగిరి.

ఆసమయమున శిలానగరమున నొక్కయజ్ఞము సాగునని వార్త యొకఁడు వెలుపడెను వైదికులందఱు పరుగులిడ సాగిరి. వేంకటాద్రిశర్మతప్పఁ దక్కుంగలవారెల్ల మహోత్సాహమునఁ బొందలుచుండిరి. ఆయజ్ఞము నలువదిదినములు పూర్వోత్తరాంగములతో సాగుననియు నొక్కొక్కదినము నాలుగువేల బ్రాహ్మణులయిన భుజింపవలయుననియు నానాగ్రామములనుండియు నగరములనుండియు వేద వేదాంగపారంగతు లఱుదెంతురనియు వారికెల్ల భూరిదక్షిణ లొసఁగఁబడు ననియు, నామహోత్సవము గన్నులపండువుగా సాగుననియు నందఱకుఁ దెలిసెను. ఇండ్లనుపూని వెల్లవేసి యలంకరింపసాగిరి. ఆ యాగవర్యమునఁ బెక్కుపశువులు విశ్వసింపఁబడునని తెలిసెను ఎల్లరు నాయాయిదినములలోఁ దప్పక యచటికిం బోయి యామహాకార్యమును జూడ వేడుకపడుచుండిరి. నలువదివేల రూప్యము లామఖమున వ్యయము కాఁగలదని యూహింపఁ బడియెను. పెక్కండ్రుధనవంతు లాపశువులఁ బట్టుదినములందే మాధనము వ్యయించి వచ్చినవారల కన్నము పెట్టుదు మని యంగీకరించిరి. పత్రికలు పంచిపెట్టఁబడియెను. ఒక్కొక్కదినమున నొక్కొక్కరుగ వ్యయము భరింప నంగీకరించిరి. యాగశాల నగరబహిర్భాగమున నొక మామిడివనములో నిర్మింపఁ బడియెను. అధ్వరుఁడు దగ్గరనుండియే దానినిర్మాణమునఁ జోడ్పడియెను. తాటియాకులతో నది కప్పఁబడియెను. విశాలము లగుద్వారములు నాలుగు నిర్మింపఁబడియె. ఇరువదైదు

వేలమానవులు సుఖముగాఁ గూరుచుండఁ దగినంతపొడవు వెడల్పు దానికుండెను. దానిచుట్టును, లోపల నత్యున్నత సహకారతరువరములు గలవు. తూర్పు పడమరదెసల నించుక దవ్వునఁ దటాకములు గలవు. దక్షిణోత్తరదిక్కులందుఁ జెంతనే సరస్సులు గలవు. కావునఁ జల్లనిగాలి వీచుచుండును. ఆతఁటాకములలోఁ దూర్పుతటాకమునకు నుత్తరభాగమున నన్నసత్రమున కనువగుమండపము నిర్మింపఁబడియెను. సర్వ సంభారములు సమకూర్పఁబడియెను.

బహుపశువిశసనహేతుక మగునామఖరాజము సాగు ననువిషయము దెలిసినప్పటినుండియు వేంకటాద్రిశర్మ విచార సాగరనిమగ్నచిత్తుం డయ్యెను. కలికాలమున నిట్టి యజ్ఞములు సాగరాదనియు స్మృతులపరివర్తనముల నెఱుంగకయుండుట మంచిది కాదనియు సతనితలంపు ఆయూహ బయలుపడిన తోడనే పండితులు వారియింటికిం బోయి ప్రసంగించి మీరిట్లు నుట న్యాయవిరుద్ధమనియుఁ దక్కుంగలవారు మీమాటలనే యనుసరింతురనియు దానిచే యాగమునకే హాని సంభవించు ననియుఁ బెద్దలమార్గమునే యనుసరించుట మేలుగాని మన పాండిత్యమునుజూపుట తగినపని కాదనియుఁ సర్వజ్ఞులగు పెద్దలే యీవిషయము నాలోచింపక యూరకుండరనియుఁ దమభావము నెఱింగించిరి. కాని శర్మ యందుల కంగీకరింపక సనాతనులవాక్కులనే యనుసరించుచున్నాఁడననియు ద్వాప రాదియుగధర్మములను దెల్పినస్మృతులే కలియుగధర్మములను దెలుపుచున్నవనియు వానింబాటింప నర్హమనియుఁ బశువిశస మిక్కాలమున నశాస్త్రసమ్మతమనియు ఫలమూలప్రాచీనధాన్య

ములచే నొనరుచు టుచితంబనియు నది- సఫలమే యగున నియు వేంకటాద్రిశర్మ సమాధానము చెప్పెను. కొంద అందుల కంగీకరించి వాడుకను మీఱజాల మనిరి. శర్మగారిసమాధా నము నిరసింపఁ దమ కిష్టములేదనియు గట్టిగాఁ జెప్పిరి. నగరవాసులలోఁ బెక్కండ్రచే వేంకటాద్రిశర్మ వాక్యములు వేదతుల్యములనియే భావింపఁబడుచుండును. కావున నాయజ్ఞ ముచూడఁ బోవరాదనియుఁ దలంచిరి. క్రమక్రమముగా నెల్లరయుల్లముల నాసిద్ధాంతము నాటుకొనియెను. ఒక్క నాఁడు సభచేసి మహాజనులెల్ల రందు సమావేశముచేసి వేంక టాద్రిశర్మను బ్రార్థించి యుపన్యసింప వేఁడిరి. సహజవాక్కుల నుపన్యసించి నాయంతరాత్మకు దోఁచినభావ మిదియని ముగిం చెను. తెచ్చికోలు వాగ్వైఖరులు లేక యాయుపన్యాసము నిస్తరంగసముద్రమువలె నుండఁగా నెల్లరు నానందించి యాయజ్ఞము ఫలమూలాదికములచేఁ చేయఁబడిననే తప్పఁ జూడఁ బోవరాదని తీర్మానింపఁబడెను. ద్రవ్యదాతలుకూడ నామార్గమునే యనుసరింపఁ బూనిరి. ఎట్టకేలకు బుత్విక్కు లామార్గమునేయంగీకరించిరి. ఆమహాక్రతు వహింసారూపమున నిర్వర్తింపఁబడియెను. ఆసమయమున వేంకటాద్రిశర్మ శక్తి వెల్లడియయ్యెను. పాండిత్యమున కేమిగాని సద్వృత్తికి స్థానమను ప్రశస్తి కల్గెను. దానిచే నగరవాసులుమాత్రమే కాక జనపద వాసులెల్లరు నాతని ప్రశస్తి విని యాతనింగాంచి విన్నయంత కంటె నెక్కుడుయోగ్యత గలవాఁడని కొనియాడిరి. యాగా నంతరము వేంకటాద్రిశర్మను సమ్మానింపఁ దీర్మానింపఁబడి యుచితరీతి సన్మానము సాగెను. నగరమున నుత్సవము చేయిం

చిరి. కులాచారము లతనివలన నెఱుంగఁ దగునట్లు సిద్ధాంతిత
మయ్యెను

ఆత్రేయీ స్థాపితసభవారి కాయుదంతము దుర్వారపరి
తాపము నీయఁజాలెను. తమపన్నాగములుసాగవనియుఁ బూర్వ
సదాచారముల నున్మూలింప వలనుపడదనియు వా రూహించిరి.
స్వార్థపరులసంఘముకూడ వారికిఁ దోడ్పాటునే చూపెను.
ఆచారము లెట్లున్నను ద్రవ్యము సేకరింప వలనుపడదనియే
స్వార్థపరులచింత యనవలయును. ఒక్కనాఁ డీ యిరుతెగల
వారును గుమికూడిరి. నగరవాసులభావములు తాఱుమాఱగు
టకు మిగులఁ జింతిల్లిరి. ఈ భావము నడంచి మననూతనాచా
రముల నెలకొల్పుప్రయత్నము పట్టుదలతో సాగింపవలయు
నని నిశ్చయించిరి. ప్రాఁతయాచారములను సమూలములుగా
నశింపఁజేసినఁగాని నూతనాచారాంకురముల మనుజుల మనః
క్షేత్రములయందు మొలిపింప వలనుపడదని వా రూహిం
చిరి. ప్రతిపల్లియకుం బోయి ప్రాతపద్ధతులందుఁ గలచెడుగులను
దెలిపి నూతనాచారములం గలసుఖములను బోధించి మనమత
మును బెంపొందింపఁ గలప్రచారకులు కావలయును. వారికి
నెలయొకటికి వేతనము ముప్పదిరూప్యము లుండవలయును.
ఈద్రవ్యమును వ్యయించుట కొకసంఘ ముండవలయును.
ఆసంఘమునకు వలయునంతధనము నొసంగుటకును, వారు
చేయువ్యయము చక్కనిమార్గమున నున్నదా లేదా యని
పరికించుటకును, ద్రవ్యమును గ్రామములనుండి సేకరించి చేర్చు
టకు వేఱొకసంఘ ముండవలయును ఇందు రెండవసంఘము
వారి కున్నతసంఘసభ్యులని పేరు. మొదటిసంఘము వారికి

సామాన్యసభ్యులని పేరు. ఈరీతిగా నియమముచేసికొని పని సాగించినఁగాని మనయూహలు ఫలింపవు ఈకార్యమునంతయుఁ నడుపువానికి నధ్యక్షుఁడని పేరు. వీరు సంచారము చేయఁ బూనినచో వారి కగువ్యయమునకు నెలకు వందరూప్యములు. ఒక్క లేఖకుఁడు, ఇరువురు సేవకులు నుండవలయును. లేఖకునకు నలుబదిరూప్యములు సేవకునకుఁ బదిరూప్యములును జీత మీయవలయును. అని యింకను బెక్కునియమముల నేర్పఱచి యారీతిగాఁ బనినిసాగించుచుఁ దమ కాలమును బుచ్చఁదలంచుకొని దమతమయిరువుల కరిగిరి. ఆత్రేయుఁడు నిందలు తనకు మిత్రులు దొరకినందులకుఁ దనబుద్ధిచమత్కారమే కారణమనుకొని పరమానందభరితుఁ డగుచుఁ దనమనోరథముల నీడేర్చుకొనుచున్నను దనకుఁ గలఖ్యాతియే యద్దానిని గప్పిపుచ్చుచుండు నని యనుకొని తనగృహమునకుఁ బోయి నిర్విచారముగా నుండెను

---

# పదునొకండవ తరంగము.

సుభద్ర మృదుతమచిత్త పతిభక్తిగల యింతిమిన్న. కాని రంగరాయఁడు దుష్ప్రవర్తకుఁడై దుర్వ్యయముచేసి సంసారమును బాడుచేయుచున్నాఁ డన్న కారణమున నతని లోఁ బఱచుకొని యాయవగుణమును మాన్పఁ దలంచుకొనియెనే కాని పతికపకారము గోరినదికాదు. ఆతఁ డింకను జెడిపోవునన్న తొందఱవలన లలితమాటల ననుసరించి యౌషధమును బ్రయోగించెను గాని యద్దానివలనఁ బతి కపకృతి కలుగునేమో యని పరిపరివిధములఁ బరితపించుచునే యుండెను. దానికిఁ

దోడుగా రంగరాయునికిఁ దలతిరుగుట, అన్నహితము లేకుం డుట మొదలగుబాధ లంకురించి యవి పెచ్చుపెరిగి లేవఁజాల కుండఁజేయుట, దాన నతఁ డుపాధ్యాయవృత్తినుండి కొన్ని నెలలు విశ్రాంతిగొనుట మొదలగు కారణములచే మఱింత సంతాపము హెచ్చఁగా నామెయు నిద్రాహారములు మాను కొనవలసినంత దుస్థశకు వచ్చెను. తుదకు లలితను బిలిపించి ప్రియసఖీ! యేమో యనుకొని తెలివిమాలి ఘుటికాప్రయో గము చేసితిని. ఆమె తెలెపిటుల సకల చిహ్నములు కనఁబడి నవి. సంతోషపడితిని ఇంచుమించుగా రెండునెలలుగా నా పతికి దుస్తరబాధలు కలిగినవి. లేవఁజాలక యాత్రేయి యిం టికిఁబోవుటకూడ మానుకొనెను. సంతోషమేకదా యందు వేమో ఉద్యోగము చేయఁజాలక విశ్రాంతిపుచ్చుకొనెను. వేత నము తగ్గెను. ఇప్పుడు రమారమి పదునేనుదినములనుండి యన్నహితము లేదు. తినఁగఁజాలకున్నారు. నాకుఁ గడుపులో మంట పెట్టినట్లాయెఁ జుమీ. ఇఁక నాగతియేమి? వారుకూడఁ జాల దిగులుపడుచున్నారు. మనము మరల నామెకడ కరిగి దానిశక్తిని దగ్గించుఘుటిక తేవలెను జుమీ. ఆమె యీనగర మున నెన్నిదో నెలలుండ ననియెఁగదా. త్వరగాఁ బోవల యును. నీ కవకాశమున్నఁ బోయి యామెపాదములం బట్టు కొని యామందును దెచ్చియిమ్ము. నా కన్నము విషమువలె నున్నది. నిదురరాదు. వారు సంతోషముగానున్నఁ జాలునని యూరక యుండక తప్పుపని దీనిం జేసితిని. ఆయన మేముచూ డఁగా జీవించునట్లే తోఁచకున్నది లలితా ఇఁకేమందును. నే జీవింపవలయు నన్నయాశ నీకుండినయెడల రేపో మాపో

పోయి యామె నడిగి యామందును దెచ్చి యిమ్మా యని యతి కరుణముగా బతిమాలెను లలితయు నామెచింతను గని పెట్టి జాలినొంది త్వరగా నేను బోయి యాతని వేడుకొని ఘుటికను దెచ్చియిచ్చెదను వెత నొందకుము సుభద్ర నూఱడించి తనయింటి కరిగెను. సుభద్రయు మగని కుపచారములుచేయుచు భగవంతునిఁ బ్రార్థించుచుఁ జేసినపనికిఁ జింతించిన గతజల సేతుబంధ మగునని యూహించుచు లలిత మందు తీసికొని యెప్పుడువచ్చునా యని కాచియుండెను రంగరాయనికిఁ బూటకుఁబూటకు దగ్గు హెచ్చుచుండె ఆనాటికి రెండవ యింటికిఁ బోవుశక్తియు లేనందున సుభద్ర దిగులుపడియుండెను. విశేషించి తనతప్పును స్మరించుచుండె .

సదాశివరాయనిచరిత మించుకంత విచారింపఁదగినదియే. కుమారుఁడు ధనసహాయముచేయ నారంభించినందున నతనికంతగా నావిషయమున విచారము లేకుండెను. కాని వయస్సు జాఱిపోవుటయు, దానిస్థానమున ముదిమి ప్రవేశించి స్థిరతఁగాంచుటయుఁ గారణముగా నించుక విచారము కలిగియే యుండెను. అంతియకాక చిన్ననాట సుయోగముచేసినవాఁడు తనుక దనయధికారమును బ్రదర్శించు నలవాటుపడియుండెను. ఆయలవాటుచొప్పున నాత్రేయిని దండించుచుండువాఁడు. నాలుగైదుసారు లామె యూరకుండెను కాని ముఖచిహ్నములనైన గుఱుతించి యూరకుండక నతని మోము చిట్లించుచు నచట నుండక యేదో యొకనెపమున నవ్వలికిం బోవుచునుండెను. ముదుసలితనమున బుద్ధిమందత్వం గాంచినందున నాతఁడాగుఱుతులను లెక్కింపక పలుసారులు రంగరాయప్రభృ

తులు భర్త యింటలేనియపుడు రానేల యని దండింపసాగెను. కోడలినేగాక రంగరాయని నొకమాఱు, ననంతు నొకమాఱు, కుమారస్వామిరాయని నొకమాఱుఁ గలిసికొని నాకొడుకులేని తఱి మీకు రాఁబనియేమని మందలించెను. వా రూరకుండక నీ కీయధిక ప్రసంగ మెవ్వరు నేర్పిరని గట్టిగా నాలుగు చీవాట్లు పెట్టిరి. నీవింత తిని యూరకుండవయ్యా యనిరి. ఆత్రేయి మామ దోడునీడవలె నుండును. కనుక నామెను మాటలాడింపక మేముండఁజాలమనిరి అంతియకాక మమ్ముల దండింపఁ బూనిన నీయింట నుండఁజాలమనిరి గతిలేకవచ్చి పడియుండక యధిక ప్రసంగముచేసెదవా! ఊరకపడియుండు మనిరి ఆమాటలకే సదాశివరాయని తలవేలు రాలి క్రిందఁబడెను. అంతియ కాక యామఱునాఁడే యేదో పనియున్నయట్లు కోడలు మామగారూ యని పిలిచెను. ఏదోపనియుండి పిలిచినదని యను కొని సదాశివరాయఁడు కొడుకు నింటికింబోయెను. ఆత్రేయి యిట్లు మందలించెను.

మామఁగారూ! మీకు ముదిమి ప్రాప్తించినది. మూలఁబడి యుండక యొకదానిం దెచ్చుకొంటిరి. అంతియచాలక ధనమంతయు దానికై వ్యయించితిరి. కొడుకున కొక్కకాసైన నీయక యంతయుఁ బోఁగొట్టితిరి. అంతచాలక మరల కుటుంబము పిల్లలు వెంటరాఁగా మాయింటికి వచ్చితిరి. కొడుకు తండ్రికి సాయపడు టుచితమని నేనూరకుంటిని. దానికిఫలముగా నన్నుఁ దప్పులఁబట్టుచున్నారే. మీకు లోకజ్ఞానము కలదా? యుక్తాయుక్తపరిజ్ఞానము కలదా? నేను బరవశననుకొంటిరేమో అది కల్ల. పురుషున కెంత స్వాతంత్ర్యము కలదో స్త్రీకి నంతియ

కలదు. భర్త నెంత ప్రేమింపవలయునో యంతియ ప్రేమింతును గాని ప్రతివిషయము వారినే యడిగి యడుగులకు మడుపు లొత్తుదానఁగాను. నేను జదువుకొనని మూర్ఖురాలనుగూడఁ గాను. స్వేచ్ఛగాఁ బ్రవర్తింతును. దాని కడ్డుపడు నేని భర్తను గూడ లెక్కింపను. ఆవిషయము తొలుత నొప్పించుకొనియే భార్యగానుండ నంగీకరించితిని. నన్నుఁ దగినంతమర్యాదగాఁ జూడకున్న నే నిట నుండను. మహిళా మందిరమునందే యుందును. నాకుఁ దోడుసూపువా రెందఱో కలరు. మీకొడుకు భాగ్యము నాశించి యేమన్నను బడుదానఁగాను. ఆయన యావిషయ మెఱుంగును నాజోలికి రాఁడు. కొలఁది నెలలనుండి పూర్వపద్ధతివదలి యొకరీతిగా నున్నజాడ కనిపించెడిని. సమయముఁ జూచి యడుగ వలయునని యున్నదాన. రంగరాయప్రభృతులు మూవురు నాకుఁ బలుకుతోడుగ నుందురు. కుమారస్వామిరాయఁడు నాకు రాజభాష గఱపును. నాకేమి కావలయునో యద్దానినెల్ల ననంతుఁడు తెచ్చియిచ్చును. రంగరాయఁడు నాయందుఁ గలవిశ్వాసమున నూరకయున్న వాఁడు గాని లేకున్న మూఁడువేలరూప్యములను బుచ్చుకొనక యుండువాఁ డనుకొంటిరా? ఆపత్త్రముననుఁ గలపరిమితి దాఁటినదాఁక నాతనిం బ్రీతితో నూఱడింపవలదా? ఆకార్యము నెఱవేఱెను. ఎన్నియో కార్యముల కెందఱనో వశ్యులఁజేసి కొనవలయును. ఆవిషయమే యెఱుంగక యే మీరాక్షేపింతురు. ఇఁక మీఁదనైన నూరకుండుఁడు. లేకున్న మీరిందుండఁజాలరు. పెద్దవారని యింతదూరము చెప్పితిని. అని నాలుగువిధముల దండించిపంపెను. సదాశివరాయఁడు మున్నెన్నఁడు నిట్టిచీవాట్లు

పెట్టించుకొన్నవాఁడు కాఁడు. ఆనాఁడు కోడలు గట్టిగా నాలుగు చీవాట్లుపెట్టి పంపఁగా నొక్కమాటయైనఁ బలుకక తన యింటికిఁబోయెను విషాదము భరింపరానిదికాఁగా వేఁడినిట్టూర్పులువుచ్చుచుఁ దనయవివేకమునకుఁ దానే సిగ్గుపడుచు నూరకుండెను

అంతియకాక యపుడపుడు తనభార్యనుజూడ నాయాయి తావులనుండి తద్బంధువులు వచ్చుచుండిరి. వారెల్ల నాలుగయిదుదినము లుండుట వారి పయనము కాఁగా విందు చేయుట మొదలగునాచారములమూలమున ధనవ్యయ మధికమగుచుండెను. అందుఁ గొంద ఱారాజమాడామణిని బిలుచుకొనిపోయి మరలఁ బంపుదుమని యడుగుచుండిరి. విధిలేక పంపవలసినట్లు తోఁచుచుండెను. పలుమాఱులు పంప నిపుడవసరముకాదని చెప్పుటయు మంచిదిగాఁ దోఁపకుండెను. ఒక్కసారి విధిలేక పంపెను. నాలుగుదినము లందుంచుకొని పిలుచుకొనివత్తునన్న బంధువు రెండునెల లుంచుకొని వార్తలఁ బంపఁగాఁ బంపఁగాఁ దుదకుఁ బంపెను. దానిచే నాతఁ డంతదగ్గరబంధువా యని పరిశీలింప నవసరము కలిగెను. ఆపరిశీలనమున నాతఁ డామెకుఁ గులబంధువుకాదనియు మనోబంధువనియుఁ దెల్లమాయెను. దాన మఱింత తొందఱలు కలుగసాగెను. ఆమెను దండించుటయు నామె తిరుగఁబడుటయు నంతియకాక యింక నిట్టిమాటలన్న నీపిల్లల నీకిచ్చి నేఁ బోయెదననియుఁ దెల్పఁగా విచారసాగరమున మునుంగుటయు సాగెను. ఇట్టి యిక్కట్టు లెన్నియో యలముకొనినందున నాసదాశివరాయని చిత్త మువ్యెలవలె నూఁగుచుండెను. పాపము! ఏమిచేయ

గలఁడు? ముదిమియు ధనాభావము కులశీలములు లేనిభార్యయు నొక్కపెట్టునఁ దన్నులయింప నాతఁడు కుదురుగా నెట్లుండఁగ లఁడు? తనదురవస్థను దలంచుకొని ముందు మృత్యుంజయుఁడు కూడ నిట్టి దురవస్థలపాలు గావలసినవాఁడే యని తోఁచు చుండెను. యుక్తాయుక్తముల నారయక యవివేకమున నీకుల టీను బెండ్లియాడి చెడితినిగదా అన్నయూహ చక్కఁగా మది వ్యాపింపసాగెను. ఎవ్వాఁడుగాని యిట్టినూతనస్త్రీలను వరింప రాదు. వరించిన నావలెనే శ్రమంపడక తప్పదు. అని తలపో యుచు వార్తాపత్రికలకు వ్రాయుచుండెను సమయము దొరకి నపుడెల్ల లజ్జమాని నావలె నెవ్వరును జెడిపోవరాదని చెప్పు చువచ్చెను. ఎల్లవారు నవ్వసాగిరి. ఎవరు నవ్వినను నాయవ స్థను నేఁజెప్పుకొనుట తప్పుగాదని పలుకుచుండెను.

ఇఁక నాత్రేయిప్రవృత్తి నెఱుంగుట ముఖ్యము. రంగ రాయఁడు వ్యాధిముదురుటయు రాఁజాలక మానుకొనియె నని పాఠకమహాశయులు చదివియుందురు. ఆస్థితియం దతఁడు వ్యయమధికమగుటయు వేతనమల్పమగుటయుఁ గారణములుగా మృత్యుంజయునకుఁ బత్రికామూలమునఁ దనకీవలసిన మూఁడు వేలరజతముద్రికలను బంపు టుచితమనియు నొక్కసారి యీాయ ననుకూలము చాలకున్న నాలుగుపర్యాయములుగా నీవచ్చుననియుఁ బ్రస్తుత మాఱువందలు కావలయును గాన ద్వరగాఁ బంపుమనియు వార్త నంపెను. ఆత్రేయికడకుం గూడ నీవార్తయే పంపఁబడియెను. మృత్యుంజయుఁడు బదులు వ్రాయక యూరకుండెను. ఆత్రేయి వంటచేయు నెమ్మె లాడిమూలమున నీవార్తను రంగరాయనికిం దెల్పుమని

పంపెను. పలుసారులు సంగీతము నాచేఁ బాడించితివి. సమయాసమయవిచారమును మాని నాతోడ మాటలాడితివి. ఔషధములు నాభర్తకుం దెలియకయుండ నెన్నియో నీకిచ్చితిని. దేహమును బరీక్షింపుమని యెన్నియోసారులు కోరియుందువు. నాభర్తయు నాయన యింటలేనితఱి నేనును బరీక్షించుచుంటిని. ఎన్నియోపర్యాయములు ఫలాహారములు పుచ్చుకొంటివి. వీని కన్నింటికిగా నీవిత్తము వ్యయపడినది. నీయారోగ్యార్థము దేశాంతరములనుండి తెప్పించినయౌషధములకు ముప్పదిరూప్యములు నీనుండి మాకుఁ జేరవలయును ఆవిత్తము నీకొఱకు నానాఁడు స్వార్జితద్రవ్యమునుండి నే నిచ్చితిని. అది సత్వరమే పంపవలయును. చాలదినములైనను దానికి వృద్ధి నడుగఁదలంచుకొనలేదు. ఇదియే యాత్రేయి పంపినవార్త. ఆవార్త వినఁబడఁగనే రంగరాయఁడు వెచ్చనూర్చి యేమిచేయ నవకాశము చాలక యుండుటెఱింగి యూరకుండెను. ఏవిధమునను సాయములేకుండుటం దెలిసికొని స్వయంకృతాపరాధమునకు వగచుచు నెట్లో కాలము పుచ్చుచుండెను సుభద్ర సాధ్వి గావునఁ బతికి సదా యుపచారములుచేయుచు లలిత మందెప్పుడు తెచ్చియిచ్చునో భర్తకెపు డారోగ్యము కలుగునో యని తత్తఱపడుచుండెను. అతని కట్టి సాదుస్వభావము గలభార్యయే లేకయున్న నెట్టి దుస్థితి వాటిల్లియుండునో!

"పతికి హితమాచరింపని పద్మగంధి,
చెంతను వసించె నేమి నశించె నేమి."

అన్నసూక్తి యథార్థమేకదా.

రంగరాయఁడు మంచముపట్టుట యొజింగిన యనంతకు మారస్వామిరాయ లిరువురు నాత్రేయి యనురాగమును గూర్చి సుంత యనుమానము నొందిరి. కాని యామె వినయాదులను గాంచి యథాపూర్వముగనే వర్తించుచుండిరి. వారి కించుకంతయే సంశయము కలుగకయుండ మెలఁకువ గలిగి యాత్రేయి రంగరాయనిపై లేనిపోని యపవాదములు కల్పించుచు వారియం దాతనికి నీసుగలదని తెలుపుచు సంశయ బీజము నశింపఁజేసెను.

"మొనసి యినుపకచ్చడాల్ గట్టుకొను మునిముచ్చులెల్లఁ,
దామరసనేత్ర లిండ్లబందాలుగారె?"

యను నల్లసానివారిసూక్తి యెంతయుఁ దగియుండునేకదా! మృత్యుంజయుఁ డాత్రేయినిగాని యనంతకుమారస్వామిరాయలనుగాని పల్లెత్తుమాటయు ననక తన జేసినపనికిఁ దానే యుత్తర వాది ననునూహ మది దిట్టపఱచుకొని కాలము పుచ్చుచుండెను. కాని యాధివ్యాధులలో మొదటివగునాధులు మనస్సునకు శాంతము చేకూరనీయవు. ఆగ్రానగరమునుండి రత్నాభరణముల నమ్మువర్తకుఁ డొకఁడు వచ్చెను. శిలానగరమునఁ గొలఁది దినము లుండెను. అనంతునకు నావార్త తెలియునుగాని యాత్రేయికిం దెలిపిన వానిని బిలుచుకొనిరమ్మనుననియుఁ గొన్ని యాభరణములుతీసికొని తననెత్తిన నాసొమ్మిమ్మనుభారముమోపు ననియు నూహించి యూరకుండెను. అధిదైవికములు తప్పవు గాన నామె కెట్లో యాతనివృత్తాంత మెఱుకపడెను. కుమారస్వామిరాయనితో వానిం బిలుచుకొనిరమ్మని తెలుప నాతఁడాపని నొనరించి తత్కృపకుఁ బాత్రుఁడయ్యెను. రెండుమూఁడు

పర్యాయము లాతఁడు వచ్చుచుఁ బోవుచుఁ దుదకు మృత్యుం జయునింటఁ దనవస్తువుల నునిచినఁ జోరబాధ లుండవనుకార ణమున సౌధఖండమున విడిదియేర్పఱచుకొనియెను. పదునాఱు దినములు కాఁగా నొకనాఁడు మృత్యుంజయుఁడు భోజనసమయ మున నాత్రేయి మాటలాడుచుండఁ దలవంచుకొనియే బదులు చెప్పుచుఁ దటాలున మోమెత్తి యామెం జూచెను. ఆమె మెడలోఁ దళతళలాడు నాభరణ మొక్కటి దృష్టిపాత్రమయ్యె ను. ఆయది తానొసంగినది కాకుండు టెఱింగి యించుకదృష్టి నిలిపినాఁడెను. అవిధమెఱింగి నవ్వుచునాత్రేయియీహారమును మీరుపనూఁడవలయునని యే ధరించితిని. వర్తకుఁ డొకఁడు తెచ్చి యీయూర నమ్ముచుండ నాకెవరో తెలుపఁ దెప్పించితిని. పదు నైదువందలుమాత్రమే దీనిమూల్యమఁట. దొంగలరాయిడి వలన నానర్తకుఁడు మీకొఱకుఁ బెక్కుసారులు వచ్చిపోవు చుండఁ దటాలున నొకనాఁడు నేఁజూచి యేమిపనికై వచ్చితి రని యడిగితిని. ఈయూర నావస్తువు లుంచుకొనుటకుఁ జాలభయముగా నున్నది. మీయింటనున్న నాభయముండదని విని వచ్చినాఁడను. పంతులుగారిదర్శనము కాలేదు. అనగా మీకేల యీవిషయమునఁ దొందఱనీవలయునని యట్లేయుండ వచ్చునని సౌధఖండమున గది చూపింప నాజ్ఞ చేసితిని. దాసి యతఁ కింగననబఱుప నాతఁడున్నాఁడఁట. నిన్న నేదాసివలన దీనిం దెప్పించితిని. ధరించినమీరు చూతురని, నాకిది లభించునని నమ్మి యున్నానని తేనెలొలుకఁ బలికెను. ముందే యనుమానించునా తఁడు వర్తకుఁ డింటనేయున్నాఁ డన్నవార్తయు నాభరణమును ధరించుటయు మఱింత దాని వృద్ధిచేయఁగాఁ గల్పితహాసమున

నామెకుఁ దనసద్భావము నగపఱచి మఱేదో ప్రస్తావము దెచ్చి మాటలాడుచు నేదో తొందఱపని యున్నట్లు నటించి వెడలి పోయి సేవకునిం బిలిచి మనయింటిలో నున్న వర్తకునివృత్తాంత మేమని యడిగెను. పదునాలుదినములనుండి యతఁ డున్నవాఁ డనియు రత్నహారము వసంతుఁడు కొనియిచ్చెననియుఁ గర్ణాభరణము లావర్తకుఁడే యీయఁగాఁ దాను జూచితిననియు, వానికి మూల్య మీయనక్కఱ లేదనియు, మీరు దయచూపు చున్న దే చాలునని యాతఁ డనుచుండ వింటిననియు నాతఁడు వివరపఱచెను. పదునైదువందలు తననుండి రాఁదీయఁ బ్రయత్నించినదికదా యాత్రేయి యని యూహించి తనయనుమతి నైనఁ గొనక క్రొత్తవాని నింట నునుచుకొన్న భార్యవలన నింక నేమియుఁ బ్రయోజనము తనకు నుండదని నిశ్చయించుకొని పరివేషకుని చమత్కారమునకు నబ్బురంపడుచు నిఁకఁ జేయందగుకార్య మేమని యూహింపసాగెను. నాలుగువిధములఁ బరికించినను రవంతయైనఁ దోఁపకుండెను. ప్రాచీనసన్మిత్రులు తన యింటికి రాకుండుటకుం గలకారణ మీవివాహరూపమగు స్త్రీయాసంగతకార్యమే ప్రధానమను సిద్ధాంతము తోఁచెను. దాన మఱంత విచారపుఁ గల్గెను. ఏవిషయముగాని బయలు పఱచినఁ దనకే యవమానమని యాలోచించి శ్యామరాయని కిం దెల్పి తదనుమతినొంది యెవ్వల నెట్లుండవలయునో నిశ్చయించుకొనఁదగునని తలంచి యంతట నూరకుండెను.

లలిత యొకనాఁడు సుమిత్రకడకుంబోయి సుభద్రవంతఁ దెలిపి చింతించెను. సుమిత్ర చింత నభినయించి యాతనిలక్షణముల నడిగి తెలిసికొని యాబాధ తనయౌషధమువలనఁ గలి

గినది కాదనియు, మఱెవ్వరో ఘుటికాప్రయోగము చేసియుం డిరనియు దానికిం దగునుపశాంతి తనకుఁ దెలియదనియుఁ జెప్పిపంపెను. లలితయు నామెమాటల నమ్మి యావార్త సుభద్రకుఁ దెలుప నామె మఱింతగాఁ జింతించి తానే పోయి సుమిత్రపాదములఁ బట్టుకొని యంగలార్చెను. లలితయుఁ దన కార్యమునకై పోయినందున సుభద్రతోఁగలిసి మాటలాడు నవకాశ మేర్పడెను. వారు ముగ్గురును మాటలాడుకొనిరి. లలితయుఁ దనమగని కాఘుటికలనే మూఁడునెలల క్రిందటఁ బెట్టినందున నాగుణములు రంగరాయనికిఁ దొలుతఁగలిగినట్లే కనఁబడినందున నవి యిపుడు రంగరాయనిగుణములవలె లేవని యెఱింగినదిగావున సుభద్రకు నచ్చఁజెప్పెను. సుమిత్ర సుభద్రా! నాయౌషధపరిణామము వేఱు మఱెవరో మందు పెట్టియుం దురు. అయిన నాలోచించెదను. నీ వీరేయి మగనికడం గూరు చుండి మెల్లఁగా నడుగుము. అతనియుత్తరము నాకుం దెల్పుము. ఆతనితనువున నీలక్షణము లున్నవేమో కనిపెట్టుము. వక్షమునఁ జిన్నిగుల్లలుండును. దురదయు నుండును. ముంజేతి యందు జర్మ మెత్తపడియుండును. దానియందును జిన్ని చిన్ని బొక్కులుండును. పాదతలములయందు దురదయు మంటయు నుండును. పెదవు లెండుచుండును. ముక్కురంధ్రములయందుఁ దడియుండదు. వీనిం బరికించిరమ్ము అని పనిచినం బోయి యారేయి భర్తకుం బాదసేవ చేయుచు నాథా! వ్యాధి కేనుం దును పనికిరాకున్నవి. ధనముపోయెను. అప్పిచ్చువారు లేరు కదా! నాభూషణములలో నేఁటికి మూఁడువంతులు నశించి నవి. తక్కినవియు మన మమ్మిన నాలుగైదునెలల తిండికుం

డును. మీవ్యాధిం బరికింప మిమ్ములను మోసపుచ్చవలయు నని యో వశపఱచుకొనంగోరి యో యెవరో మందు పెట్టియుం దురని యెల్లరు ననుచున్నవారు. లోకమున నెందఱో దుష్టా త్మకు లుందురు. ఎం దేసంశయమున్నం జెప్పినఁ దగుచికిత్స చేయింపఁ బ్రయత్నించెదను వ్యాధి యిప్పటికే ముదిరినది. ఇంకను ముదిరిన నశక్యమగునఁట. అని జోటజోటం గన్నీరు స్రవింపఁగా నంగలార్చెను. ఆసమయమున నాతనిచిత్తమునఁ బ్రాణభీతి యుదయించియున్నందున భార్య యను రాగమునకు సద్వృత్తికి మెచ్చుకొనుచు నిట్లనియెను.

సాధ్వీ! తెలిసియో తెలియకయో కొన్ని తప్పులు చేసి తిని. నీసద్వృత్తిని బరికింపక యలయించితిని. నీతో నోటికఱవు దీఱ మాటలాడకపోతిని. నిజము తెల్పెదను. మృత్యుం జయుఁడు నేను పాలిభేరము సాగించితిమి. దాన నాభాగము మూఁడు వేలరూప్యములు ముందు పెట్టితిని. లాభము నాద్రవ్య మును గార్యాంతరమునందు వాడుకొని నాకొకపత్రము వ్రాసియిచ్చెను. వృద్ధికూడ వలదనియు, నాద్రవ్యము నిచ్చినఁ జాలుననియు వాగ్దానము చేసితిని. ఇంతలో నాతఁ డొకవిధ వను బెండ్లియాడెను. ఆమెతో నాతఁ డీవిషయమును జెప్పి యుండనోపును. ఆమె నన్ను విశేషించి యాదరించుచు మాట లాడుచు ననునయించుచు నాకపుడపుడు పిండివంటలుచేయించి పెట్టుచుఁ దాంబూల మిచ్చుచుఁ బాడుచు నెన్నియోవిధముల మోసపుచ్చెను. అవివేకమున నే నామె మాటలకు లోఁబడి పత్త్రము గడువుదాఁటుటకూడ లెక్కింపక వారీయకుందురా యని యూరకుంటిని. ఒక్కనాఁడు నాకు నతిరసములను బెట్టిం

చెను నమలునపుడు రుచిమాఱి చేఁదుగా నున్నజాడ గనఁబడఁగా నే మిట్లున్నవంటిని. బెల్లమున నించుక యాఁగుణముండునని బదులుచెప్పుచు నొకపాటను బాడెను. ఆయానందమున నద్దానిని లెక్కింపకపోతిని. ఆపిదప నాలుగుగడియలకొక్కసారి వాంతియాయెను. ఏదోమం దామెయే యిచ్చెను. ఆనాఁటినుండియే నా కీదురవస్థ సంభవించినది. నన్నెట్లు బ్రదికింపఁకొంపువో నీయదృష్ట మెట్లున్నదో యెఱుంగను. చేసిన తప్పును జెప్పితిని. నాయపరాధములను క్షమింపుము. ఇఁక నే బ్రదికెద నీ కుల్లాసము గల్గింతునన్నయాశ లేదు. అని కన్నీరు మున్నీరుగాఁ బ్రవహింప మఱియు మాటలాడఁజాలక యూరకుండెను. సుభద్రయుఁ బైఁటకొంగునఁ గన్నీరుదుడిచి భయంపడవలదు. సర్వేశ్వరుఁడు మనపాలఁ గలఁడని ధైర్యముచెప్పి యూఱడిల్లఁజేసెను.

మహాళాసభయందు నిత్యోత్సవములు జరగసాగెను. కొందఱు సభ్యురాండ్రుగఁ జేరిరి. ప్రతిసభ్యురాలు నొక్కదినముప్రకారము ఫలాహారముల నితరుల కర్పించుట యొక యాచారముగ నయ్యెను. ఆమీఁద నాటలుపాటలు లోనగు వానికిఁ గొంతవ్యయము నగుచుండెను. నెలయొకటింటికి నొక్కొక్కసభ్యురాలికి నిరువదిరూప్యములకుఁ దక్కువగాక యుండ వ్యయమగుట సహజమయ్యెను. అధికస్యాధికం ఫలమ్మనునట్లు దానికిమించియునగుచుండెను. అంతియకాక ప్రతిదినము సాయంకాలము మూఁడుగంటలనఁగా నేడుగడియలు ముప్పది విగడియలు కాల మాసభామందిరమునఁ బుచ్చుచుండుటయు సాజమే యయ్యెను. మూఁడునాలుగునెల లగునప్పటికి వారి

భర్తలకు దుస్సహమయ్యెను. ఏల యింతయాలస్య మన్నంతనే మీకుఁ గలస్వాతంత్ర్యము మాకు నుండఁగూడదా యను మాట వినఁబడుచుండెను. నెలకొక్కసారి తిరుపతిముడుపు లాగున నిరుపదిరూపాయలు తప్పక చెల్లించుట విధియగు చుండెను. ఈ రెండునుగలిసి వారిభర్తలకు మఱింత మనఃపీడను గల్గించుచుండెను. ఆత్రేయి తనయధికారమును విశేషించి యటుఁ జెల్లింపసాగెను. సభ్యురాండ్రెల్ల నీమెమాట జవదాఁటక యుండవలసివచ్చెను. దానిచే గొంద ఱిదియేమి వ్యసన మను కొనసాగిరి. ఆత్రేయికిఁ దోడుగా ననంతకుమారస్వామిరాయ లిరువురు నాసభామందిరమునకుఁ బోవుచువచ్చినవారితో వినోదముగా మాటలాడుచు నవ్వుచుఁ దిరుగసాగిరి ఈవార్త పతులకర్ణరంధ్రములఁ జొరఁబడియెను. వార లద్దాని కోర్వఁ జాలక మండిపడి యిఁక లాభములేదని క్రమక్రమముగా దండింపఁసాగిరి. వారికిఁ బ్రతిదినము రాత్రిభోజనము రెండవ జాము దాఁటునపుడే దొరకుచుండెను. మాటకు బదులాడుటయు వారికిఁ గోపమును హెచ్చించుచునే యుండెను కొంద ఱొకనాఁ డొకచోటఁ జేరి భార్యలప్రవృత్తిని దలపోసికొనఁ జొచ్చిరి ఒకఁడీసభ మర్యాద నడంచుటకే యనెను వేఱొకఁడు మర్యాదమాట యటుండనిమ్ము. సకాలమునకు బువ్వ దొరకుట యరుదుగ నున్నదనెను. ఇంకొకఁడు నాజీతమంతయు నీపాడుపనికే ముగియుచున్నదనెను. మఱియొకఁడు మాటకు మాట చెప్పుటయేగాక మనకు బుద్ధినేర్పుచుండు టొకటి విశేష మనెను. ఇంకను వేఱొకఁడు వీనికేమిగాని పురుషుల కందుఁ బ్రవేశముకల్గుట వారింగలిసి వీరాటలాడుట విచార

కర మనియెను. ఇట్లే పలువురు పలువిధముల మాటలాడిరి. ఇంక నీ రాసభకుఁ బోవుట మానుటో మనల వదలుకొనుటో యేదో యొకటి తేలవలయునని యెల్లరు తీర్మానించుకొని తమ తమయిండ్ల కరిగిరి. మఱి వారములోఁగా వారు చెల్లింపఁదగు మాసనియతధన మిమ్మని సేవకుఁడు రాఁగా వారు భర్తల నడుగుమనిరి. వారి నడుగ నెవరి నడుగవలయునో వారినే యడుగు మనిరి. ఇదేమండి ఈచిక్కులు నాకేల? ఇత్తురా లేదండురా యని యాసేవకుఁ డడిగెను. అధికప్రసంగము చేసినఁ దాంబూలము నమలు నదృష్టము తప్పునుజుమీ యని పురుషులనుండి బదులు వచ్చెను. ఆఁడువారు మాటాడక యూరకుండిరి. వాఁడు తనదారిం బోయెను. మఱుదిన మాత్రేయి సభ్యురాండ్రం గని చీకాకుపడుచు నోవనితలారా! సభానియమములఁ దిరస్కరింపరాదు. భగవదాజ్ఞవలె వాని గౌరవింపఁదగును. వెనుకఁబడియున్న మనజాతి నియమము నతిక్రమించిన నెల్లరు నవ్వుదురు. నెల కీవలసినభృతి నీయక త్రిప్పుట ధర్మముకాదు ఇష్టములేనిచో వదలుకొనవచ్చును. పెక్కండ్రు సభ్యురాండ్రుగ నుండువారు మాకుం గలరు. అని మోము చిట్లించుచుఁ బలికెను. ఒకర్తుక లేచి వెనుకఁబడక ముందునకుఁ బడినందుననే నవ్వుచున్నవారు. ఆవిషయము మీారెఱుంగరు కాఁబోలు. మీావలె మేమెల్ల నొకనిమార్చి యింకొక్కని వరింపఁ బూనలేదు. ఇదియే మీాపదవి మాకు వలదని మనస్సమాధానముగాఁ బలుకుచున్నారము. నెలవైన వెళ్లుదు మనుచు వెడలిపోయిరి. పదియవభాగముగా వారిసంఖ్య మిగిలెను. అది మఱింతయాగ్రహహేతువుకాఁగా

నాత్రేయి యటనున్నపత్త్రికలం జించి పాఱవైచి తనయింటి కవంతకుమారస్వామిరాయలు వెంటరాఁగాఁ బోయెను. అనాఁ డూరనెల్ల నాత్రేయీసభావృత్తాంతమే పారాయణ మయ్యెను. ఎల్లరు నవ్వసాగిరి పదవిపదలుకొనిన వనితలెల్ల రందు సాగు చున్నదుష్ప్రవృత్తులఁ బలుకసాగిరి. మృత్యుంజయుఁ డావార్తల విని మఱింత తలవంచుకొనెను.

రంగరాయఁడు మఱింత కృశించెను. సుభద్ర మరల సుమిత్రయింటికింబోయి పతిచెప్పినవిధము తెలిపెను. ఆమెయు నాలోచించి సుభద్రా! తొలుత నాపై ననుమాన మూనితివి కదా! నీమగఁ డీవిధ మెఱింగింపకయున్న నా ద్రోహమే యిదని నిశ్చయింతువుకదా! కానిమ్ము. నీయార్తిఁ బాపెదను. అతిరస ములలోఁ బెట్టుమందు వశీకరణార్థముకాదు. మారణప్రయోజ నార్థమే. కావున నద్దానికిం దగినయుపమ చెప్పెదను. మాయింటి వెనుకభాగమున నొక్కతీగ గలదు. అది పారిజాతవృక్షము నల్లుకొనియున్నది. దానియందుఁ గలయాకులు తొమ్మిదితీసికొని క్రొంద నుసుపక యింటికింబోయి యిరువదేనుమిరియపుగింజలను జేర్చి మెత్తగా మర్దించి యావుపాలలోఁ గలిపి త్రాగుమనుము. త్రాగిన రెండుగడియలకు వాంతియగును. దానిలోఁ బరికిం పుము. ఘుటికల ల్లే పడును. అయఃపిండములం బోలియుం డును వాని నిప్పులలోఁ బొరలింపుము. దుర్గంధము బయలు వెడలును. పులిసినపదార్థమునఁ గలవాసన కడపటవచ్చును. అది భస్మముకాదు. నల్లగను గట్టిగ నుండును. ఆమఱుదినమునుండి నీపతి కాఁకలియగును. అన్నము హితముగనుండి జీర్ణమగును. క్రమక్రమముగా వ్యాధి నివర్తించును. ప్రతిదినము పెరుగు

వాడుచుండుము. దాన రక్తము శుద్ధమగును. నిస్సటిపెరుగు నేయుపయోగించుట మజింతమంచిది మూఁడునాలుగునెలలకు యథాపూర్వముగ నీభర్త యుండఁగలఁడు. ఇఁకఁ బోమ్మని పని చిన సుభద్ర యట్లే యొనరించెను. చెప్పినట్లెల్ల గుణములు కనం బడియెను. రంగరాయఁడు కన్నులారం గాంచెను. బ్రదికించితివని భార్యను బ్రశంసించెను. అపద్బాంధవుఁడు నీసౌభాగ్యమున నా కుం దోడయ్యెనని భగవంతుని సంస్మరించెను. పోయినద్రవ్యము పోనిమ్ము బ్రదికితినిగదా! భిక్షము తెచ్చియైన నిన్నుం బోషింతును. నీపాతివ్రత్యమే నాప్రాణముల మరల నిప్పించెను. అని పలువిధముల వినుతించెను సుభద్రయు బతి యాజ్ఞఁ బలికి యుపచారములు చేయుచుండెను.

---

## పంద్రెండవ తరంగము.

సదాశివరాయఁ డొకనాఁడు కొడుకుకడకుం బోయి మాటలాడవలయుననియె ఇంచుకసేపుండి వచ్చెదనని లోపలి కనిపి మందు లిచ్చి యెల్లరంబంపి తండ్రి యుండుతావునకుఁ బోయెను. తండ్రియుఁ గుమారుఁడు కొంతసేపు మాటలాడిరి. కొడుకును దండింపఁబూనిన సదాశివరాయని మృత్యుంజయుం డూరకుండుమని హెచ్చరించి తనదారిఁబోయెను. తండ్రియు మరల నాతని నెందో యొంటరిగారినుండఁ గలిసికొని నాయనా! ముందు మిగిలి తప్పుపనిచేసితిమి. ఇపుడు మనమే దానిని వెలి పుచ్చిన నెల్లరు నవ్వుదురు. పరివేషకుఁడు దుర్మార్గుఁడు. పెక్కండ్రాతనికడ దుర్జనులు గలరు. కావున నెట్లో కన్నులు మూసి కొనియుండుము. అందును వంధ్య గాదు. నలువురుపిల్లలు గలి

గని. ఇంక నేమితప్పుచేయును? చేసినను దానింబరికింపన ట్లుండి కాలము పుచ్చవలయుఁగదా! నీ విపు డాత్రేయిని వదలిపెట్టిన నామెపిల్లలకు దిక్కెవ్వరు? అందును పెండ్లియాడువచ్చిన కన్యక యున్నది. ఒకయయ్యచేతిలోఁ బెట్టవలయుఁగదా! నీవు వదలిన నామె నెవ్వరు వివాహమాడుదురు దూర మాలోచించి మోహప్పగల్గి యుండుమని హితోపదేశము చేసెను.

ఆమాటలకు మృత్యుంజయుఁ డులికిపడినట్లు చూచుచు నాయనా! చాలుఁజాలు. నీహితోపదేశము. నీచకులజారాలిని జేపట్టుమనీవు నా కాయుపదేశింప వచ్చితివి? సెబాసు! చాలబా గున్నది! ఇట్టిదానిని భార్య యని చెప్పుకొనుటయా? అంతకన్న మృతియే మంచిది. ఇఁక నాకడంకను నష్టపడకుము. ఆత్రేయికి నేనొకఁడనే దిక్కనుకొనుచున్నావు కాఁబోలు. రత్నముల నమ్మువాఁ డొకఁడు కలఁడు. అనంతకుమారస్వామిరాయ లిరు వురు నున్నారు. ఈముప్పురును దానిఁ గాపాడఁగలరు. ఇఁక నే నెంజేని యాత్రకొఱకుం బోవుదు. నీకుటుంబమును పోషించు టకు నాశక్తియంతయు దారవోసితి. ఇఁక నాచేతఁగాదని చెప్పుచున్నాను. నే నిందుండను తత్త్వజ్ఞానసంపన్ను లిట్టి పిల్లలం బెద్దలం జేరఁదీసి పరికించుచుందురు. వారికి స్థానాస్థాన భేదములు లేవు సర్వసమ్మతమత మఁట. వారియుపదేశమున నే యాత్రేయి యిట్లైనది. వేదాంతము విపరీతఫలము నిచ్చెను. ఇఁకనైన నాచేసినయవివేకమూలకార్యమునకుఁ దగినప్రాయశ్చి త్తము చేసికొనవలయును. ఈనగరమునఁగాని యీచుట్టుపట్ల గాని నిలువరాదు. ఈప్రాంతములయందుఁ గులభ్రష్టులు మత ములు సభలును నెలకొల్పిరి. వానిమూలమునఁ బ్రవర్తనము

తాఱుమాఱయ్యెను. ఎన్ని విధములనో పరికించితి. ఇఁక నిందుం డిన మనుష్యజన్మముకూడ భావికాలమున రాదనియే నాకుం దోఁచినది నర్మదానదీతీరమున ననేకనగరములు గలవు. ఇచ్చోటి కవి సమీపముననే యున్నవికదా. అందుండి ఫలాహారమున జీవయాత్ర గడపెదను. ఈపాపములకుఁ బరిహారముగా భగవంతుని శ్రీరాధాకృష్ణుని భజించెదను. అదియొక్కటియే నాకు యుక్తముగఁ దోఁచినది. వేఱొండుప్రాయశ్చిత్తము నాకొనరింప శక్యమైనది కానరాలేదు. అని యెన్నియోవిధములఁ దనభావమును దెలిపి వెడలిపోయెను. సదాశివరాయఁడు తనతప్పునే కొడుకుకూడఁ జేసినందున విశేషించి దండింప నోపరాక యూరక వెడలిపోయెను.

రంగరాయనికిఁ బూటకుఁబూటకు నారోగ్యము గలుగఁ జొచ్చెను. సుభద్ర తనగళమునఁ గలమంగళసూత్రమే భూషణముగా నునుచుకొని తక్కినయాభరణములనెల్ల నమ్మివైచి భర్తకు మందిప్పించి యాహారము తృప్తిగా నిడుచుఁ దానొంటిపూట గుడుచుచుఁ గాలము వెళ్లించుచుండెను. సుభద్ర పాతివ్రత్యము నెల్లరుఁ గొనియాడ సాగిరి. క్రమక్రమముగా నామెను వేంకటాద్రిశర్మసాధ్వీమణియగు సుశీలతో సఖ్యముఁ గూడెను సుభద్రపడుపాట్లు చూచి యోర్వఁజాలక యాసుశీల పతికిం దెలిపి నాలుగునెలలకు సరిపడునంతధాన్యము నిప్పించెను. మఱియు నలువురకు నెఱింగించి ధనముకూడ నిప్పించెను. దాన నాదంపతులు నిశ్చింతముగాఁ గాలముపుచ్చఁ గలిగిరి. లలితయు సుభద్రను గూడి సుశీలయింటికిఁ బోవుచు నామె సంగతి పరమపవిత్రముగాఁ దలంచి యలవరిచికొనియెను. రంగ

రాయఁడు నడువఁజాలెను. మెల్లఁగ వేంకటాద్రిశర్మను దర్శింపఁ బోవసాగెను. ప్రతిదినము సాయంకాలమునకు ముందుగాఁ బురాణముచెప్పు నాచార మాయన కుండెను. ఆసమయమునఁ బెక్కండ్రు చేరుచుండిరి. రంగరాయఁడు నాసమయమునకే పోవుచుఁ దపశ్శాస్త్రముల నాలకించుచు భగవంతుని నామపారాయణముచేయఁ నలవాటుచేసికొనియెను. ఆరోగ్యమును కలుగు మార్గ మడిగి ప్రాతస్స్నానము తోలుత నభ్యసించి త్రికాలములయందు సంధ్యావందనము చేయ మొదలిడెను. దాన సంపూర్ణారోగ్య మొందెను. పురాణము విన నరుదెంచుభక్తులందఱు రంగరాయనికష్టముల నాలకించి జాలిచెంది తోఁచిన సహాయము చేయఁబూనిరి. తనయుద్యోగమునఁ బ్రవేశించునంత యారోగ్య మాతనికిఁ గల్గినంతదనుక వారు తోడ్పాటుచూపుచునే యుండిరి. ఉద్యోగమునఁ బ్రవేశించినను బురాణమును విన నవకాశము గలిగినపు డెల్లఁ బోవుచు హరికథల నాలకించుచు భక్తి దృఢముగ నుండున ట్లభ్యసించుచుండెను.

శ్యామరాయఁ డొకనాఁడు సాయంకాలమున నగరోద్యానసీమలకుఁ బోయియుండి తన్ను వెదకుచు వచ్చుచున్న మృత్యుంజయునిఁ గాంచెను. చిరకాలమున కుభయులు కలిసికొన్నందునఁ బట్టరానియానందమున గగుర్పాటు గలుగుచె యటుండఁ గన్నీటిధార లవిరామముగాఁ గాఱసాగెను. ఒండొరులఁ గౌఁగిలించుకొనిరి. ఎట్టకేలకు నాశ్లేషబంధము వీడి కూరుచుండిరి. శ్యామరాయఁ డేమిమాటలాడుటకుఁ దోఁపక యూరకుండెను. ఆతనియధోముఖమును గాంచి విషయమును గ్రహించి మృత్యుంజయుఁడు మిత్రమా! యవివేకపుఁగార్య

మొనరించి నీవంటిమిత్రునకు దూరమైతినని వగచుచున్నాఁడను. నాయపరాధమును క్షమించి నన్నాదృతింజూఁడుము. మానవు లలో సాధారణముగా నేదో యొకతప్పు చేయనివా రుండ రనుకొనియెదను. కావున నా యీయపరాధమును సైరుము. దేహమంతయుఁ గృశించినది. మనశ్చింతకు మేరయే లేదు. సకల దుఃఖము లనుభవించితిని. దుఃఖములనే సుఖములుగా భావించి యనుభవించితిని. మిత్రమా! ఇంక నేమని వచింతును? చిన్న నాఁడు మనము చదువుకొనునపుడు

శ్లో. "ధన్యాస్త ఏవ చపలాయతలోచనానాం
తారుణ్యగర్వఘనపీనపయోధరాణాం,
క్షామోదరోపరి లసత్త్రివళీలతానాం
దృష్ట్వాకృతిం వికృతిమేతి మనో న యేషామ్."

అనునదియు,

"మత్తేభకుంభదళనే భువి సంతి శూరాః
కేచిత్ప్రచండమృగరాజవధేఽపి శూరాః,
కింతు బ్రవీమి బలినాం పురతః ప్రసహ్య
కందర్పదర్పదళనే విరళా మనుష్యాః."

అనునదియు,

"స్మితేన భావేన చ లజ్జయా భియా
పరాఙ్ముఖైరర్ధకటాక్షవీక్షణైః,
వచోభిరీర్ష్యాకలహేన లీలయా
సమస్తభావైః ఖలు బంధనం స్త్రియః."

అనునవియుఁ గంఠస్థముఁ జేయుఁడని గురువర్యు లాజ్ఞా పింప మన మట్లే చేసితిమి. భర్తృహరియొంత యనుభవజ్ఞుఁడో

వచింపఁజాల. నే నట్లే యాత్రేయియాకటాక్షదృష్టులకుఁ జిక్కి-పోయితిని జుమీ! సర్వస్వము దారపోసితిని. అంతతోఁ జాలక మర్యాదయుఁ గులపూర్వులసదాచారములు వదలుకొంటిని. ఆత్రేయియా విచిత్రచరిత్ర మవాచ్యము. బ్రహ్మాదులకే దుర్జ్ఞేయము. నే నేమని వర్ణింతును? అని పలుకుచుఁ గన్నీరు వదలుచు మఱియు మాటాడఁజాలక యూరకుండెను.

శ్యామరాయఁ డాతనిసంతాపము నెఱింగియే యున్న వాఁడు కావున నించుకసే పూరకుండి మిత్రమా! ఇపుడు నీగతి యెట్లున్నది? ఏమిచేయఁదలఁచుకొంటివి? నాతో దాఁపక చెప్పుము. నావిని తనమనోగతముఁను, దండ్రికిఁ దనకు నైన సంవాదమును దెలిపి, తుదకు నీయిష్టానుసారము వర్తింపఁ దలంపుకొని యున్నాఁడ నని పలికెను. శ్యామరాయఁ డార్యా! ఆత్రేయి నిన్నే నమ్మియుండలేదని వింటిని. కావున నీక నామెను లోఁబఱచుకొనఁ సాధ్యముకాదు. వదలిపెట్టవలసినదే. నీ వింక బ్రహ్మచర్యవ్రతమున నుండఁగలవా? అట్లుండఁ దగుమనో దృఢము నికున్నయెడల నీనగరమును వదలి జబ్బులపురమున కరుగుము. మంచివిద్వాంసులు గలరు. వారిగోష్ఠి నుండుము. నీమనశ్చింత లుండవు. వైద్యవృత్తిని వదలకుము. తండ్రిని బోషించుట ధర్మము. ఆతఁడు కులభ్రష్టుఁ డయ్యెను. అయినను దండ్రిగదా! సాయపడుచుండుము రాజచూడామణిబాయియు నాత్రేయియు స్వేచ్ఛాప్రవర్తనమున సమానముగనే యున్నారు. నీవుమాత్ర మావిషయమును దలంపక ద్రవ్యము న్యాయరీతి నార్జించి తండ్రికిం బంపుచుఁ బెద్దలగోష్ఠిం దవిలి యుండుము. నే నపుడపుడు వచ్చుచుందును. మరల నాత్రేయివచ్చి మా యో

రంగరాయఁడు వేంకటాద్రిశర్మగృహమున కరుగుచుండఁగా మృత్యుంజయుఁ డెదురుపడి కుశల మడిగి యీలోపలఁ జూడలేదే యని మందలించెను. ఆరోగ్యములేక రాఁజాలనైతి నని చెప్పి ఋణమువిషయము ప్రస్తావింపకయే యుండెను. ఎవరింటికీఁ బోవుచున్నావని యడిగి, వేంకటాద్రిశర్మ యింటికని యాతఁడు పలుక నేనును వచ్చెదనని మృత్యుంజయుఁడు కూడఁ బోయెను శర్మ వారినెల్లఁ గూరుచుండ నియోగించి కుశలవార్త యడిగి పురాణము సాగించెను. ఎల్లరు పోయిన తరువాత రంగరాయమృత్యుంజయు లిరువురే యుండిరి. ఏమిపని నావలనఁ గావలయు ననఁగా మృత్యుంజయుఁ డేకాంత సంభాషణమున కవకాశము గోర నాతఁ డట్లే కానిమ్మని నాపన్న యొజింగి రంగరాయఁ డరుగ నిరువురు మాటలాడిరి. మృత్యుంజయుఁడు దాఁపక యున్నదున్నట్లు చెప్పెను వేంకటాద్రిశర్మ చక్కఁగా నాలోచించి నాయనా! స్త్రీమూల మెఱుఁగుట కష్టము తెలిసియో తెలియకయో వివాహము చేసికొంటివి. ఇప్పుడు వదలుట న్యాయముకాదు. కులట యని నీవనుటయుఁ దగదు. ఎట్లో కాలము గడపుము. సంతానము కలదు. పిల్లలను భార్యను వదలిపెట్టుట న్యాయము కాదని నాభావము కొన్నియేండ్లు గడపితివి. వదలిన నపకీర్తియుఁ పాపము గల్గునని యనేకభంగుల హితముపదేశించెను. మృత్యుంజయుఁ డామె ప్రవృత్తి నంతయుఁ దెలిపి తాను వదలకయున్న నామెయే తన్ను వదలునని పలుకుచుఁ గొన్నిపత్రికలం జూపెను. వానింజదువుకొని యిఁక నీయిష్టము ఋణానుబంధము తప్పినట్లే యున్నదనెను. ఇఁక నాదోషము లేదు.

గదా యని మృత్యుంజయుఁ డడిగి కొన్ని రహస్యములు తెలిసి కొని సెలవుపుచ్చుకొనుచు,

"న హ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః,
తే పునంత్యురుకాలేన దర్శనాదేవ సాధవః"

అనుశ్లోకమును బఠించుచు నమస్కరించి తనయింటికిం బోవక చికిత్సాలయమునకుఁ బోయెను.

మఱునాఁటనుండి మృత్యుంజయుఁడు భోజనము మానివేసినాఁడు ఫలాహారమునఁ దనకారోగ్యము బాగుండు ననియుఁ జెప్పి యింటికపుడపుడు పోవుచు నాలుగైదుదిన ములలో మందులు మొదలగువస్తువుల నొరు లెఱుంగకుండ శ్యామరాయనిసాయమున జబ్బులపురమునకు సాగించెను. ఏవో నాలుగుసీసాలు మొదలగునవిమాత్ర ముంచుకొని కాలము గడుపుచుండెను. అప్రయిటో నాకజీర్ణవ్యాధికలుగులక్షణములు కనఁబడుచున్న వనియుఁ గొంతదినము లిట్లు ఫలములఁ గొనిన నారోగ్యము కలుగుననియుఁ జెప్పుచు ననురాగముగలవానివలె నటించుచుండెను. శ్యామరాయఁడు జబ్బులపురమున నొకమూల నొక్కచిన్నగ్రామమునం దుంచుటకొరకు నొకయిల్లు మాటలాడి యందీన సుప్రతిష్ఠముగఁ జేర్చెను. వైద్యులుండుటకావచ్చుటకిఁ జెంతనుండె. వారిలోఁ జెక్కండ్రు శ్యామరాయనికి మిత్రులు గలరు. వారల కీవార్త నెఱింగించి వైద్యవృత్తి నవలంబించుట కుపాయము కల్పింపుఁడని వారల హెచ్చరించి తాను మరలివచ్చి యావార్త మృత్యుంజయునకెఱింగించెను. ఎప్పుడెప్పుడు ప్రయాణచేయుదు నాయని యున్నవాఁడు గావున నాతఁ డావార్తకుఁ బరమానంద భరితుఁ డయ్యెను. ఈనడుమ ననంతుఁడు రత్నములవ్యాపా

రము చేయు వేంకటేశ్వరదాసుతో మైత్రి సంపాదించి యతఁడింటనే యుండునట్లు ప్రోత్సహించి యొకహర్మ్యమును గొనునట్లుచేసెను. అనంతవేంకటేశ్వరదాసులు ప్రియమిత్రులైరి. విశేషించి యాత్రేయికి సాయపడుమని నమ్మకము గల్గించిరి. ఈవిధమంతయు నెంపజేమూలమునను యెటంగినమృత్యుంజయుఁ డందుండుదినములు మహాయుగసమములుగాఁ దలంచుచు నొకనాఁడు గృహమునకు వచ్చి సంతోషముగా మాటలాడి తనపేటిక నొకవ్యాజమున నంతకుముందే చికిత్సాలయమునకుఁ బంపియున్నవాఁడు కాన దాని నపుడు తెప్పించి యథాస్థానమున నునిచెను. ఏవో నాలుగువస్తువులు తాను గొన్నయట్లు తెప్పించి యందుంచెను. ఇవేలకొంటి రని ధర్మదార ప్రశ్నింపఁగా నల్పమూల్యమునకు దొరకినందునఁ దెచ్చితి నని నమ్మించెను. తనవస్తువులలోఁ బనికివచ్చునవి యొక్కటియైన లేకయుండ సాగించియే యుండెను. ఆనాఁడు తనయింటనే ఫలములను దెప్పించుకొని భుజించి యిష్టకథాలాపములఁ బ్రొద్దుపుచ్చి సాయంసమయము కానున్న దనఁగాఁ బయనమగుచు నేఁటరేయి యొకరియింటఁ జికిత్సచేయఁ బుచ్చవలయునని చెప్పి యావాడుక ముస్సున్నదే కాన నాత్రేయి యనుమానింపదని తలంచుచుఁ బోయివత్తును. జాగ్రత్తసుమీ క్రొత్తవారి నింటఁ జేర్పకుము. కార్యార్థము చేరి మంచిమాటలాడుదురు. తరువాత మాటలాడరు. వస్తువులు జాగ్రత్తగాఁ జూచుకొనకయున్న మరల సంపాదింపఁజాలము సుమీ యని యేమో ప్రీతియున్నట్లు మాటలాడుచుఁ జికిత్సాలయమునకుం బోయెను.

స్వకార్యధురంధరులసంఘముగుట్టు బట్టబయలగుచుండెను. వారియూహల నాలకించువారుగూడ లేకుండిరి. సేకరించినధనమంతయు విచ్చలవిడిగా వ్యయముచేయుటవలన ఎక్కౌసము శూన్యమయ్యెను. నియమించినప్రచారకులు సుపాధ్యాయులుగాండ్రు వేతనము లిమ్మని యడుగుటయేకాక యవి సకాలమునకు నీయకపోవుటంజేసి నలువురకుం దెలియంజేయుచుండిరి. సమృద్ధిగా ధనమిచ్చినవారెల్ల నిది దుర్వ్యయముచేయంబడినదా యని యడుగసాగిరి. వీథులలోం దిరుగుటయే వారికి నెంతయో కష్టముగం దోంచెను. ఇంక నడుగువారికి నోరెట్లువచ్చును? నెలకు నిత్తుమన్న వేతనము లొకకొండెకే ముట్టెను. తక్కినవారు వారివారికిం గలసంబంధములను వెల్లడింపసాగిరి. మఱింత యేవగింపుగల్గించు నావార్తల నాలకించి నగరమునసేకాక పల్లెలయందుం గలమానవులెల్ల నవ్వసాగిరి. ఎందుంజూడంబోయిన నవార్తలే వినంబడసాగెను. అసభ్యులెల్లం దుంటరు లని నిశ్చయించి వారింబట్టుకొని చోరతనమువారి కప్పగింపం బ్రయత్నించుచుం గొందఱు తిరుగుచుండిరి. శిలాపురమహాశాసభ నానావిధముల నపకీర్తిపాలు కాంజొచ్చెను. ఆత్రేయిమాత్ర మాలోలినాండే పతియగుమృత్యుంజయుండు వైద్యవృత్తి నెచటికో పోవుదునని చెప్పినందున నామాటనమ్మి యాముప్వురును దనకుం దోడ్పాటుసూపంగా భీతినొందక యితరులమాటలు లెక్కపెట్టక హాయిగా నుండెను. తుంటరులు గ్రామాంతరములకుం బోవువారివలె మెల్లమెల్లన నగరముదాంటి యెచటికోపోయిరి. ప్రచారకులు వేతనమురామిం దత్కార్యమును మానుకొనిరి. ఇతరు లడుగ

నోరుమూసికొని యూరకుండిరి. ఉపాధ్యాయురాండ్రు తమ యవివేకమునకుఁ జింతించుచుఁ దమవృత్తి బయలుపడినందులకుఁ గృశించుచు సాధ్వీమతల్లులంజూచి తల్లడిల్లుచు నిల్లు దాఁటి బయటికి రాకయుండిరి. నాలుగయిదుదినము లీవార్తలతోఁ బుర మెల్ల మాఱుమ్రోఁగుచుండెను.

ఆనాఁడు మృత్యుంజయుఁడు చికిత్సాలయమునకుఁ బోయి తలుపు వేసి యశ్వశకటమును శ్యామరాయఁ డాయత్తపఱచి కూరుచుండి యీమార్గమున రమ్మని హెచ్చరించి తానొక్కఁడే పోయి యామార్గమున గాచుకొనియుండెను చీకట్లు గ్రమ్మినప్పటి కాయశ్వశకటము శ్యామరాయని సమీపింపఁ గల్గెను. మిత్రమా యనుమాట వినఁబడినతోడనే మృత్యుంజయుఁడు చివాలున దిగి సఖునిఁ గౌఁగిలించుకొనియెను. ఇరువురు నందు ఫలాహారములుచేసి బండివానికి నిచ్చి గుఱ్ఱము నీరుత్రాగఁగాఁ గొంచెమునే పందుండి బయలువెడలి తెల్లవాఱునప్పటి కొకయూరు చేరిరి. అచ్చటనుండి యాశకటమును మరలఁబంపి యందు నిత్యకృత్యములఁ దీర్చుకొని భుజించి వేఱొకఘోటకశకటము నెక్కి పయనమైపోయి సాయంకాలమున నొకపల్లియఁజేరి యందు శ్యామరాయనిబంధుగృహమున భుజించి సుఖనిద్రచేయ వలనుపడమి నుష్ట్రశకటమునఁ గూరుచుండి యుదయమునకు నించుకపూర్వమే జబ్బులపురముచేరిరి. శ్యామరాయఁడు తా నేర్పఱచినగృహమున మృత్యుంజయు నునిచి బంధుగృహమునకుం బోయి భుజించెను. ఆత్రేయీపతి బ్రదుకఁ గంటినను సంతోషమునఁ దానే వంట చేసికొని భుజించి పిదప శ్యామరాయఁడు రాఁగా స్వవస్తువుల నుండఁ జూచు

కొని యామఱుదినము శుభముహూర్తమున వైద్యవృత్తి నారంభించెను. అప్పటిపేరు సుధాకరశేఖరుఁ డని మిత్రుఁడు తెలిపినందున నాపేరుతో వ్యవహరించుచు నెల్లరతోఁ గలిసిన ట్లుండెను. పదిదినములకే రెండుమూఁడుచోట్లఁ గష్టసాధ్యరోగములఁ బోఁగొట్టి పేరుపొందెను. తనవ్యయమునకుఁ గాఁగా మిగిలినదానిని దానముచేయుచు సంతోషముగా నుండెను. శ్యామరాయఁడు పదిదినములుండి తనబంధువులకు వైశ్యులకును సుధాకరశేఖరునిఁజూపి స్నేహమును గల్పించి మరల శిలా నగరమునకు నరుగ నుద్యుక్తుఁడయ్యెను. పలుమాఱువచ్చి నా కుశలము లరయుచు నాయునికి నెవ్వరికిం దెలుపక యుండవలె నని యనియు నాతండ్రి క్షేమమైన సాయపడుచు నాకుఁ దెలిపిన ద్రవ్యము నీకు నేను బంపుచుందుననియుఁ జెప్పి గాఢానురాగమునఁ గౌఁగిలించుకొని కన్నీరు గాఱుచుండఁగా వదలి పెట్టెను. శ్యామరాయఁ డాతనికి హితము తెలిపి నీతండ్రికుశల మరయుచుందుననియు ద్రవ్య మిత్తు నన్న నీయూహ శ్లాఘింపఁ దగుననియు నచ్చఁబలికి పదుగుండ్రను మిత్రులనుగా నేర్పఱచి నాకుమాఱుగా నాప్రియవయస్యుని సుధాకరశేఖరుని జూచుకొనుఁడనియు వారలకుం దెల్పి ప్రయాణము సాగించి యైదవదినము శిలానగరమును జేరి తనయింట నుండెను.

ఇట నాత్రేయి యామఱుదినముకూడ భర్తరామికి విచారింపక హాయిగా నుండెను. మూఁడవదినమున నేమో వ్యయమునకు గావలసినధనము తనకడ లేనందునఁ జికిత్సాలయమునకు నెచ్చెలిం బంపెను. ఆమె వచ్చి నిన్న నేఁడు తలుపే తీయలేదని యిరుగుపొరుగువారు చెప్పిరని తెల్పెను. గ్రామాం

తరమునకుంబోయి రెండుమూఁడుదినములు రాకుండుట మృత్యుంజయునివాడుక యని తానెఱుఁగుదు గాన నాపె నూరకుండెను. నాల్గవదినము వంటచేయులక్ష్మీదేవి పరుగునవచ్చి యాత్రేయీదేవి యని పిలువఁబోయి సగములో నిలిపి యాత్రేయీ! యని సంబోధించి మృత్యుంజయుఁడుగారు చెప్పకుండ నెచ్చటికోపోయిరఁట నలుగురు చెప్పుకొనుచున్నారు. శ్యామరాయనితోఁ గొలఁదిదినముల క్రిందట నుపవనమున మాటలాడుచుండిరఁట. ఇతరు లెవ్వరు వినకుండ నాసంభాషణము జరగెనఁట ఈమాటలే యెల్లవారును జెప్పుకొనుచున్నారు. శ్యామరాయఁడుకూడఁ గనఁబడ లేదఁట. వీరిరువురును గలిసియేపోయిరో యొకరొక్కరుగా నెందేఁ జనిరో తెలియరాకున్నదనియుఁ జెప్పుకొనుచున్నారు. అని చెప్పి యూరకుండెను. ఆత్రేయి మోము వాడఁబాఱెను. మాటలు వెడలవయ్యెను దిక్కులు తెలియకయుండెను. తనగుట్టు బయలుపడినదా యనుకొనియెను. ఇఁక నాయిచ్ఛచొప్పున మెలంగువారు కలరా యని యూహింపసాగెను. నారహస్య మెవరెఱింగించియుందురా యని సందియమందసాగెను. రంగరాయని పనియై యుండునాయని తలంపసాగెను. లక్ష్మీదేవి పనియైయుండునా యనియు నాలోచింప మొదలిడెను. ఏమియుఁ దోఁపనందునఁ దనదురదృష్టమే యనునిశ్చయము చేసికొనియెను. ఇఁక నాగతియేమను నాలోచనమే యామెమది నాటెను. ఇఁక నన్నాదరింపఁగలవా రనంతకుమారస్వామిరాయలు వేంకటేశ్వరదాసుతప్ప మఱెవ్వరుగలరా యని యెన్నసాగెను. తన యవివేకమునకుఁ దన్నే నిందించుకొన నారంభించెను. ఇంత

నున్న పరిచారికయుఁ దనను గౌరవింపదని యామె కప్పుడే పొడకట్టెను. కొంతసే పూరకుండి తనశయనాగారమునకుం బోయి ముసుంగు పెట్టుకొని పరుండెను.

మఱుదినమునుండి చూచినవారెల్ల నాత్రేయిని బరిహసింపసాగిరి. మహిళాసంఘమునకుఁ బోలేదా యని యడుగసాగిరి. మీయుపదేశమునఁ గులకాంతలు కులటలగుజాడ కనఁబడఁగా నీశ్వరుఁ డడ్డగించెనని యెత్తిపొడుపుమాట లన మొదలిడిరి. విధవవయ్యు సధవవైతివి. అంతతో నుండక మఱియు విధవవైతివమ్మా యని నవ్వసాగిరి. మీనాగరకత యెల్లరకు నుదాహరణముకాఁగలదా యని దూషింపసాగిరి. మాణిక్యమువంటి మృత్యుంజయునిచిత్తము తాఱుమాఱుచేసి తుదకు దేశభ్రష్టునిం గూడఁ జేసితివికదా యని మోమునెదుటనే యనసాగిరి. ఇఁక నీయిష్టానుసారము హాయిగా నుండఁదగునమ్మా యని నిందాస్తుతులఁ జేయ మొదలిడిరి. ఇంకెందఱను మార్చవలయునో చూచుచుందమనుచుఁ బలుకుచు నవలఁ బోవసాగిరి. కొలఁదిదినములకే యామె తన తొంటిపదవి వదలి హీనస్థితికి వచ్చె ననవచ్చును అనంతాదులు మూవురుమాత్ర మామెను వదలకయుండిరి. ఆత్రేయి మృత్యుంజయునిపెట్టెం జూడ నందొకపత్త్ర మగపడెను. అందీవిషయము గనంబడియె.

"ఆత్రేయీ! తొలుత నీమాటలకు నీయన్న పరివేషకుని మాటలకు మోసపోతిని. నీదుశ్చేష్టలన్నియుఁ గ్రమముగాఁ దెలియవచ్చెను. కులస్థానపౌరుషములఁ గోలుపోయిన నేనీయూరనుండక సన్న్యాసవృత్తి నవలంబింపఁబోవుచున్నాఁడను. మనకుఁ బరలోకమునందుఁ గూడ ననఁగా నరకమునఁ

గూడ ననుబంధము కలుగదని నమ్ముము. ఇఁక నీయిచ్ఛచొప్పున మెలంగవచ్చును. నిన్నుఁజేపట్టినందుల కుంకువగ హార్మ్యము నీకే యొసంగి నేఁడే వెడలుచున్నాఁడను. ఇఁక నీమిత్రులం గూడి హాయిగా నుండుము. ఈదేహము స్థిరముకాదని మాత్రమెప్పుడెప్పుడు తలంచుకొనుము" ఆమాటలు తనకు హృదయశల్యములు కాఁగా దనయవివేకమునకుఁ జింతించుచుండెను. ఎవ్వరేమన్నను బదులాడక యూరకుండ నలవాటుచేసికొనెను. అమ్మగారూ! అని పిలుచువారెల్ల నమ్మా యనియు మీఁదనుటకు బదులు నీవనియుఁ బల్కరింపసాగిరి. ఈవిషయములన్నియు హృదయవిదారణములుగానున్న నేమిచేయుటకును దోఁపక తలవంచుకొని యూరకుండెను. ఆమెయన్న పరివేషకుఁడు మఱియొక వితంతువును బెండ్లియాడి గ్రామాంతరముననుండెను. ఆవితంతువున కిది మూఁడవ వివాహము. కాని యామె మత మునకుఁ బరివేషకుని మతమునకు సంబంధింపనందున మరలవచ్చి తోడఁబుట్టువు దురవస్థఁ జూచి యామెదగ్గరనే యుండెను. అనంతవేంకటేశ్వరదాసులసాయమున నెట్లో కాలము ద్రోయు చుండిరి

సుధాకరశేఖరుఁ డను క్రొత్త నామమును ధరించిన మృత్యుంజయుఁ డాజబ్బులపురమునందుఁ బ్రఖ్యాతిని గడించి వైద్యవిద్యయందుఁ బేరుగాంచి ద్రవ్యమును న్యాయమూలముగా నార్జించుచు సద్వ్యయము చేయుచుఁ జూచుటకు సన్న్యాసివలెఁ గనంబడుచు విరక్తుఁడై పశ్చాత్తాపమునఁ దానొనరించిన పాపములఁ దూలించుచు శ్యామరాయనికి ద్రవ్యమును బంపి తండ్రికిమ్మని వ్రాయుచు నిఁక నీలాటివిమాయ-

లాడుట జేరనీయరాదని నిశ్చయించుకొని భగవంతు నారాధించుచుఁ బెద్దలసేవించుచు భగవన్నామమును సర్వదా జపించుచుఁ గరుణార్ద్రహృదయుఁడై పురాణములఁ బఠించుచు నందలి గాథలయం దాదరకలిగి సద్వృత్తి నలవరించుకొని కాలమును గడుపుచుండెను. తొంటిపొరపాటులను స్మరించుచు నట్టి వేనాఁడును సాగింప బుద్ధి పొడమకయుండఁ జేయుమా యని భగవంతుని బ్రార్థించుచు నుండెను.

స్వకార్యధురంధరసభ్యులందఱు తలదాఁచుకొను వెరవ్ర లేక దేశాంతరములకుఁబోయి మాఱుపేరు లునుచుకొనిరి. వేంకటాద్రిశర్మ శిష్యప్రశిష్యులు చెదరియున్న మనస్సుల స్థిరతఁగాంచి సనాతనాచారముల నవలంబింప నూరూరం దిరిగి యుపన్యసించుచు దేవతాభక్తియు రాజభక్తియుఁ బొదుకొనఁ జేయుచు నందందు సభల నెలకొల్పి తత్సభ్యు లాయాసమీప గ్రామములకుంబోయి సన్మార్గము నవలంబింప ననువగు పద్ధతుల బోధించుచు వారివారిసంశయములకుఁ దగినసమాధానములఁ జెప్పుచుఁ బూర్వులభావము లివ్వి యని బోధించుచు భగవంతుని లీలలం బాడుచు నామసంకీర్తనముచేయుటయే ప్రధానమని తెలుపుచుఁ గలికాలమునందుఁ జేయుధర్మము రవంతయే యైనను శతగుణాధికఫల మొసంగునని తెలియఁబలుకుచు నూతనాచారముల నవలంబించుటచే నలవడిన దురభ్యాసములఁ దొలఁగించుకొను నుపాయముల నేర్పుచుఁ దిరుగుచుండిరి.

ఆత్రేయీనిర్మిత సభ్యరాండ్రు కొందఱు స్వార్థపరుల యుపదేశములకు లోనయి యవతారపురుషుఁడు పుట్టియున్నాఁడనియు నాతనియుపదేశముల నాలకింపవలయుననియుఁ బ్రాఁతే

యాచారముల వదలవలయుననియు నందందుఁ దెలిపియుండిరి. ఆమాటలనునమ్మి పామరులు పురాణములగాథలు కల్పితము లని తలంచుచుండిరి. జాతిధర్మములు కల్పితములనినమ్మి వానిని వదలుటయే మంచిదని నిశ్చయించియుండిరి. సంధ్యావందనాదు లను జేసిననే మేలురాదనియు మనస్సు పరిశుద్ధముగా నుండిన జాలుననియు నితరులకుఁ దెలుపుచుండిరి. పాన్ బల్లియలలోఁ బామరులు కలఁత నొందుచుండిరి. ఆతావులకుంబోయి వేంక టాద్రిశర్మ యనుచరులు వారిప్రశ్నములకు సదుత్తరముల నిచ్చుచు భగవంతునియవతారములలో దేనియందును వేద వేదాంగములను స్మృతిపురాణములను దూలనాడు నాచారము లేదనియు నిపుడు భగవంతుఁ డవతారమెత్తె ననుట స్వార్థ పరుల కల్పనయేగాని సత్యముకాదనియు విద్యాధికులుగాని వారు లోకులవంచించుటకై ద్రవ్యము గౌరవము సంపాదించు కోర్కెతో నిట్టివి కల్పింతురనియు దెలుపుచు యుక్తియుక్త ముగా నున్నయట్లు వారు నమ్ముమార్గముల నవలంబించుచు నాదురభ్యాసములను సమూలముగా నున్మూలించుచుఁ బ్రాచీ నాచారపరాయణు లగుప్రహ్లాదాదులమహత్త్వము నుగ్గడిం చుచు శాపానుగ్రహసామర్థ్యము గల్గినవారిభక్తియే భక్తి గాని స్వోదరపోషకులభక్తి కేవల తుచ్ఛమనియు నది భక్తియే కాదనియుఁ బామరులకు నెఱింగించుచు నూరూరఁ దిరుగు చుండిరి.

వేంకటాద్రిశర్మయు శిలానగరము చుట్టుపట్టులనున్న గ్రామముల కవకాశము దొరకినపుడెల్లను బోయి గ్రంథాలయ ములవలని లాభములను వారికిఁ దెల్పుచుఁ బనిలేని తరుణమున

నామందిరమునకుంబోయి యిష్టమువచ్చినపాత్రములఁ దీసికొని చదువుచు నిట్లు నానాఁట జ్ఞానము నలవఱచుకొనవచ్చుననియు నెల్లగ్రంథముల నొక్కొక్కరును గొనఁజాలరు గాన గ్రంథాలయము లుండుట యత్యవసరమనియుఁ బ్రబోధించుచుండెను. దానంజేసి యెల్లపల్లియల నుల్లాసమున వాని నెలకొల్పసాగిరి. దాన సామాన్యజనులుకూడఁ గొలఁదినెలలకు వివిధగ్రంథములఁ బఠించుపద్ధతి కలవాటుపడిరి. నాగరకత మూర్తిభవించిన ట్లుండెను. ప్రభుభక్తియు భగవద్భక్తియు వారికిఁ గల్గెను. దేశమున శాంతి నెలకొనసాగెను. సోమరులు విరళముగఁ గన్పడసాగిరి. దేవతా భజనమందిరములతోఁ బల్లియ లుల్లసిల్లుచుండెను. గ్రంథకర్తలు నిరంతరము కృషిసల్పుటంజేసి గ్రంథములు నూతనము లుప్పతిల్లసాగెను. వానిం జదువువారు యోగ్యత ననుసరించి గ్రంథములఁ గొనసాగిరి

ఆత్రేయి తనపూనిన దుష్ప్రయత్నమునకు దగిన ఫలము లభించి తలవంపులగునట్లు చేసెఁగదా యని పరితపించుచు నితరులతో నాకేమిపని యని యింటనుండెను. పరివేషకుఁడు తన కపటము బయటపడినందులకు విచారించుచు నాత్రేయికడ నుండి బయటఁదిరుగక యుండెను. అనంతవేంకటేశ్వరదాసు లిరువురు తమ కాత్రేయీరక్షణమే ప్రధానమని ధనము వెచ్చించుచుఁ దుదకు విసుగునొందిరి. కుమారస్వామిరాయఁ డాత్రేయికి నుపాధ్యాయుఁడుగా నుండియు నేమిలాభము రాఁబోవదని వెనుకంజవేయసాగెను. రంగరాయఁడు సుభద్రా ప్రకల్పితారోగ్యభాగ్యుఁడై తనపూర్వపుఁబద్ధతిని మాని నెమ్మదితో నుండెను. సుభద్ర పతివ్రత యనుఖ్యాతినొంది లలిత

యను సఖియు మంచిఖ్యాతిని సంపాదించుట కానందించుచు నెప్పుడునుండెను. సుమిత్ర కొలఁదిదినములకు మందులు పెట్టు నన్న యపఖ్యాతి రాఁగాఁ బతింగూడి స్వదేశమున కరిగెను. మృత్యుంజయుఁడు జబ్బులపురమునందు సుధాకరశేఖరనామమునఁ బ్రఖ్యాతిఁ గాంచియుండెను. ఎల్లరకు నుదాహరణభూతులై శాంతాదిసుగుణభూషితులై సుశీలావేంకటాద్రిశర్మలు శిలానగరముననుండి సద్యశంబున నలంకృతులై యిప్పుడు నున్నవారు.

ఉ. జానుగ భూతికిం దొడవు సజ్జనభావము శౌర్యలక్ష్మికిన్
మానము నీతి విద్యకు శమంబు సుబుద్ధికి విత్తవృద్ధికిన్
దానము తాల్మి శక్తతకు ధర్మనిగూఢికదంభవృత్తియున్
బూనికతోడ సర్వగుణభూషణ మెన్నఁగ శీలమే సుమీ.

(ఏనుఁగు లక్ష్మణకవి.)

సంపూర్ణము.

ఓం శాంతిః శాంతిః శాంతిః.



చెన్నపురి : 'వావిళ్ల' రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.
P. I. O. Q. H. Ms. No. 22. 3—3-1947.

| | ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|---|
| ప్రాచీనదేశచరిత్ర (Ancient History) | ... | 1 | 12 |
| భేతాళునికథలు | ... | 0 | 8 |
| భారతరమణీమణులు, ప్రథమభాగము | ... | 0 | 12 |
| డిటో ద్వితీయభాగము | ... | 0 | 8 |
| భోజునికథలు | ... | 0 | 8 |
| భోజకాళిదాసకథలు | ... | 0 | 12 |
| మర్యాదరామన్నకథలు | ... | 0 | 2 |
| మహాభక్తవిజయము, చిత్రపటములతోసహా | ... | 4 | 0 |
| మదనకామరాజుకథ | ... | 0 | 14 |
| యజుర్వేద కథాసంగ్రహము | ... | 0 | 8 |
| రేచుక్క—పగటిచుక్క—కథ | ... | 0 | 3 |
| విక్రమార్కునికథలు | ... | 0 | 8 |
| వీరాంగనలు | ... | 0 | 12 |
| వైద్యులకథ | ... | 0 | 4 |
| శకుంతలచరిత్ర, చిన్నసైజు పటములతో | ... | 0 | 4 |
| శుకసప్తతికథలు | ... | 0 | 6 |
| షేక్స్పియర్ నాటకకథలు | ... | 1 | 8 |
| సంగ్రహభాగవతము, జనమంచి శేషాద్రిశర్మగారిది | ... | 1 | 0 |
| సంగ్రహభారతము ,, | ... | 1 | 0 |
| సంగ్రహరామాయణము ,, | ... | 0 | 10 |
| సంస్కృతనాటకకథలు, శ్రీ సీతారామశాస్త్రిగారిది | ... | 1 | 4 |
| సత్యసేనవిజయము | ... | 0 | 4 |
| సావిత్రిచరిత్ర, చిన్నసైజు, పటములతో | ... | 0 | 4 |
| ారలు కాంగ్రెసు ఉపన్యాసములు | ... | 0 | 2 |
| హరిశ్చంద్రచరిత్ర, చిన్నసైజు, పటములతో | ... | 0 | 6 |
| హితోపదేశము, వచనము, సులభశైలి | ... | 0 | 12 |

## జీవితములు.

| | | | |
|---|---|---|---|
| అనిబిసెంటుచరిత్రము | ... | 0 | 4 |
| ఆలీసోదరులజీవితము | ... | 0 | 4 |

| | | ప్రతి 1-కి రూ. |
|---|---|---|
| కరంచంద్ గాంధిజీవితము | ... | 0 |
| కృష్ణదేవరాయచరిత్రము | ... | 0 |
| గౌరాంగస్వామిజీవితము | ... | 0 |
| గైక్వారుగారి జీవితము | ... | 0 |
| క్రైస్తుజీవితము | ... | 0 |
| కెమాల్ పాషాజీవితము | ... | 0 |
| గోపాలకృష్ణగోక్లేజీవితము | ... | 0 |
| చిత్తరంజనదాస్ జీవితము | ... | 0 |
| తిలక్ మహారాజుచరిత్రము | ... | 0 |
| దాదాభాయినౌరోజీజీవితము | ... | 0 |
| నివేదితజీవితము | ... | 0 |
| నెపోలియన్ జీవితము | ... | 0 |
| బుద్ధచరిత్రము | ... | 0 |
| మదనమోహనమాళవ్యాగారిజీవితము | ... | 0 |
| మైరావణచరిత్ర | ... | 0 |
| రామదాసచరిత్రము, చక్క[illegible] | | |
| శ్రీరామదాసుగారి ప్రతిమకూడ కలదు | ... | 0 |
| డిటో కాలికోబైండు | ... | 1 |
| రానడేజీవితము | ... | 0 |
| రామకృష్ణపరమహంసజీవితము | ... | 0 |
| రామతీర్థజీవితము | ... | 0 |
| లాలాలజపతిరాయిజీవితము | ... | 0 |
| వివేకానందస్వామిజీవితము | ... | 0 |
| వేమనయోగిజీవితము | ... | 0 |
| శాలివాహనచరిత్ర | ... | 0 |
| శివాజిచరిత్రము | ... | 0 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.